





# కథలు

నీతి, పురాణ, పొడుపు

# కథా గుచ్ఛము-4





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010005554

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కథాగుచ్ఛము

## నాలుగవభాగము

## రవీంద్రనాథ ఠాకూర్



కాపమూరి వైకుంఠరా

490 [illegible] హైరోడ్

మద్రాసు

# వి ష య సూ చి క




| | | పుట. |
|---|---|---|
| మానభంజనం | ... | ౧ |
| ఆ ఒక్కరాత్రి | ... | ౨౨ |
| యుక్త వయస్సు | ... | ౩౩ |
| పోస్టు మాస్టర్ | ... | ౭౬ |
| శాస్త్రి | ... | ౯౦ |
| [illegible]కుదు వెర్రి | ... | ౧౧౪ |
| ముక్తి | ... | ౧౪౦ |
| మహాశ్వాయ | ... | ౧౬౦ |

# మానభంజనం

రమానాథశీలుగారి మూడంతస్తుల మేడలో, మీంది అంతస్తుగదిలో ఉండేది గోపీనాథ్ శీలుభార్య, గిరిబాల. పడక గది దక్షిణద్వారానికి ఎదురుగా తొట్టెలలో కొన్ని గులాబీ మొక్కలూ మల్లెమొక్కలూ ఉన్నవి. డాబా చుట్టూ ఎత్తు గోడ లున్నవి, కాని బయటికి చూడడానికి వీలుండేటట్టుగా ఆ గోడలలో అక్కడక్కడ ఖాళీలు ఉన్నవి. శయనగృహంలో విదేశస్త్రీల చిత్రపటాలు, రకరకాల దుస్తులు ధరించినట్టు కొన్నీ, దుస్తులు లేకుండా కొన్నీ, చట్రాలుకట్టి, గోడలకు వేలగట్టి ఉన్నవి. కాని లోనికిప్రవేశించే ద్వారానికి ఎదురుగా ఉన్న నిలువుటద్దములో కనబడుతూఉండే మహాశ్వేతసుందరి యొక్క ప్రతిబింబము, గోడలకుకట్టిన ఏబొమ్మకీ సౌందర్యములో తీసిపోదు.

ఆమె సౌందర్యము ఆలోకిస్తూఉంటే, సప్రాభంగ మనస్సుకు వచ్చినచైతన్యంలాగున, అకస్మాత్తుగా వచ్చి మనసు కొట్టుతుంది, కొట్టి వివశంచేసేయగలదు. ఆమె మన కంటబడ గానే ఇట్లాంటిసౌందర్యము చూడడానికి [illegible] రాలేదే అని మనకు తోస్తుంది. ఆ రూపును మనము ఎక్కడా ఎన్నడూ చూచిఉండము.

గిరిబాల లావణ్యోచ్ఛ్వాసముతో తరంగిత మవుతున్నది. మదిరములోని ఫేనము ఏవిధముగా పాత్రలోనుంచి పొంగి పైనపడుతూ ఉంటుందో, అదేరీతిని ఆమె నవయౌవనము, ఆమె ముగ్ధసౌందర్యము, సర్వాంగాలనూ నింపి పొంగి పడు తున్నది. ఆమె చీరకట్టులోనూ, ధరించే ఆభరణాలలోనూ, కంకణకింకిణములోనూ, మెడవిరుపులోనూ, చంచలగమనము లోనూ, చేతులవిసురులోనూ, ఉజ్వలదృష్టిలోనూ—దేనిలో చూచినా ఆమె లావణ్యముయొక్క విరగబాటే కనబడు తుండేది.

సర్వాంగాలలోనుండి ఊరుతున్న లావణ్యమదిర రసము ఆమెకు నిషా ఎక్కిస్తుండెను. లేతరంగుచీరతో తన నిండుశరీరాన్ని ముస్తాబుచేసి, అకారణంగా చంచలమైన మనస్సుతో, డాబామీదను ఇటూ అటూ తరుచు పచారిచేస్తూ కనబడేది. తనలోపల పుట్టుతున్న అశ్రుతసంగీతముయొక్క తాళానికి ఆమె అంగప్రత్యంగాలు నృత్యంచేయ కోరుతున్న ట్లుండెను. అంగాలను నానారీతుల నిలుపుతూ, ఆడించుతూ, విసురుతూ ఉండడమే ఆమెకు ఆనందకరముగా ఉన్నట్లుండెను. నలుదిక్కులా తరంగాలు పుట్టించి, వాటి చిత్రవిచిత్ర ఘాతప్రతి ఘాతాలవల్లకలిగిన గగుర్పాటును అనుభవిస్తూ, ఆనందిస్తూ ఉండేది. హఠాత్తుగా చెట్టునుండి ఒక ఆకుని తెంచి కుడి చేతితో ఆకాశమువేపు ఎగరవేసేది. ఆమెగాజులు ఘల్లు ఘల్లుమనేవి, పైటచెంగు ఎగిరేది, ఆ సులలితబాహుభంగి,

కాని పెళ్ళిఅయిన కొత్తరికం భర్తవల్ల ఆమె చాలా ఆదరంపొందేది. అతడప్పుడు స్కూల్లో చదువుతుండేవాడు, పెద్దవాళ్లు మధ్యాహ్నం నిద్రపోతూఉంటే, దొంగతనంగా స్కూలునుంచి పారిపోవచ్చి భార్యతో ప్రణయాలాపం చేస్తూ ఉండేవాడు. ఇద్దరూ ఒక్కఇంట్లోనే ఉన్నా, అధికవిలువగల చక్కని లెటరుపేపర్లు తెచ్చి, భార్యకు ఉత్తరాలు వ్రాస్తూ ఉండేవాడు; స్కూలులో తనస్నేహితులను అతిగర్వంగా ఆ ఉత్తరాలు చూపిస్తుండేవాడు. లేనికారణాలు కల్పించి భార్యతో ప్రణయకలహాలుచేసి ఆనందిస్తుండేవాడు.

అట్లా ఉంటూఉండగా తండ్రి మరణించడం సంభవించి, గోపీనాథ్ ఇంటికి పెద్దఅయినాడు. పచ్చికర్రను అతిత్వరలో పురుగుపట్టేస్తుంది; ఆలాగునే అల్పవయస్సులో ఇంటికి యజమానైన గోపీనాథుని అనేక నవపురుగులు పట్టుకొన్నవి. అంతఃపురానికి గోపీనాథుని రాకపోకలు క్రమక్రమంగా తగ్గిపోయినవి, రాకపోకలు ఇతరచోట్లకు ప్రారంభమైనవి.

నాయకునిపదవిలో ఉండడంవల్ల మనుష్యుడు పొందగల ఉత్తేజనం అనేకులను ఆకర్షిస్తుంది. అది ఒకనిసామాన్యస్థితు, లెక్కలేనిప్రజలపై తన ప్రభావాన్ని విస్తరింపజేదామని దుర్జయమైన కోరిక నెపోలియన్‌కు ఉండేది అంటారు. మనఇంట్లో చిన్నసభను ఏర్పరిచి, ఆ సభ్యులకు చిన్ననాయకుడు కౌదామని మనకుఉండే కోరికకూడా ఆ జాతిదే. చిన్న ఆస్థాన మొకటి

సృజియించి, పనికిమాలిన పెద్దమ్మలను పదిమందిని జమచేసి వాళ్లకు నాయకుడయి వాళ్లు 'బేష్ బేష్' అంటూఉంటే అపరిమితానందము పొందేవాళ్లు చాలామంది ప్రపంచంలో ఉన్నారు. ఆ ఉత్తేజనముచే ఆకర్షించబడి ఎంతమంది తమ ఆస్తులను అమ్ముకొని, ఋణాలపాలై, నీతిమార్గము వదులుకోడానికి సంసిద్ధులౌతున్నారు.

తన చిన్నసభకు అధ్యక్షుడైనాడు గోపీనాథుడు, ఆ గౌరవం అతన్ని ఉన్మత్తునిచేసింది. ఆ సంఘములో రోజుకు రోజూ కొత్తగా కీర్తి, గౌరవమూ సంపాదిస్తుండెను. ఏవిషయంలోనూ ఇంత ప్రతిభాశాలి మరి ఉండడు అని ప్రతివాని నోటా విని తన కర్తవ్యాన్ని, తన సుఖదుఃఖాలన్నీ, పూర్తిగా మరిచిపోయి, నదీప్రవాహములోని సుడిలాగు రాత్రింబగళ్లు గిరగిర తిరగడం మొదలుపెట్టాడు.

ఇవతల, జగత్తును జయించగల సౌందర్యంతో గిరిబాల తన శయనగృహాంతరాస్యసింహాసనముమీద కూర్చొని ప్రజాహీన అంతఃపురరాజ్యాన్ని పరిపాలిస్తుండెను. భగవంతుడు ఆమె చేతిలో రాజదండం ఉంచాడని గిరిబాల నమ్మకం. మేడ గోడ కిటికీలలోనుంచి కనబడుతుండే సువిశాలజగత్తును కేవలం కనుచూపులతో తాను జయించిరాగలదని గిరిబాల విశ్వాసం. కాని ఒక్కమనిషినైనా ఇప్పటివరకు జయించలేకపోయింది.

మంచి రసికతలగలదాసి ఒకఆమె గిరిబాలదగ్గర ఉండేది,

ఆమెపేరు సుధ—సుధాముఖి; చాలా చక్కగా పాడేది, నృత్యం
చేసేది. పద్యాలు వ్రాసేది, గిరిబాల రూపుచూచి పొంగి
పోయేది. అద్భుతమైన ఆ సౌందర్యము ఆ భర్తవంటి అరసికుని
చేతపడి వృథాఅయిపోతున్నదని దుఃఖించేది. ఈ సుధ లేక
పోతే గిరిబాలకు తోచేదికాదు, ఉండిఉండి సుధను పిలిచి
నానారకాలుగా తిరగాబోర్లావేసి తన సుఖలాసౌఖ్యాన్ని
గురించి ఆమెతో వాదనచేస్తుండేది; మధ్యమధ్య సుధాముఖి
అభిప్రాయాలకు విరుద్ధంగా మాట్లాడి, ఆమె అబద్ధాలకోరు
అనీ, స్తోత్రపాఠకురాలుఅనీ, అనేది. సుధ తాను చెప్పేదంతా
మనస్ఫూర్తిగా నమ్మే చెబుతున్నానని ఒట్టుపెట్టుకొని చెప్పేది.
ఇదంతా గిరిబాల ఎరిగినదే, కనుక ఆమెలో నమ్మకం కలిగించ
డానికి ఆట్టేసేపు పట్టేదికాదు. అయినా సుధ పొగడుతూ ఉంటే
ఆమెశరీరంలో పులకరింపు పుట్టేది.

సుధ ఒకపాట పాడి గిరిబాలకు తరుచుగా వినిపించేది.
దాని మొదటిచరణము—పారాణితో ఎఱ్ఱగాఉన్న తన
అనింద్య సుందర పాదపల్లవముల స్తవమే నని గిరిబాల
అనుకొనేది; తన పాదపద్మములసన్నిధి దాసుడు పడిఉండి
నట్లు ఆమె మనోనేత్రానికి కనబడేది. కాళ్ళగజ్జెలతో జయ
గానము చేసుకొంటూ ఆమేడమీద, ఆ శూన్యతలో,
ఆమె తిరుగుతూ ఉండడమే కనబడేది కాని, ఆపాటలో ఉపహా
రించినట్టుగా తన స్వాతంత్ర్యాన్ని వదులుకొని దాసు డొకడూ
ఆమె చరణకమలములఎదుట కనబడలేదు.

గోపీనాథుడు దాసుడయి పడిఉండడము గిరిబాల పాదాలదగ్గిర కాదు; "లవంగ" అని పేరుగల రమణియొక్క పాదపద్మములకడ. ఆమె నాటకాలలో అభినయించేనేది. ఆమె స్టేజిమీద అత్యద్భుతముగా మూర్ఛపోయేది; వెక్కి వెక్కి మాయఏడుపు ఏడుస్తూ, ముక్కుతో, "ప్రాణనాథా" "ప్రాణే శ్వరా," అని సగముసగము ఉచ్చారణచేస్తూ ఉండేది—అది చూచి, వేస్టుకోట్లూ, పూలమేజోళ్లూ తొడుగుకొని, పలచని ధోవతులు కట్టుకొని ఫస్ట్‌క్లాస్ కుర్చీలమీద కూర్చున్న దర్శకమండలి ఆవేశంతో, "ఎక్స్‌లెంట్, ఎక్స్‌లెంట్!" అని కేకలు వేసేవారు.

ఈ అభినేత్రిలవంగయొక్క అద్భుతశక్తిని గురించి భర్తనోట గిరిబాల ఇంతకుపూర్వము అనేకసార్లు విన్నది. భర్త అప్పటికింకా పూర్తిగా పలాతకుడు కాలేదు. లవంగచే అతడు ఇంత ఆకర్షించబడుతున్నాడని అప్పటికి గిరిబాల ఎరుగదు. అయినా ఆమెకు అసూయకలిగింది. తనకులేని మనోరంజనీవిద్య ఇంకెవరికైనా కలదని తెలిస్తే ఆమె సహించలేకపోయేది— ఈర్ష్యకలిగింది. కుతూహలము పుట్టి థియేటరుకు తీసుకువెళ్ల మని భర్తను ఆమె అనేకమార్లు కోరింది, కాని అతని అను మతి సంపాదించలేకపోయింది.

చివరకు ఒకనాడు టిక్కెట్టుకు డబ్బిచ్చి, సుధను పంపింది,

అభినయం చూచిరమ్మని. దాని చూచివచ్చి "రాము రాము", అంటూ ముక్కూమూతీ విరుచుకొంటూ, మగవాళ్లమనస్సులను ఆకర్షించడానికి అక్కడినటులు చేసే అభినయం కొంచెము కనపరిచి, ఆ నటులు ఎంత కురూపినులో, అక్కడి వ్యవహారమంతా ఎంత అసహ్యకరంగా ఉంటుందో సవిస్తరంగా చెప్పింది. విని గిరిబాలమనస్సు మహా కలతజెందింది. కాని భర్త ఆమెను పూర్తిగా విడిచిపెట్టి లవంగ వెంట పడటంచేత, ఆమెకు కొంచెము సందేహం కలిగింది, సుధాచెప్పినది నిజం కాదేమో అని. తనమాట గిరిబాల నమ్మడం లేదని చూచి సుధ నగముకాలిన కర్రబొమ్మకు చీరకట్టిస్తే ఏలాగుఉంటుందో లవంగి ఆలాగు ఉంటుంది అని, యజమానురాలి పాదాలు ముట్టుకొని చెప్పింది. ఆలాంటి స్త్రీ, తనభర్తను ఎట్లా ఆకర్షించగలిగిందో గిరిబాల నిర్ణయించలేకపోయింది, కాని ఆమె అహంకారానికిమాత్రం దెబ్బతగిలి బహుబాధపడుతుండెను.

ఒకనాడు సుధను తోడ్చుకొని నాటకము చూడడానికి వెళ్లింది—నిషేధింపబడ్డపని చేయబోతున్నప్పుడు మనకు బహు ఉద్రేకంగా ఉంటుంది. గిరిబాలహృదయంలో కంపము పుట్టింది. అప్పుడు ఆమెకంటికి దీపమయమైన ఆ లోకసముద్రమూ, వాద్యసంగీతాలతో ముఖరిత మౌతున్న ఆనాటకశాలా, చిత్రవిచిత్రమైన తెరలు వేలగట్టిఉన్న ఆ రంగభూమీ—ఇవన్నీ ఆ తొట్రుపాటుతోఉన్న గిరిబాలకు బహు అద్భుతంగానూ అపు

రూపస్వప్నసవిగానూ కనబడ్డది. గోడలమధ్యనున్న ఆమె-సృజన సంగీతమయ అంతఃపురంలోనుంచి ఈ రమ్యమైన ఉత్సవస్థలానికి వచ్చినది. అంతా ఆమె కంటికి ఒక స్వప్నంలాగు కనబడు తుండెను.

ఆ నాటిరాత్రి "మానభంజనం" అనే 'ఆపే రా'—సంగీత నాటకం—జరగబోతుంది. ఘంటవాగింది, వాద్యం ఆగింది, సభ్యులు తెప్పపాటులో మాటలు మాని నిశ్శబ్దంగా కూర్చున్నారు. స్టేజిముందరి దీపాలకాంతి అధికమయింది, తెరలేచింది. చక్కగా ముస్తాబైన కొందరుబాలికలు వ్రజాంగనల వేషము వేసికొని పాడుతూ నృత్యము చేస్తూ రంగభూమి మీదికి వచ్చారు. సభ్యులు, మెచ్చుకొంటూ, వేసిన కేకల తోను, చప్పట్లతోను నాట్యశాల దుంపిదుంది కంపిస్తున్నట్లు ఉండెను. గిరిబాల తరుణదేహంలో ఉద్రేకం కలిగి ఆమె రక్త ప్రవాహములో పెద్దఅలలు పుట్టినట్టయింది. ఆ వేషాల యొక్క ఆభరణాలయొక్క తళుకువల్లా, ఆకేకలవల్లా గిరి బాల, అకస్మాత్తుగాను, తన సంసారమూ తన సంఘమూ—అన్నీ మరచిపోయింది. సాంఘికనియమాలన్నీ కరిగి మనోహర స్వప్నసమూహము తనను బంధహీనను చేసినవని ఆమెకుతోచింది.

సుధ మధ్యమధ్యవచ్చి, "ఇక వెళ్ళిపోదాము రా, అమ్మా బాబుగారు చూచారంటే చాలా ప్రమాదము," అని అంటూ

ఉండెను. గిరిబాల వినిపించుకోలేదు, ఆమె మనస్సులో ఇప్పుడు భయమన్నది లేదు.

అభినయం నడుస్తున్నది—అభిమానానికి దెబ్బతగిలి రాధకు పౌరుషము కలిగింది, కృష్ణుడు ఎంతో వేడుకొంటాడు కాళ్లు పట్టుకొంటాడు, ప్రార్థిస్తాడు, ఏడుస్తాడు—కాని ఏమీ ప్రయోజనం ఉండదు. గిరిబాల హృదయం గర్వంతో పొంగిపోయింది. కృష్ణుని అవమానంచూచి, తాను రాధఅయి తన ప్రతాపాన్ని ఊహించుకొంటూ తృప్తిపొందింది. ఆమె అవమానింపబడి పరిత్యజింపబడ్డ ఇల్లాలు. అయినా అప్పటి పట్టుకు ఆ సంగతి మరచి తనకు కూడా జాలి లేకుండా ఏడ్పించ గల శక్తిఉన్నదని ఆమె అనుకొన్నది. సౌందర్యానికి గల దుర్దాంతప్రతాపాన్ని గురించి గిరిబాల ఇదివరకు విని ఉన్నది. విని ఊహించుకొనేది. కాని నేడు ఆ దీపాల కాంతిముందర, మనోహరమైన పాటలతో ప్రతిధ్వనిస్తున్న రంగభూమిమీద, స్వయంగా తనకళ్లతో తానే చూచింది, నిజంతో స్పృశించింది.

చివరకు తెరపడ్డది, దీపాలవెలుతురు తగ్గింది, ప్రేక్షకులు మెల్లిమెల్లిగా నాటకశాలనుండి బయటికి పోతున్నారు. కాని గిరిబాల మెదలకుండా కలగంటున్నదానివలె కూర్చొనిఉన్నది, లేచి ఇంటికి వెళ్లవలెనని ఆమెకు తట్టలేదు. నాటకము అంతమయిందని ఆమెకు తోచలేదు, మళ్లీ తెరలేస్తుంది అన్నట్టుగానూ, శ్రీకృష్ణుని పరాభవముతప్ప జగత్తులో ఇంకేవిషయమూ

లేపస్తున్నట్టుగానూ, కూర్చొనిఉండెను. సుధ వచ్చి, "లే అమ్మా, అలాగు కూర్చున్నావేమిటి? దీపాలు ఆర్పి తలుపులు మూసేస్తాను," అని అన్నది.

చాలా రాత్రి అయింది, గిరిబాల ఇంటికివచ్చి పడకగది లోకి వెళ్ళింది. మూలను దీపమొకటి మిణుకు మిణుకు మంటుండెను, గదిలో ఎవరూ లేరు, ఇంట్లో ఎటువంటి శబ్దమూ లేదు, ఖాళీమంచానికి కట్టిన పాత దోమతెర గాలికి కదులుతుండెను. సంసారం ఆమెకు రసహీనంగానూ సౌందర్యరహితం గానూ కనబడటం ఆరంభమయింది. సౌందర్యంతోనూ, సంగీతంతోనూ, కాంతితోనూ నిండిఉన్న ఆస్థల మెక్కడ, ఈదిక్కున్న సంసార మెక్కడ! దీనిని, జగత్తును కేంద్రస్థలముగా చేసి, ఇక్కడినుంచి తన మహిమను విరాజిల్ల చేయగలదా? ఇక్కడ తానొక, ఎవరూ ఎరుగని, అనామానిక స్త్రీ మాత్రమే కదా!

అప్పటినుండి ఆమె ప్రతివారమూ థియేటరుకు వెళ్ళడం మొదలుపెట్టింది. కాని రానురాను మొదటనుండే వ్యామోహం తగ్గిపోయింది. నటీనటుల రూపూ, వాళ్ళ ముఖాలకు పూసుకొనే రంగులూ, వాళ్ళ దొంగవేషాలూ, దొంగప్రేమా—అన్నీ తెలుస్తూనే ఉన్నది. అయినా నాటకమంటే అభ్యాసమయిపోయి వెళ్ళడం మానేదికాదు. రణభేరి వినగానే యోధుని హృదయం నృత్యంచేస్తుంది, అదేవిధంగా

స్టేజిమీదనుంచి తెరలేచేసరికి గిరిబాల హృదయంలో ఆందోళన పుట్టేది. సంసారానికీ దీనికీ ఎంతదూరము, ఎంత వ్యత్యాసము! అతిసుందరంగానూ, ఎత్తుగానూ ఉన్న వేదిక, బంగారు రంగుపూయబడి, చిత్రపటాలతో అలంకరించబడి, కావ్య సంగీతాలతో నిండిఉన్న మాయలోకము—ఎటుచూచినా దీపమాలలు, లెక్కలేనంతమంది ప్రేక్షకుల ముగ్ధనేత్రాలు! విశ్వవిజయిని అయిన సౌందర్యరాజ్ఞికి ఇటువంటి సింహాసనం మరి ఎక్కడ దొరకగలదు?

తన భర్త నాటకశాలలో ఒకానొక నటియొక్క అభినయంచూచి ఉన్మత్తుడవుతుండడం మొట్టమొదట చూచిన నాడు, గిరిబాలకు భర్తయెడల భరించలేని అసహ్యం కలిగింది. "నా భర్త నా రూపుచే ఆకర్షించబడి, రెక్కలుకాలిన పతంగం వలె వచ్చి నా కాళ్లదగ్గిర పడినయెడల, నా పాదాలతో అతనిని దూరముగా తోసివేసి, నా పౌరుషం నిలుపుకొని వెళ్ళిపోగలిగితే, అప్పుడే నా వ్యక్తిజీవితమూ నా స్త్రీయౌవనమూ సార్థకమవుతవి," అని గిరిబాల క్రుంగుతున్న తనమనస్సులో అనుకొనేది.

కాని ఆ శుభదినం ఇంతకంతకు దూరమవుతున్నట్టుండేను. ఇప్పుడు గోపినాథుని దర్శనమే దుర్లభమయింది. తుఫానుగాలిని కొట్టుకొనిపోతుండే ధూళిధ్వజంలాగు తానూ తనదళమూ ఎక్కడెక్కడ తిరుగుతున్నారో గిరిబాల ఎరగనే ఎరగదు.

చైత్రమాసంలో వసంతపౌర్ణమినాడు గిరిబాల వూదారంగు చీరఒకటి కట్టుకొని డాబామీద కూర్చొని ఉన్నది, దక్షిణపుగాలికి పైటచెంగు ఎగురుతున్నది. ఇప్పటికి కొన్నాళ్లయింది భర్త ఇంటికి రావడమే లేదు, అయినా గిరిబాల పూర్వం మోస్తరుగానే రోజు కొకచీరా రోజు కొక ముస్తాబూ మానలేదు. ముత్యాలూ వజ్రాలూ తాపిన ఆభరణాలు జలజలమంటూ ఆమెకు ఉత్సాహం కలిగించేవి, ఘల్లుఘల్లుమని శబ్దంచేస్తూ ఉండే ఆభరణాలు నలు దిక్కులా అలలను పుట్టించేవి. నేడు చేతికి బాజుబందు పెట్టుకొని ఉన్నది, మెడలో ముత్యాలూ కెంపులూ కలిసిఉన్న హారము, ఎడమచేతి చిటికెనవేలికి నీలముతాపిన ఉంగరము. సుధ ఆమెకాళ్లదగ్గిర కూర్చొని, పత్రికలువలలాగునఉండే అత్యంతకమనీయమైన గిరిబాల పాదాలపైని, ఉండిఉండి చేతులువేస్తూ, సకలప్రేమతోనూ, ఆదరముతోనూ, ఈవిధంగా అంటూఉండెను—"అమ్మా నేనే పురుషుణ్ణి అయిఉంటే నీ రెండుపాదాలూ నాగుండెమీద పెట్టుకొని చచ్చిపోయి ఉండేను." స్తోత్రము విని గిరిబాల పొంగిపోయి, నవ్వుతూ, "నీవు చచ్చిపోతే నే నిట్లా కాళ్లు చాపుకు కూర్చోగలిగి ఉంటాను?" అని అనేది.

నిండువెన్నెలలో, ఆ నిర్జనమైన డాబామీద కూర్చొని సుధ ఆ మునపటిపాట పాడుతున్నది.

రాత్రి పదిఘంటలయింది. ఇంటిలోనివారందరూ భోజనాదులు ముగించి పడుకోడానికి వెళ్లారు. ఆగ్రహంతో గుమ్‌గుమ్ మంటూ, కండువా ఎగిరించుకొంటూ గోపీనాథ్ అంతఃపురంలోనికి వచ్చాడు. సుధ నాలుక పైకిపెట్టి ముసుగు ముందుకు మాటిమాటికి లాగుకొని, గాబరాగాబరాగా, ఎగఊపిరితీసుకొంటూ, అక్కడనుంచి పారిపోయింది.

రోజులు వచ్చాయి అనుకొన్నది గిరిబాల, ముఖమెత్తి చూడలేదు. నాటకములోని రాధవలె పౌరుషంతో మెదలకుండా కూర్చున్నది. కాని తెర మీదికి పోలేదు, నగగాయితో అలంకరించబడిన శిరస్సు ఏదీ ఆమె కాళ్లమీద పడలేదు, పాట వినబడలేదు, సరేసరి—కర్కశస్వరంతో, "ఏదీ నీ తాళము చెవులు ఇయ్యి చూదాము," అని గోపీనాథ్ అన్నాడు.

ఆ వసంతఋతువులో ఆనాటి సింపువెన్నెలలో, అన్నాళ్లకు కలుసుకొన్నప్పుడు జరగవలసిన సంభాషణా యిది! కావ్యాలలోనూ, నాటకాలలోనూ, నవలలలోనూ, వ్రాసేవన్నీ ఉత్త అబద్ధాలు! ప్రియుడు పాటపాడుకొంటూ వచ్చి ప్రేయసికాళ్లమీద పడడం నాటకరంగభూమిమీదమాత్రమే. ఆదృశ్యం చూడగానే మనస్సు కరిగిపోయిన్న మనుష్యుడే వసంతపౌర్ణమినాడు తన డాబాపైనున్న, నిరుపమాన సౌందర్యంగల తన యువతీభార్య దగ్గిరకివచ్చి, "ఏదీ నీతాళముచెవులు ఇయ్యి చూదాము," అన్నాడు—ఏమున్నది

అందులో — సంగీతమూ, మాధుర్యమూ, అనురాగమూ, మోహమూ !

ప్రపంచములోని కావ్యసముదాయం అవమానం పొంది, పశ్చాత్తాపము వెలువరించిన దీర్ఘనిశ్వాసమువలె, దక్షిణ వాయువు వికసించిన మల్లెపూలసౌరభముతో నిండి, వీచుకు పోయింది. గిరిబాల జుట్టు విడి ముంగురులు ముఖాన్ని కప్పినవి, సుగంధంతో నింపిఉన్న వాసంతి చీరచెంగు ఎగిరిపోయింది. మానం విడిచి గిరిబాల లేచి భర్తచెయ్యిపట్టుకొని, "తాళాలు ఇస్తాను, ముందు గదిలోకి పద," అని అన్నది. నేడు ఆమె, "కళ్లనీళ్లు పెట్టుకుంటూను, అతని కళ్ల వెంట నీళ్లు తెప్పిస్తాను, ఏకాంతంగా ఇన్నాళ్లూ ఊహిస్తున్నదల్లా సార్థకపరుస్తాను, నా బ్రహ్మాస్త్రాలను ప్రయోగించి జయంపొందుతాను,"—ఇదంతా జరిగించి తీరవలెనని దృఢసంకల్పము చేసుకొన్నది.

"అట్టే వ్యవధి లేదు తాళాలు త్వరగా ఇయ్యి," అని గోపీనాథ్ అన్నాడు.

"తాళాలు ఇస్తాను, తాళంవేసిన ఇనపపెట్టెలో ఉన్నవన్నీ కూడా ఇస్తాను, కాని ఇవ్వాళమాత్రము నీవు ఎక్కడికీ వెళ్ల డానికి వీలులేదు," అని గిరిబాల అన్నది.

గోపీనాథ్—"అలాగు వీలులేదు, నాకు ముఖ్యంఅయిన పని ఉన్నది, ఈవాళ."

గిరిబాల—"అట్లాగైతే నేను తాళము చెవులు ఇయ్యను."

గోపీనాథ్—"ఇస్తావు, ఎలాగు ఇవ్వవో చూడనూ!" అని అంటూ ఆమె పైటచెంగుచూచాడు, తాళాలు లేవు. అద్దము పెట్టుకుండే పొడుగు తీసిచూచాడు, తాళపుచెవులు లేవు, బొట్టుపెట్టె పగలగొట్టాడు, అందులో కుంకుమభరిణీ, కాటుకడబ్బా, దువ్వెనా, జుట్టుకట్టే దారమూ మొదలైనవన్నీ ఉన్నవి, కాని తాళాలగుత్తి లేదు; పరుపుమీది దిళ్ళు తీశాడు, పరుపెత్తి అంతా చూచాడు, తాళాలు లేవు, అలమారతలుపులు విరగగొట్టి, సామానంతా నాలుగవేపులా విసిరేశాడు, తాళాలు ఎక్కడా కనబడలేదు.

గిరిబాల నిశ్చాంతపోయి, తలుపుపట్టుకొని, గోడవంక చూస్తూ నిలుచున్నది. సాధించలేక గోపీనాథ్ కోపంతో మండిపడుతూ, భార్యదగ్గరికివచ్చి, "తాళాలుఇయ్యి, ఇవ్వక పోతే చాలా ప్రమాదం జరుగుతుంది," అన్నాడు.

గిరిబాల ఒక్కమాట అనలేదు. గోపీనాథ్ ఆమెను రెండుచేతులతో గట్టిగా పట్టుకొని చేతినున్న బాజుబందులు, మెడలోనున్న హారమూ, వేలినిఉన్న ఉంగరమూ, తీసికొని ఆమె నొకతాపు తన్ని బయటికి వెళ్లిపోయినాడు.

ఇంట్లో ఎవరికీ నిద్రాభంగము కలగలేదు. వీధిలో ఎవరూ ఏమీ ఎరగరు, వెన్నెటరాత్రి అదేవిధంగా

నిశ్శబ్దముగా ఉండెను. సమస్తమూ శాంతిమయముగానే కనబడుతుండెను. కాని హృదయములోనుండివచ్చే కేకలు బయటికి వినబడేమార్గముండుంటే, ఆ హాయిగా నిద్రిస్తుండే జ్యోత్స్నానిశీథిని ఒక దుఃఖకరమైన తీవ్రరోదనమువల్ల విదీర్ణ మయిఉండదు. గుండెపగలగొట్టే ఇంతఘోరమైన ఘటనలు ఇంత నిశ్శబ్దముగా జరుగుతుంటవి కదా!

ఆరాత్రి గడిచిపోయింది. ఎంత పరాభవం, ఎంత అవ మానం! గిరిబాల సుధతోనైనా చెప్పలేకపోయింది. ఆత్మ హత్యచేసుకొందామని అనుకొన్నది, అపూర్వమైన తన సౌంద ర్యాన్ని, తన యౌవనాన్ని ముక్కముక్కలుగా కొట్టి నాశ నముచేసి, గోపీనాథునిమీద కసితీర్చుకొందామని అనుకొన్నది. కాని తక్షణమే మళ్లా అనుకొన్నది—"దానివల్ల ఎవరికీ, ఎటు వంటినష్టమూ కలగదే! నామృత్యువువల్ల ప్రపంచానికి కలిగిన నష్టం ఎవరిఅనుభవంలోకీ రాదే. నేను జీవించి సుఖపడ లేదు, ఆవిధంగా చచ్చిపోవడంవల్లమాత్రం ఏమి తృప్తి కలగుతుంది?"

"అమ్మగారిఇంటికి వెళ్లిపోతాను," అన్నది గిరిబాల— అమ్మగారిఇల్లు కలకత్తాకి చాలా దూరము. అందరూ వద్దు అన్నారు, కాని ఆమె ఇంటికిపెద్ద, ఎవరిమాటా లక్ష్యపెట్టలేదు, తనకూడా ఎవరినీ తీసుకొనివెళ్లలేదు. గోపీనాథ్‌కూడా

దళబలసమేతుడై నౌకావిహారము చేసుకొంటూ బయలుదేరాడు, ఎక్కడికివెళ్లాడో ఎవరికీ తెలియదు.

౨

గాంధర్వథియేటర్‌లో ప్రదర్శింపబడే ప్రతిరిహార్సల్‌కీ గోపీనాథ్ వెళుతూఉండేవాడు. 'మనోరమ' నాటకసమయాలలో లవంగ మనోరమ పాత్ర తీసుకొనేది. గోపీనాథ్ తన జట్టుగాళ్లతో కలిసి మొదటివరస కుర్చీలలో కూర్చొని "బేష్" "హాహా" "శాబాష్" అంటూ కేకలువేస్తూ పూలబంతులు స్టేజిమీదికి విసురుతూ ఉండేవాడు; నాటకానికి వచ్చినవాళ్లకు చీకాకు పుట్టిస్తూ ఉండేవాడు. అయినా నాటకపరిషద్వారలు ఇతని అల్లరికి అడ్డురావడానికి సాహసించలేకపోయినారు.

చివరకొకనాడు గోపీనాథ్ నిషాలో పక్కనుంచి స్త్రీలు వేషాలువేస్తుండే 'గ్రీన్‌రూమ్'లో ప్రవేశించాడు. ఏదో సామాన్యవిషయాన్ని గురించి మాటమాట వచ్చి ఒక నటిని గట్టిగా కొట్టాడు. ఆ స్త్రీ వేసిన కేకలూ, గోపీనాథుని తిట్లూ నాటకశాలకప్పును ఎగరగొట్టుతున్నవి, అందరూ ఆశ్చర్యపడి చూస్తున్నారు. అధికారులు ఓర్చి ఊరుకోలేక పోలీసువాళ్లసహాయంతో గోపీనాథుని బయటకి పంపేశారు.

వాళ్లమీద పగతీర్చుకొనిగాని వదిలిపెట్టను అని గోపీనాథ్ నిశ్చయించుకొని కూర్చున్నాడు. థియేటర్ అధికార్లు పెద్దసందడిచేస్తూ ఒకనెలముందునుంచీ, "మనోరమ"

అనే కొత్తనాటకం, దుర్గపూజరోజులలో, ప్రదర్శిస్తామని చాటుతున్నారు, పెద్దపెద్ద పటాలతో, కలకత్తా నగరాన్ని నింపేశారు—ఆ విఖ్యాత గ్రంథకర్త పేరు నామావళిగా ఆవర్తించి, నామావళి ఒత్తించిన దుస్తులు రాజధానికే తొడిగించేశారా అనిపించింది.

సరిగా ఆసమయంలో నాటకములోని ప్రధానాభినేత్రి లవంగను, తీసుకొని గోపీనాథుడు నావికాయాత్రకై బయలు దేరాడు, ఎక్కడికి వెళ్ళాడో ఎవ్వరూ ఎరగరు.

థియేటరు అధికారవర్గము పరితాపసముద్రంలో పడ్డారు. లవంగ వస్తుందేమో అని కొన్నాళ్లు కనిపెట్టుకొనిఉండి, ఆమె రాకపోవడమునుచూచి మరి ఒక అభినేత్రికి మనోరమపార్టు నేర్పి నాటకం జరిపించారు. కాని దీనివల్ల ప్రథమ అభినయం కొన్నిరోజులు వెనకకు పెట్టవలసివచ్చింది.

కాని అభినయం అత్యాశ్చర్యకరంగా జరిగింది, షూప్పు వల్ల ఎట్టికొరతా కలగలేదు, థియేటరులో ఇసకవేస్తే రాలలేదు, పంపేలుపంపేలు స్థలముదొరకక తిరిగి వెళ్ళిపోయినారు. మర్నాడు పత్రికలలోని పొగడతలకు మితిలేదు. దూర దేశంలో భ్రమణం చేస్తున్న గోపీనాథుడు దీనినిగురించి పత్రికలద్వారా తెలుసుకొన్నాడు; దుఃఖమూ, ద్వేషమూ పట్టలేక నాటకంచూడాలని కలకత్తా తిరిగివచ్చాడు.

తెరలేవగానే, నాటకప్రారంభంలో మనోరమ అత్త

వారింట ఉంటుంది; అతి దైన్యావస్థ; సంకోచంతో నిండి, మిక్కిలి నమ్రతకలిగి, ముసుగువేసుకొని ఉంటుంది, ముఖము కనబడనే కనబడదు, నోట మాటలేదు.

నాటకము చివరభాగంలో, భర్త మనోరమను పుట్టింటికి పంపించేసి, ఒక గొప్పఇంటి పిల్లను రెండో భార్యగా తెచ్చుకోవలెనని ప్రయత్నిస్తాడు. పెళ్లి అయిపోతుంది, శోభనపుగదిలోనికి వస్తుంది వధువు; చూచేసరికి ఆ మనోరమే ఈమె—కాని ముసలటి దాసివేషం పోయింది, సహజమ సౌందర్యమూ యౌవనమూ కలిగి, చక్కనిబట్టలు కట్టుకొని, ఆభరణాలతో వస్తుంది. పసిబిడ్డగా ఉన్నప్పుడు మనోరమను ఎవరో దొంగిలించుకొనిపోతారు, ఆమె పేద ఇంటిలో పేద దానిలాగునే పెరిగి పెద్దదయింది. జూచేవారికి మంత్రి తన గృహానికి తీసుకువచ్చి తన పదవికి తగినట్టుగా గొప్ప వైభవంతో తిరిగి పెళ్లిచేస్తాడు.

తరవాత శయ్యాగృహంలో రెండోవధువు దర్శనం దొరికి మానభంజనము జరుగుతుంది. కాని అభినయం ఇంత వరకు జరిగింది, అప్పుడు దర్శకుల మధ్య గొప్పగందరగోళ మొకటి ప్రారంభమయింది. మనోరమ మురికిబట్టలతో, ముసుగువేసుకొని దాసిలాగు ఉన్నంతసేపూ గోపీనాథ్ మెదలకుండా కూర్చొనిఉండెను, కాని చివరకు ఆమె శోభనపు

గదిపృశ్యంలో తళుకుబెళుకు మంటూఉండే ఆభరణాలు పెట్టుకొని, గులాబిరంగుచీర కట్టుకొని, ముసుగు వెనకకుజరిపి, సౌందర్యతరంగాలతో రంగస్థలాన్ని నింపుతూ, గర్వంతో మెడ ప్రక్కకు వంచి, సభ్యులవైపు చూస్తూ, తృణీకరిస్తూఉన్న తీక్ష్ణనేత్రాలను గోపీనాథునివైపు తిప్పింది. ప్రేక్షకుల మనస్సులు ఉత్సాహంతో పొంగిపోయినవి, చప్పట్లతోనూ అభినందనధ్వనులతోనూ నాట్యశాల కంపించింది. గోపీనాథ్ హఠాత్తుగా లేచి, "గిరిబాలా, గిరిబాలా," అని కేకలు వేస్తూ స్టేజిమీదికి ఎక్కబోయాడు, స్టేజి ఎదుటకూర్చుండే ఆర్కెస్ట్రా దళం అతనిని పట్టుకొన్నారు.

ఆ సమయంలో రసభంగం కలుగజేసినవాడిపైని అందరికీ అమితకోపం వచ్చింది, ఇంగ్లీషుభాషలోనూ దేశభాషలోనూ అందరూ వాడిమీద, 'గెంటేయండి,' 'బయటికిపంపేయండి,'అని కేకలువేయడము మొదలుపెట్టారు.

భగ్నకంఠముతో గోపీనాథుడు ఆమెను చంపేస్తాను, కూనీచేస్తాను అంటూ అరిచాడు.

పోలీసువాళ్లు వచ్చి గోపీనాథ్‌ని బయటికి తీసుకొని వెళ్లిపోయినారు. తెరపడ్డది.

# ఆ ఒక్క రాత్రి

సురబాలా నేనూ ఒక్క బడిలోనే చదువుకొంటూ ఉండేవాళ్ళము; మొగుడూ పెళ్ళాల - ఆట ఆడుకొంటూ ఉండే వాళ్ళము. వాళ్ళ ఇంటికి వెళ్ళితే సురబాల తల్లి నన్నెంతో ముద్దు చేసేది, నేనూ ఆ ఇంటిపిల్లవాడనే అన్నట్లు చూస్తూ ఉండేది, మా ఇద్దరినీ ఒక్కచోట నిలబెట్టి, "ఆహా ఇద్దరికీ ఎంత బాగా కుదురుతుంది!" అని అంటూ ఉండేది.

నేను చిన్నవాడనే కాని ఆ మాటల అర్థం నాకు కొంతవరకు బోధపడేది. సురబాలమీద అందరికంటె నాకు ఎక్కువ హక్కు ఉందనే నమ్మకము, నాలో బాగా వేళ్లు తన్నుకుపోయింది. అధికారమదాంధుడనై ఆ సురబాలమీద అధికారము చెలాయిస్తూ ఉండేవాడను. ఆమెకూడా నేనేమి చెప్పితే అది చేస్తూ ఉండేది, నేను శిక్షిస్తే సహించి ఊరుకుండేది. గ్రామంలో వారంతా సురబాల చాలా అందమైన పిల్ల అంటూ ఉండేవారు, కాని మూర్ఖుడనైన నాకంటికి ఆ సురూపు విలువ అయినదిగా ఉండేది కాదు. కేవలం నా అధికారము సహించి ఉండడానికే ఆమె ఈ పృథ్విపై జన్మగ్రహణ చేసింది— నేను ఆమెను గురించి అంత నిర్భయంగా ఉండడానికి కూడా ఇదే కారణము.

మా నాన్నగారు చౌధురీ జమీందారుగారి ఇలాకాలో రివిన్యూసూపరెంటుగా ఉండేవారు. నాకు కొంచెము చదువువచ్చి బాగా వ్రాయడం చేతకాగానే జమీవారి వ్యవహారాలు చూడడం నాకు నేర్పి, ఎక్కడైనా రివిన్యూ ఇన్‌స్పెక్టర్ పని ఇప్పిద్దామని మా నాన్నగారి కోరిక. కాని లోలోపల నాకు ఆ పనిఅంటే చాలా అయిష్టంగా ఉండేది. మా ఊరికుర్రవాడు, నీల్‌రతన్, కలకత్తా పారిపోయి అక్కడ చదువుకొని కలక్టర్ కచేరిలో నాజర్ పని సంపాదించాడు. నేను కూడా అటువంటి ఉచ్చపదవినే గురిచేసుకొన్నాను. కలక్టర్ కచేరిలో నాజర్ పని సంపాదించలేకపోతే అధమము జిల్లా కోర్టులో హెడ్‌క్లార్కుపనిఅయినా సంపాదించవలెనని నిశ్చయించుకొన్నాను.

జడ్జీకోర్టువాళ్లను మా నాన్నగారు చాలా గౌరవిస్తూ ఉండేవారు, అది రోజూ నా కంటబడేది. పళ్లూ, కూరలూ, రూపాయలూ, తీసుకొనివెళ్లి ఏదో ఒక సందర్భంలో వాళ్ల కర్పించి పూజచేసి వస్తూఉండడం నేను చిన్నప్పటినుండీ ఎరిగినసంగతే. కనుక కోర్టులోని చిన్నగుమాస్తాలకే కాక బంట్రోతులకుసహితము లోలోపల నేను గౌరవపదవిని ఇస్తూ ఉండేవాడను. వీళ్లు మనకు దేవతలు, పూజనీయులు, సనాతనంగా వస్తూఉన్న ముప్పైమూడుకోట్ల దేవతలయొక్క నూతనసంస్కరణము. ఇహసంబంధమైన విషయాలలో సిద్ధిలాభము కావలసివచ్చినప్పుడు మనదేశస్థులు, సిద్ధిధాతలయిన

గణేశునికంటే వీళ్ళనే అధికముగా నమ్ముకొని ఉంటూవున్నాను. కనుక పూర్వము గణనాయకునికి వారికే ఉపహారాలిస్తి ఈరోజులలో వీళ్ళవేను.

నీల్ రతన్ దృష్టాంతంవల్ల ఉత్సాహముపొంది మంచి వీలైనసమయము చూచుకొని నేనుమెల్లగా ఒకనాడు కలకత్తా పారిపోయినాను. మా గ్రామస్థుడొకడు, నే నెరిగినవాడు, అక్కడున్నాడు; అతనిబస మొదట చేరుకొన్నాను. తరువాత మానాన్నగారుకూడా సహాయముచేయుచుండుటవల్లను, పరిస సంధ్యలు బాగా జరుగుతూ వచ్చినవి.

ఇదికాక మీటింగులలోనూ, ఉపన్యాసాలలోనూ వెళ్ళుతూ ఉండేవాడను. దేశముకొరకు ప్రాణాలను ధారపోయుటకు అత్యావశ్యకమగు దృఢమైన నమ్మక మొకటి నాకు కలిగింది, ఈ విషయములో నా కెటువంటిసందేహమూ లేదు. కాని కష్టసాధ్యమైనకార్యం ఏలాగున సాధించవలెనో నాకు తెలియలేదు. దృష్టాంతము చూపించేవాడుకూడా ఎవడూ లేకపోయినాడు.

దానివలన నా ఉత్సాహంమాత్రం తగ్గలేదు. మేము పల్లెటూరిపిల్లవాళ్ళము, కలకత్తా పిల్లవాళ్ళలాగు ముదర వంకాయలం కాము, చూచిన దానినంతా వెళాకోళము చేసే వాళ్ళముకాము. మా దీక్ష అతిదృఢంగా ఉండేది. మా సభానాయకులు ఉపన్యాసా లిస్తూఉండేవారు. మేము భోజ

నము లేకుండా మిట్టమధ్యాహ్నం, ఎండలో మాడుతూ, చందాలపుస్తకం చేతపుచ్చుకొని, ఇంటింటికీ భిక్షానికి వెళుతూ ఉండేవాళ్లము, రోడ్డుప్రక్కను నిలుచొని నోటీసులూ, కరపత్రాలూ పంచుతూ ఉండేవాళ్లము, సభజరిగేచోటికి వెళ్లి బెంచీలు కుర్చీలు సదుపుతూ ఉండేవాళ్లము. సభానాయకుల మీాద ఎవరైనా ఒక్కమాట అనేసరికి పదములుబిగించి తన్నడానికి సిద్ధమవుతూ ఉండేవాళ్లము. పట్నవాసులు ఈ లక్షణాలన్నీ చూచి పల్లెటూరిపిల్లకాయలంటూ మమ్మల్ని ఎగతాళిచేసే వారు.

నాజూకు హెడ్ క్లార్కు పదవులు విడిచిపెట్టాను, కాని షూర్యాట్ జీసీ, గరిబాల్డీ అయ్యే ప్రయత్నంమాత్రం వదిలిపెట్టలేదు. ఆరోజులలో మా నాన్నగారూ, సుకబాలనాన్నగారూ కలిసి సుకబాలను నాకిచ్చి పెళ్లిచేయవలెనని నిశ్చయించి పెళ్లి ఏర్పాట్లు మొదలుపెట్టారు.

నేను పదిహేనేళ్లప్పుడు కలకత్తా వచ్చేశాను. అప్పుడు సుకబాలకు ఎనిమిదేళ్లు, నా కప్పుడు పద్దెనిమిది. నాకు పెళ్లి ఈడు దాటిపోతున్నదని మా నాన్నగారి అభిప్రాయం. పెళ్లిమాని దేశంకోరకు ప్రాణత్యాగముచేయవలెనని లోలోపల నేను ప్రతిజ్ఞపట్టాను; తండ్రితోమాత్రం చదువుపూర్తి కానిదే పెళ్లిచేసుకోను అని అన్నాను.

రెండుమూడు నెలలలో సుకబాలను వకీలురామ్‌లోచన్

బాబు కిచ్చి పెళ్లిచేశారని విన్నాను. పతితావస్థలోనున్న భారతమాతకోసం చందాలెత్తే పనిలో మునిగిఉన్న నాకు ఈ కబురు అతితుచ్ఛమైనదిగా కనబడ్డది.

మెట్రిక్యులేషన్ ప్యాసయి, ఎఫ్. ఏ., పరీక్షకు వెళ్ల పోతున్నాను, అటువంటప్పుడు మా నాన్నగారు కాలం చేశారు. మిగిలినది నేనొక్కడనే కాను, మాతల్లి, ఇద్దరు చెల్లెళ్లూకూడా ఉండడంచేత కాలేజి విడిచి ఉద్యోగం కోసం ప్రయత్నము చేయవలసివచ్చింది. బహుప్రయత్నం పైని 'నోఆఖాలి' డివిజన్‌లో నున్న ఒక చిన్నపట్టణములోని, హైస్కూల్లో సెకెండుమాష్టర్‌గా కుదురుకున్నాను.

నాకు సరిఅయిన పని దొరికిందని అనుకొన్నాను. ఉత్సాహమిచ్చి పురికొల్పడమువల్లనూ, ఉపదేశ మియ్యడం వల్లనూ నాకు దొరికిన ప్రతి కుర్రవానిని, భవిష్యత్తుకు పనికి వచ్చే భారతసేనాపతిగా చేసి నిలబెట్టవలెనని నిశ్చయించుకొన్నాను.

పని ప్రారంభించాను. దూరంనుండే భవిష్యద్భారత వర్షముకంటె దగ్గరఉండే పరీక్ష చాలా తొందర కలుగజేస్తున్న దని తత్‌క్షణమే పోల్చుకొన్నాను. కుర్రవాళ్లకు వ్యాకరణమూ ఆల్‌జీబ్రాలో ఉండేవి కాక పై మాటలేవైనా చెపితే కోపం వచ్చేది హెడ్‌మాష్టరుగారికి. రెండుమూడు నెలలు కాకముందే నా ఉత్సాహమంతా ఎండిపోయింది.

నావంటి ప్రతిభాహీనులు చేయగలిగినది ఇంట్లో కూర్చొని పెద్దపెద్ద ఊహాలతో తలలు నింపుకోవడం కాని పనిచేయవలసినవచ్చినప్పుడు మాత్రం, మెడమీద పూ జెక్కించుకొని వెనుకనుంచి ఎవడో తోక నులుపుతుంటే, నాగలిలాగుతూ రోజంతా, తలవాల్చుకొని ఎండలో దున్నుతూ ఉండడము, సాయంకాలమైనతరువాత కడుపునిండా కుడితి దొరికిందని సంతోషిస్తూఉండడము. ఆడుతూ గంతులు వేస్తుండడానికి శక్తి మరి ఉండదు.

అగ్నిభయమువల్ల మేష్టర్లలో ఒకడు బడిలోనే బసచేసుకొని ఉండడము ఆ ఊరుబడి పద్ధతి. నేను ఒంటరిగాడన వడముచేత ఆ భారం నామీదనే పడ్డది. బడిగా వాడుతున్న పెద్ద గడ్డిఇంటికి కలిసిఉన్న చిన్నగడ్డి ఇంట్లో నాబస. బడిఇల్లు ఊళ్ళో ఇళ్ళకు కొంచెము దూరాన, ఒకపెద్ద చెరువుగట్టుమీద ఉన్నది. చుట్టూ కొబ్బరిచెట్లూ, పోకచెట్లూ, రామఫలంచెట్లూ ఉన్నవి. స్కూలుఇంటికి తగిలి ఒకదానినొకటి అంటిఉన్న ముసలి వేపచెట్లు పెద్దవి రెండున్నవి. వాటి నీడ ఆ ఇంటిమీదా, ఇంటిఎదుటా పడుతూ ఉన్నది.

ఇప్పటివరకు నేను చెప్పనిది, చెప్పవలసినదని నాకు తోచనిది, ఒక చిన్నసంగతి ఉన్నది. ఆ ఊరి గవర్నమెంటుప్లీడర్ రామలోచన్‌రాయ్‌గారిఇంటికి స్కూలుకూ అట్టే దూరం లేదు. రామలోచన్‌బాబు భార్య, నా భార్యస్నేహితురా

లైన సురబాల, అక్కడే కాపురం చేస్తూఉన్నది, ఈ సంగతి నే నెరుగుదును.

రామలోచన్‌బాబుతో నాకు పరిచయము కలిగింది. చిన్నప్పుడు సురబాలను నే నెరుగుదునని అతనికి తెలుసునో లేదో నేను చెప్పలేను. కొత్తగా పరిచయంకలగగానే ఆమాట అతనితో చెప్పడం ఉచితమని నాకు తోచలేదు. సురబాలకు నాజీవితంతో ఎన్నడైనా సన్నిహితసంబంధంఉన్నట్టు నాకు బాగా తట్టలేదు కూడాను.

ఒకనాడు రామలోచన్‌బాబును కలుసుకొందామని అతని ఇంటికి వెళ్లాను. ఏవిషయమై మాట్లాడుతున్నామో నాకు జ్ఞప్తిలేదు. బహుశా మనదేశముయొక్క ప్రస్తుతపు దురవస్థనుగురించి అయిఉండవచ్చును. ఆవిషయమై అతడు చాలా ఆలోచించి దుఃఖిస్తున్నాడని కాదు నా అభిప్రాయము. కాని అది హుక్కాపీలుస్తూ, ఘంట, ఘంటన్నర వాదిస్తూ కూర్చొని, హాయిగా మన విచారాన్ని కనపరచదగిన విషయం.

ఇట్లా మేము వాదనచేస్తూ ఉండగా ఆప్రక్కగదిలో అతి మృదువుగా గాజులు చప్పుడయినవి, బట్ట ఒంటిని రాసుకొంటు న్నట్టు కొంచెము వినబడ్డది. కుతూహలంగా కిటికీసందులో నుంచి నావైపు ఎవరో చూస్తున్నారని నేను పోల్చుకొన్నాను.

విశ్వాసం, సరళత, పసితనములో కనబడే అనురాగం——వీటితో నిండిఉన్న పెద్దపెద్ద కళ్లు రెండు నాకు

తత్‌క్షణమే జ్ఞాపకం వచ్చినవి—నల్లని పాపలూ, దట్టమైన కనుబొమ్మలూ, ప్రీతిలో నిండిఉన్న దృష్టీ, జ్ఞప్తికివచ్చినవి. హఠాత్తుగా ఎవరో వచ్చి నాగుండె తనపిడికిలిలో గట్టిగా పట్టుకొన్నట్టు అనిపించింది, నాహృదయంలో వేదనకలిగింది.

ఇంటికి తిరిగివచ్చాను, కాని ఆ వేదన నన్ను వదల లేదు. చదువుదామని ప్రయత్నంచేశాను, వ్రాయబోయి నాను—ఏమిచేస్తున్నా ఆ బాధమాత్రం ఆగలేదు. గుండె మీద పెద్దబరువు వొకటి కూర్చొని ఉండేది.

సాయంకాలము మనస్సును కొంచెము స్థిమితపరుచు కొని, "ఇట్లా ఎందుచేత నయింది?" అని నన్ను నేను ప్రశ్నించు కోనడము మొదలుపెట్టాను. "నీ సుభాల ఏదీ?" అని నా మనస్సులోనుండి జబాబువచ్చింది.

"నే నామెను ఇచ్ఛాపూర్వకంగా వదిలిపెట్టాను ! ఆమె నాకోసము ఇంకెంతకాలము కూర్చొనగలదు?" అని నేను జబాబుచెప్పాను.

"శరీరసంబంధమాత్రాన అప్పుడు నీకు దొరకకుండే సుభాలను. నెత్తికొట్టుకొని చచ్చినా నీ కప్పుడు శక్తితో ఒక్క మారు చూడడానికైనా అధికారము లేదు. చిన్ననాటి ఆ సుభాల నేడు నీకెంతో సమీపములో ఉండవచ్చును, ఆమె గాజులశబ్దము నీకు వినబడవచ్చును, ఆమె తలకు రాసు కొన్న నూనెయొక్క పరిమళము నీ దగ్గరకువస్తుండవచ్చును,

కాని నీకూ ఆమెకూ మధ్యను ఒక పెద్ద అడ్డు సదా ఉండనే ఉంటుంది," అని నాకు మనస్సులో వినబడ్డది.

"ఉంటే ఉండనీ, నాకు సురబాల ఎవరు గనుక!" అని నేను దానికి ప్రత్యుత్తరం ఇచ్చాను.

"సురబాల నీకిప్పుడు ఏమీకాదు, నిజమే! కాని నీకామె సర్వమూ అయి ఉండగలుగును కదా?" అని మళ్లీ జవాబు వచ్చింది.

ఆమాట నిజమే. సురబాల నాకు సర్వమూ అయి ఉండును. అన్నిటికంటె, అంతరంగికమైనదయి ఉండిఉండేదను, ఎల్లప్పుడూ దగ్గరగా ఉండిఉండేదను, నాతో కలిసి నాసుఖ దుఃఖాలు అనుభవిస్తూ ఉండును. అటువంటి సురబాల నేడు నాకు ఎంతదూరాన ఉన్నది! ఆమె నాకు నేడెంత పరాయి మనిషి అయిఉన్నది! ఆమెను చూడడం నేడు కూడనిపని, ఆమెతో మాటలాడడం తప్పు, ఆమెనుగురించి ఆలోచించ డం పాపము! ఎప్పుడూ ఎరగని రామలోచన్ ఎవడో హఠాత్తుగా వచ్చి ఎదుటనిలబడ్డాడు, నాలుగు మంత్రాలు వకరవుపెట్టి, ఆమె మరి ఎవరికీ దొరకకుండా గుప్పున గద్ద లాగు తన్నుకుపోయినాడు.

నేను మానవసంఘంలో కొత్త నీతిఒకటి ప్రచారం చేద్దామని కూర్చోలేదు, సంఘం విరగకొట్టడానికి బయలుదేర లేదు, సంఘంలోఉండే బంధాలన్నీ తెంచేదామని ఊహించుకో

లేదు. నాలో సహజంగాఉండే మనోభావాన్ని వ్యక్తపరచ వలె ననిమాత్రం ప్రయత్నం చేస్తున్నాను. మనస్సులో పుడుతూఉండే భావాలన్నీ ఎటువంటివి అన్యోన్య విరుద్ధములై లేనివి కాకపోవచ్చును; సంపూర్ణమైన సబబుగలవి కాక పోవచ్చును. రామలో చనుని ఇంటిగోడలమధ్య దీపమై వెలుగుతున్న సురబాలను, అతని సురబాల అనడంకంటె, నా సురబాల అనడం న్యాయమను అన్నమాటను ఎంతప్రయత్నించినా నా మనస్సులోనుంచి తరిమివేయలేకుండా ఉన్నాను. ఇట్లా అనుకొంటూఉండడం కేవలం అసందర్భమైనపని, తప్పు—అని నేను ఒప్పుకొంటాను, కాని అది అస్వాభావిక మైన పని మాత్రం కాదు.

అప్పటినుంచి మరి దేనిమీదా మనస్సు నిలపలేక పోయినాను. మట్టమధ్యాహ్నమప్పుడు, కుర్రవాళ్లు గొణగొణ మని పాఠాలు చదువుకొంటూ, క్లాసులో కూర్చుండేవాళ్లు, బయట ఎండ సలసల్లాడుతుండేది, కొంచెము వేడెక్కిన గాలి వేపపువ్వువాసనతో గదిలోకి వచ్చేది, అప్పుడు నా మనస్సులో ఏ కోరిక ఉండేదో నాకే తెలియదు. కాని ఒకటి మాత్రం చెప్పగలను; నా ఎదుటనుండే భారతవర్షపు భవి ష్యత్ సేనాపతుల వ్యాకరణముతప్పులు దిద్దుతూ జీవితమంతా గడపవలెనసే కోరిక మాత్రం లేదు.

బడి మూసినతరువాత ఆ పెద్ద ఇంటిలో ఒంటరిగా

ఉండడానికి బుద్ధిపుట్టేది కాదు. కాని పెద్దమనుషులు ఎవరైనా చూడడానికి వస్తే అదీ కష్టముగానే ఉండేది. సాయంకాలము చెరువుగట్టుమీదనుండే కొబ్బరిచెట్లూ పోకచెట్లూ చేస్తూఉన్న అర్థహీనమైన శబ్దము వింటూఉంటే, మానవ సంఘం ఒక తప్పులకుప్ప అని నాకు తట్టేది. సరిఅయిన పని సరి అయినసమయంలో చేయవలెనని ఎవరికీ తోచదు. సమయం తప్పిన తరువాత అసందర్భమైన కోరికలలో పడి కొట్టుకుంటూ ఉంటాము.

నేను సురబాల పెనిమిటి అయిఉంటే జీవితమంతా సుఖిస్తూ హాయిగా ఉంటిఉందును. కాని నేను గరిబాల్డీ అవుదామని అనుకొన్నాను, చివరకు ఒక చిన్నస్కూలులో సెకండుమాస్టరు నైనాను. ప్లీడరు రామలోచన్, సురబాలే నాకు భార్యకావలెనని కోరికతో కూర్చోలేదు, పెళ్లిముహూర్తమువరకు, అతనికి సురబాల ఎంతో మరి ఏపిల్ల అయినా అంతేను. అతడు ఎటువంటి ఆలోచనా చేయక పెళ్లి చేసుకొని సర్కారుప్లీడరీ చేస్తూ నాలుగు డబ్బులు సంపాదించుకొని హాయిగా కాలం గడుపుతున్నాడు, పాలు పాగవాసన వేసిననాడు సురబాలను నాలుగు తిట్టుతాడు, ప్రసన్నుడై ఉన్ననాడు ఆమెకు నగలుచేయించి పెట్టుతాడు. కడుపునిండా తింటూ పనసపండులాగు ఉంటాడు, సురబాల మొగుడు; చక్కనిదుస్తులు వేసుకొంటాడు, ఆతనికి ఎటువంటి విచారమూ

లేదు, సాయంకాలము చెరువుగట్టున కూర్చొని ఆకాశాన్న ఉండే నక్షత్రాలు చూస్తూ నిట్టూర్పువిడుస్తూ కాలయాపన చేయడం.

ఏదో పెద్దకేసుమీద రామలోచన్ పైగ్రామాని కక్కడికో వెళ్లాడు, తిరిగి వచ్చేసరికి నాలుగురోజు లవుతుంది. మా స్కూలింట్లో నే నేలాగున ఒంటరిగా ఉన్నానో, సుర బాలకూడా, ఆవాళ, వాళ్లఇంట్లో అలాగే ఒంటరిగా ఉన్నది కాబోలు.

నాకు జ్ఞాపకమున్నది, ఆవాళ సోమవారం. ప్రొద్దుట నుంచీ మబ్బువేస్తున్నది, పదిఘంట లయేసరికి టుప్పుటుప్పున చినుకులు ప్రారంభమైనవి. ఆకాశం ధోరణిచూచి హెడ్ మాస్టరుగారు స్కూలుకు సెలవుఅని ప్రొద్దున్నే చెప్పారు. ఆకాశాన్న నల్లనిమేఘాలు ఏదో మహాప్రయత్నముచేస్తూ ఉన్నట్టుగా ఇటూఅటూ రోజంతా పరుగెత్తుతూ ఉన్నవి. మర్నాడు మధ్యాహ్నమయేసరికి ధారలుకట్టి వర్ష మారంభ మయింది, తుఫాను లక్షణాలుకూడా కనబడుతున్నవి, రాత్రి అవుతున్నకొలదీ వర్షమూ తుఫానూ కూడా జాస్తీ అవుతున్నవి. గాలి మొదట తూర్పుదిక్కున ప్రారంభమయింది కాని క్రమ క్రమంగా అది ఉత్తరానికి తిరిగింది.

ఆరాత్రి నిద్రప్రయత్నం వృథాకాక మానదు. అటు వంటిరాత్రి, అటువంటి ఆ దురవస్థలో సురబాల ఇంట్లో

ఒంటరిగా ఉన్నదని నాకు జ్ఞాప్తికి వచ్చింది. మా బసయిల్లు వాళ్ల ఇంటికంటె చాలా దిట్టమైనది. ఆమెను స్కూల్ ఇంట్లోకి వచ్చి ఉండమని కబురుపంపి, నేను చెరువుగట్టుమీద ఆ రాత్రి గడుపుదామని నాకు అనేకసార్లు బుద్ధిపుట్టింది, కాని మనస్సు స్థిరపరుచుకోలేక ఊరుకొన్నాను.

రాత్రి సుమారు ఒంటిగంట, ఒంటిగంటన్నర అయి ఉంటుంది. సముద్రపుపోటు ఆరంభంఅయింది; హోరుమని శబ్దం వినబడుతున్నది, సముద్రము తోసుకొని వస్తూ ఉన్నది. నేను ఇంట్లోనుంచి బయటికి వచ్చి సురబాలగారి ఇంటివైపు వెళ్లుతున్నాను. వాళ్ల ఇంటికీ నా బసకూ మధ్యనున్న చెరువుగట్టుమీదికి వచ్చాను—అక్కడికి మోకాలిబంటి నీరు వచ్చిఉన్నది, నే నక్కడకు రాగానే నీరు మరి కొంచెము అధిక మయింది. చెరువుగట్టులో ఒకభాగము సుమారు పదకొండున్నర మూరలెత్తు గలది.

నేనూ చెరువుగట్టు ఎక్కాను, రెండో ప్రక్కనుంచి మరిఒకరు ఎక్కుతున్నారు. నా ఎదుటనున్న వా రెవరో నాహృదయం పోల్చుకొన్నది, నఖశిఖపర్యంతరము నాలో ఉన్న సర్వమూ పోల్చుకొన్నది. నేను పోల్చుకొన్నట్టుగా ఆమె కూడా పోల్చుకొని ఉండవలెను—సందేహంలేదు.

కనబడ్డంతమేర అంతా నీరే, ఐదారుమూరల జాగా మాత్రం మిగిలి ఉన్నది. ఈ ద్వీపముమీదికి వచ్చి మేము ఇద్దరమూ నిలబడి ఉన్నాము.

ప్రళయకాలం అది. ఆకాశాన ఒక్కనక్షత్రము లేదు, పృథ్వీమీద దీపాలన్నీ ఆరిపోయినవి. అటువంటి సమయంలో మాటలాడితే తప్పులేదు, కాని నోటివెంట ఒక్క మాటైనా రాలేదు. ఇద్దరిలో ఒక్కరూ కుశలప్రశ్న అయినా వేయలేదు.

ఇద్దరమూ అంధకారములోనికి చూస్తూ నిలుచున్నాము. గాఢమైన నలుపుగల ఉన్మత్త మృత్యు స్రోతస్సు క్రిందను పరుగెత్తుతున్నది.

సమస్తజగత్తును విడిచి సురబాల నేడు నాదగ్గరకువచ్చి నిలుచున్నది. నేడుతప్ప సురబాలకు నేదెవ్వడూ లేరు. సురబాల శైశవములో వేరొకజన్మంలోనుంచి, ఎవరూ ఎరుగని మాయలోకములోనుంచి, సూర్యచంద్రాలోకితమైన మానవలోకం లోనికివచ్చి జనసమూహం మధ్యను నా ప్రక్కను నిలుచున్నది. ఎంతో కాలమైనతరువాత సూర్యచంద్రాలోకితమైన ప్రపంచాన్ని, జనసమూహాన్ని వదిలి, ప్రళయాంధకారంలో ఒంటరిగా నా ప్రక్కన నిలుచొని ఉన్నది. ఆనాడు ఆ నవబాలికను, ఆ పూమొగ్గను, జన్మస్రోతస్సు నావద్దకు తీసుకొనివచ్చింది, నేడు ఈ వికసించిన పువ్వును మృత్యుస్రోతస్సు తోసుకొని వచ్చి నా ఎదుట నిలబెట్టింది. ఇంకొక్క కెరటము వస్తే చాలును, మేము ఆశ్రయించిఉన్న రవంతస్థలమూ నీటిలో

మునిగిపోతుంది, వేరువేరు కొడలను అంటిపెట్టుకున్న మేమిద్దరమూ రాలిపడి ఏకమయిపోయిఉండేదాము.

ఆ కెరటము రాకపోవును గాక! సుఖబాల ధనధాన్యాలనుభవిస్తూ పెనిమిటీ బిడ్డలతో సుఖముగా ఉండునుగాక!

నేను ఆ మహాప్రళయతీరంమీద నిలబడి ఆ ఒక్క రాత్రే శాశ్వతానందంయొక్క రుచిని పొందాను. నేను నాజరు కాలేదు, హెడ్‌క్లార్కు కాలేదు, గరిబాల్డీ కాలేదు, ఒక హైస్కూలులో సెకండుమాస్టరు కాగలిగాను. నాజీవితమంతటిలో అనంతమైన ఆ ఒక్క రాత్రి, ఒక్క క్షణముపాటు ఉదయించింది. నేను ఈ తుచ్ఛజీవితములో లెక్కలేని రాత్రులూ లెక్కలేని పగళ్లూ గడపుతున్నాను, కాని నా జీవితానికి సార్థకత నిచ్చినది ఆ ఒక్క రాత్రిమాత్రమే!

# యుక్తవయస్సు

వివాహదేవత ఇంతవరకు నాకు అనుకూలం కాలేదు, కాని నా మానసపద్మంమీద మాత్రం ఒకమారు కూర్చోకపోలేదు. కూర్చున్నప్పటికి నాకు పదహారేళ్లు. లేత నిద్రలో ఉన్నవాడిని లేపాములంటే మాత్రం, ఎంతప్రయత్నం చేసినా మరి ఆతనికి నిద్రరాదు. నాది నాడి అవస్థే. నా బంధుమిత్రులు దారపరిగ్రహణములో, కొందరు రెండో తరగతిలోకి ప్రమోషన్ పొందారు, కొందరు మూడోతరగతిలోకి ప్రమోషన్ పొందారు. నాది కౌమారదశలో చివర బెంచీ, కౌమార్యసంసారములో కూర్చొని దూలాలూ, వాసాలూ లెక్కపెడుతూ కాలం గడిపాను.

పద్నాలుగో ఏట నేను ఎన్ట్రెన్స్ పాసయినాను—ఆరోజుల్లో పెళ్లివిషయంలోగాని, ఎన్ట్రెన్స్‌పరీక్షవిషయంలోగాని, వయస్సు నిర్బంధము ఉండేదికాదు. క్లాసు పుస్తకాలు మింగేఅలవాటు నాకు ఎన్నడూ లేదు, కనుక శారీరక అస్వస్థతగాని, మానసిక అస్వస్థతగాని నన్ను బాధించలేదు. కోరికగల వస్తువు దొరికితే చాలును, ఎలక దానిని కొరకకుండా వదలదు—అది తినదగినవస్తువు ఔనాకాదా అనే విచారణతో దానికి సంబంధంలేదు. అదేమాదిరి దొరికిన అచ్చుపుస్తక

మెల్లా చదవడమే నా స్వభావము చిన్నప్పటినుంచీ. నా పుస్తక-సూర్యమండలములో చదవబడినపుస్తకాలు పృథ్వీలైతే, చదవబడనివి సూర్యుడున్నూ—సూర్యుడు భూమికంటె పద్నాలుగులక్షలరెట్లు పెద్ద కదా! అయినా మా సంస్కృత పండితుని కఠోరమైన భవిష్యద్వాణి సార్థకం కాలేదు, నేను పరీక్ష పాసయిపోయినాను.

మానాన్న డిప్యూటీకలెక్టరీ చేస్తున్నాడు. మేము అప్పుడు సాత్ క్షీరాలోనో లేక జహానాబాద్ లోనో—ఈ రెండుస్థలాలూ కాకపోతే అట్లాంటిది ఇంకేదో జాగాలోనో ఉండేవాళ్లము. ఒకసంగతి ముందే చెప్పిఉంచడం మంచిది—ఈ చరిత్రలోని దేశకాలపాత్రలు అతిస్పష్టంగా చెప్పబడి ఉన్నప్పటికీ అవి కేవలం కల్పితాలు, మిథ్య. కనుక ఎవరికైతే సరసమైన రచనద్వారా ఆనందము పొందవలెననే కోరికకంటె కథాపాత్రలనుగురించిన నిజాన్ని తెలుసుకొందామని కుతూహలం జాస్తిగా ఉంటుందో వాళ్లకు పరాభవము కలుగుతుంది.

నాన్న తనిఖీకై ఎక్కడికో కమాను వెళ్లాడు. అమ్మ ఏదో వ్రతము చేస్తున్నది—వ్రతాలు మొదలైన కార్యాలకు బ్రాహ్మణార్థానికి—అనగా భోజనానికి దక్షిణపుచ్చుకోడానికి ఒక బ్రాహ్మణు డవసరము కదా—ఈ విషయాలలో మా సంస్కృతపండితుడు అమ్మకు చాలా సాయంచేసేవాడు. అందుకని అమ్మకు మా పండితుడంటే అమితకృతజ్ఞత. కాని

మానాన్నకు మాత్రము అవడంటే ఏమీ మంచి అభిప్రాయం లేదు.

నేటి ఆహారానంతరం జరగబోయే దానధర్మాలలో నన్నుకూడా చేర్చింది మా అమ్మ. అందులో ముఖ్యంగా నాగురించి జరిగిన ఆలోచన ధోరణి ఇది: నేను ఇక కలకత్తా వెళ్లిపోవాలి, వెళ్లి అక్కడ కాలేజీలో చేరాలి. దానివల్ల మా అమ్మకుకలిగే పుత్రవియోగదుఃఖాన్ని దూరముచేయ డానికి మంచి ఉపాయము ఒకటి యోచించవలసివచ్చింది. అబ్బాయిస్థానే ఒక శిశువధువుగాసి తల్లిదగ్గిరఉంటే ఆ బిడ్డను పెంచి పెద్దదానినిచేస్తూ ఆమె కాలము గడుపుతుండవచ్చును అని నిశ్చయించారు, అమ్మా పండితుడూ కలిసి. మా సంస్కృతపండితుని కొమార్తె ఈ అవసరం బహుచక్కగా తీర్చగలదు—ఆమె శిశువూ, సుశీలా కూడాను. మిగతా ఏవిషయాల్లో చూచినా మా ఇద్దరికీ బాగా కలిసించటం— అన్నిటికంటె ముఖ్యమైనసంగతి ఏమిటిఅంటే, ఒకకన్యను భార్యగాగ్రహించి ఆమె తండ్రిఅయిన బ్రాహ్మణుని రక్షించి పారమార్థికఫలము పొందడంకంటె కోరదగినది ఏముంటుంది ?

అమ్మకు చాలా సంతోషంకలిగింది. ఒక్కమారు పిల్లను చూస్తే బాగుండును అని అమ్మ సూచాయాచా తెలియజేసేసరికి పండితుడు అన్నాడు—"నాభార్య నిన్ననే వచ్చింది అమ్మాయిని తీసుకొని," అని.

అమ్మకి నచ్చడానికి ఆట్టే సమయము పట్టలేదు—మంచికి మంచీ ఉంది పుణ్యానికి పుణ్యమూ ఉంది—రెండూ కలిసేసరికి తూనిక బాగా వచ్చింది. చూచి "పిల్ల లక్షణాలు మంచివి," అని అమ్మ అన్నది. అంటే అమ్మ ఉద్దేశము—పిల్లకు రూపు అంతగా లేదు కాని తక్కిన విషయాలనుపట్టి చూస్తే విచారిం చక్కర లేదు అని.

ఈ ఏర్పాటు జరుగుతున్నట్టు మెల్లిగా నా చెవిని పడ్డది. ఏ పండితమహాశయుని ధాతురూపాలు నన్ను హడలుగొట్టు తున్నవో అతని కొమార్తెనే నేను పెళ్లాడబోతున్నాను— వీటిలో ఉండే పరస్పర వైరుధ్యము నాకు తట్టగానే నా మనస్సు ప్రబలవేగంతో ఆకర్షించబడ్డది.

ఒకనాడు మధ్యాహ్నము అమ్మ నన్ను పిలిచి, "నాన్నా, సంస్కృతపండితుడుగారు మామిడిపళ్లు, మిఠాయి, పంపించారు; కొంచము రుచిచూడు తండ్రీ," అని అన్నది. పాతికమామిడి పళ్లు తినమని ఇస్తే మరి ఒకపాతిక అడిగి పాదపూర్తి చేసే పద్ధతి నాది అని మా అమ్మ ఎరుగును. కనుకనే నా రసనానికి సరస ముగా తట్టే మార్గము ఊహించింది మా అమ్మ, దానిద్వారా నా హృదయాన్ని ఆహ్వానించింది. నేను లోపలికి వెళ్లి చూచినప్పటికి కాశీశ్వరి అమ్మఒళ్లో కూర్చొనిఉన్నది. ఇప్పుడు ఆట్టే స్పష్టంగా అంతా జ్ఞాపకం రాకుండా ఉన్నది, కాని పిల్ల జుట్టు జడవేసి ఎర్రరిబ్బన్‌తో కట్టి ఉన్నది; కలకత్తాదుకాణంలో

అమ్మే సాటిన్ జాకెట్ తొడిగాడు పిల్లకి—రకరకాల లేసూ జరీ వేసి ఎరుపూ నీలీ రంగుల బట్టముక్కలతో కుట్టిన జాకెట్ అది-పిచ్చివాడి కూతలలాగు, రంగుకూ రంగుకూ సంబంధము లేకుండా పిచ్చిపిచ్చిగా కనబడుతుండెను. జ్ఞాపకం ఉండేటంతవరకు పిల్లది చామన చాయ, ఒత్తయిన కనుబొమ్మలు రెండూ మధ్యను కలిసిపోతున్నవి, పెంపుడు జంతువులాగు నిర్భయంగా చూస్తూ కూర్చున్నది. మిగతా ఏవీ జ్ఞప్తికి రాకుండా ఉన్నవి—సృష్టికర్తయొక్క కార్ఖానాలో పూర్తిగా తయారు కాకుండానే పిల్ల వచ్చేసిందని నా మనస్సుకు అప్పుడు తట్టింది. పోత మాత్రం అయింది, చక్కచేయడము కానేలేదు. కాని ఏది ఎట్లాగున్నా పిల్లమాత్రం కేవలము అమాయికంగా కనబడ్డది.

లోలోపల నేను పొంగిపోయినాను—ఈ ఎర్ర టేపుతో జడ వేసుకొన్న అమ్మాయి, ఆ రంగురంగుల జాకెట్ చుట్టిన అమ్మాయి, సంపూర్ణంగా, అనగా రూపాయికి పదహారణాలు, నా సొత్తే! నేను ఆమె ప్రభువును; ఆమె దేవతను నేను. ప్రపంచములో నాకు ఇంకే పదార్థము కావలెనన్నా ప్రయత్నం చేయవలసి ఉంటుంది, కాని ఈ వస్తువొకటిమాత్రము నాకు ఎట్టి ప్రయత్నమూ అవసరంలేదు—నా వేలు కదిపి చూపిస్తే చాలును—ఏపని కోరితే ఆపని అయి తీరుతుంది. భగవంతుడు నా వెంట తిరుగుతున్నాడు ఈ వరము నాకు ఇద్దామని. మా అమ్మను రోజూ చూస్తున్నాను, కనుక భార్య అనగా ఏమిటో

నేను బాగా ఎరుగుదును. ఏ వ్రతంఅన్నా నాన్నకు చెడ్డ కోపము, కాని సావిత్రివ్రతం అంటేమాత్రం—బయటికి ఏమి చెప్పినా—లోలోపల బహుఆనందం. నాన్నఅంటే అమ్మకు అతిభక్తీ అమితప్రేమా—అది నే నెరుగుదును; కాని దేని వల్ల నాన్నకు ఏమి కోపమువస్తుందో, దేనివల్ల ఏమి చీకాకు పుట్టుతుందో అని ఎల్లప్పుడూ అమ్మకు భయముగానే ఉండేది. నాన్నలోని పురుషత్వము ఈవ్రతంలోని రసాన్ని మనసార అనుభవించేది. మానవుడుచేసే పూజవల్ల దేవతలకు వచ్చేదీ పోయేదీ ఆట్టేఉండదు అనుకొంటాను—ఎందుచేతనంటే మనుష్యుడు ఆపూజను విధిగాచేస్తాడు. కాని మనుష్యునికి ఆవిధంగా పూజ అందుకొనే అధికారము లేదు, కనుకనే ఆ అధికారవాంఛ ఆతనిలో అనివార్యమయిపోతుంది. ఆ పిల్ల యొక్క రూపుగాని గుణాలుగాని ఆనాడు నాకంట పడలేదు కాని నేను పూజనీయుడను అనేసంగతి ఆ పద్యాలుగెళ్లప్పుడు కూడా నాలోఉన్న పురుషత్వాన్ని గర్వముతో కుతకుత ఉడికించేసింది. ఆనాడు అతిగొప్పగా మామిడిపళ్లు తిన్నాను. అంతేకాదు, బహుగర్వంగా మామిడిపళ్లు ఆకులో విడిచి పెట్టాను—అట్లాంటిపని నేను పుట్టిననాటినుంచి ఎన్నడూ చెయ్యలేదు, నేడు చేసినందుకు మధ్యాహ్నమంతా విచారిస్తూ కూర్చున్నాను.

అప్పటికి ఇంకా కాశీశ్వరికీ నాకూ ఎట్లాంటిసంబంధమో ఆమెకు తెలిసిఉండదు, కాని ఇంటికి వెళ్లగానే తెలిసిఉంటుంది.

అప్పటినుండీ నేను కనబడితే చాలు, ఇటూ అటూ పరిగెత్తేది, కంగారుగా, దాగుందామంటే ఎక్కడా జాగా దొరికేదికాదు. ఆ భయం చూస్తే నాకు చాలా సరదాగా ఉండేది. నేను కనబడినంతమాత్రాన నా ప్రభావంవల్ల ఈ సువిశాలవిశ్వంలో ఏదో ఒకస్థలాన, ఏదో ఒకపదార్థములో చలనం కలిగింది అన్న మాట. ఈ జీవ రసాయనిక - రహస్యము నామనస్సుకు అత్యంతమనోహరంగా తోచేది. నన్నుచూచి భయపడడం అనేదిగాని సిగ్గుపడడం అనేదిగాని ఇంకేమైనా చేయడం అనేదిగాని ఎన్నడూ నేను ఎరగని సంగతి, ఊహించి ఉండలేనిసంగతి. కాశీశ్వరి తన పనులద్వారా తాను సంపూర్ణముగానూ, రహస్యముగానూ, ప్రత్యేకముగానూ నాది అని వెల్లడిచేసేది.

అనామధేయతనుండి హఠాత్తుగా ఒక్కక్షణములో ఇట్లాంటి గౌరవస్థానాన్ని పొందడమువల్ల రక్తం నా తలలో ఝూంఝూం మనడం ప్రారంభించింది. అమ్మచేయవలసిన పనులలోగాని, వంటలోగాని, మరి ఏయేర్పాట్లలోగాని ఎటువంటి లోపం కనబడినా నాన్న గోలచేసేవాడు. నేనుకూడా అటువంటి దృశ్యాన్నే ఊహించుకొంటూ లోలోపల నాన్న మాటలే ఏకరవుపెడుతూ ఉండేవాడను. నాన్న ఏదైనా కష్టసాధ్యమైనపని చేయబూనుకొన్నప్పుడు అమ్మ అనేకమైన ఉపాయాలు కనిపెట్టి నాన్నకి తోడ్పడి పని నెరవేర్చడానికి ప్రయత్నిస్తుండేది. కాశీశ్వరికూడా అటువంటిప్రయత్నాలలో

మునిగిఉన్నట్టు నాలో నేను ఊహించుకొంటూ ఉండేవాడను. అప్పుడప్పుడు అకస్మాత్తుగా అతి నిర్లక్ష్యంగా నా ఊహా ప్రపంచంలో ఆమెకు దానము చేస్తుండేవాడను—ఆ దానాలు పెద్దపెద్ద కరెన్సీనోట్లతో మొదలుపెట్టి గొప్పగొప్ప వజ్రాల హారాలవరకూ ఎక్కేవి. ఒకొకనాడు భోజనానికి కూర్చొని ఊహానేత్రంతో చూచేవాడను—కాశీశ్వరి భోజనముచేయ లేదు, కిటికీదగ్గర కూర్చొని పైటచెంగుతో కన్నీరు తుడుచు కొంటున్నది—ఈ జాలికలిగించే దృశ్యము చూచి నామనస్సు కరిగిందని చెప్పలేను. ప్రతివిషయంలోనూ పిల్లవాళ్లకు స్వయంకృషి ఉండవలెనని నాన్న మతము. గది చక్క జేసుకోవడమూ, బట్టలు శుభ్రంగా ఉంచుకోవడమూ మొద లైనపనులన్నీ నామట్టుకు నేనే చేసుకోవలసివచ్చేది. కాని నా మనోనేత్రానికి అతిస్పష్టమైన రేఖలతో కనబడుతున్న గార్హస్థ్యచిత్రాన్ని ఒకదానిని ఈదిగువ ఉదహరిస్తున్నాను. అది మానాన్న జీవితంలో ఒకనాడు జరిగినదానిని అనుసరించి చిత్రింపబడ్డదని నేను వేరే చెప్పక్కరలేదు.

ఆదివారమునాడు మధ్యాహ్నభోజనము అయింది, బాలీసుకు చేరబడి మంచముమీద కాళ్లుచాచుకొని పేపరు చదువుతూ పడుకొని ఉంటాను, హుక్కాగొట్టము చేతిలో ఉంటుంది. కొంచము కునుకుపట్టి హుక్కాగొట్టం జారి కింద పడిపోతుంది. కాశీశ్వరి వరండాలో కూర్చొని చాకలికి

బట్టలు వేస్తుంటుంది. నేను కేకవేయగానే కాశీశ్వరి తొందర తొందరగా వచ్చి గొట్టము నా చేతికి అందిస్తుంది. అప్పుడు నేను ఆమెతో ఈవిధంగా అంటాను—"చూడు, నేను కూర్చుండేగదిలో ఎడమమూలనున్న బీరువాలో మూడో వరసలో నీలిఅట్టవేసిన దళసరి ఇంగ్లీషుపుస్తకము ఒకటి ఉన్నది—అది తెచ్చియ్యి." కాశీ, నీలిరంగుపుస్తకము ఒకటి తెచ్చి ఇస్తుంది. అదిచూచి నేను—"అబ్బ! ఇదికాదు ఇంత కంటె లావుగా ఉంటుంది, వెనకను బంగారము అక్షరాలతో పేరు ఉంటుంది," అని అంటాను. ఈమారు ఆకుపచ్చ పుస్తకము ఒకటి తెచ్చి ఇస్తుంది. పుస్తకము నేలనుకొట్టి నేను కోపంతో లేస్తాను. కాశీ ముఖము చిన్నచేసుకొంటుంది, కళ్లల్లో నీళ్లు గిరగిర తిరుగుతవి. నేను వెళ్లి చూస్తాను—మూడో వరసలో పుస్తకాలే లేవు—ఆ పుస్తకము అయిదో వరసలో ఉంటుంది. అది తీసుకువచ్చి మెల్లిగా మంచముమీద పడేసుకొంటాను—నేను పొరపాటు పడ్డట్లు కాశీతో చెప్పను. ఆమె ముఖము వాల్చుకొని చాకలిపద్దు వ్రాస్తూ తన తెలివి తక్కువవల్ల భర్తనిద్రకు భంగముకలిగిందని దుఃఖిస్తుంటుంది—ఎంతప్రయత్నించినా తన అపరాధము మరవలేకుండా ఉంటుంది.

నాన్న డెకాయిటీ కేసులు విచారణకై పైగ్రామాలలో తిరుగుతున్నాడు, నేను ఈ విధముగా దినాలు గడుపుతున్నాను. ఇవతల పండితమహాశయుని వ్యవహారములోనూ.

భాషలోనూ చాలా మార్పుకలిగింది—గ్రాంథిక వాచ్యముపోయి భాషావాచ్యము వచ్చింది, తరువాత క్రమక్రమేణ అత్యంతసద్భావ వాచ్యములోకి ఎక్కింది.

అంతలో వెకాయింకీవిచారణ ముగిసింది. నాన్న ఇంటికి తిరిగివచ్చేశాడు. అమ్మ, నెమ్మదిగా, సమయమును చూచుకొని, నాన్నకి ఇష్టమైనకూరలూ, వంటా చేసి ఫలహారంక తీరుగుడుగా, మాటలసందర్భంలో, మెల్లి మెల్లిగా, పెళ్లి సంబంధముమాట ఎత్తుతానుమని ఆలోచిస్తున్నది—నే నెరుగుదును. సంస్కృతపండితుడు పనిమలుబ్బు అని; అతనంటే నాన్నకు మహా అసహ్యము. కనుక అమ్మ పండితుణ్ణి మృదువుగా మొదట కొంచెము నిందించింది, అతనిభార్యనూ పిల్లనూ పొగుడుతూ పునాది వేసామని నిశ్చయించింది. కాని దురదృష్టంవల్ల అట్లాజరగలేదు. పండితుడు ఆసంగతము పట్టి ఉంచుకోలేక, ఎక్కడపడితే అక్కడ ఈమాట అంటూ ఉండడం వల్ల, కథ నాలుగువేపులా అల్లుకుపోయింది. పెళ్లి నిశ్చయమైపోయిందనీ, ముహూర్తం నిశ్చయిస్తున్నామనీ, పండితుడు చెప్పనివాడు లేడు. పెళ్లికొరకు సిరస్తదారుగారి భవంతి అవసరమవుతుంది కనుక ఆవిషయమై మాటలు జరుగుతున్నవట. ఈ శుభకార్యంలో అందరూ సాధ్యమయినంతవరకు తోడ్పడతామన్నారట. వకీళ్లందరూ చందావేసికొని కర్చులన్నీ తామే వహిస్తామన్నారట. ఆ ఊరి ఎక్స్ట్రాక్రెన్సస్కూలు

సెక్రిటరీ, వీరేశ్వరబాబుగారి, మూడో కొమారుడు * మూడో క్లాసులో చదువుతున్నాడు—ఆ కుర్రవాడు త్రిపదివృత్తంలో "చంద్రుడు తెల్లకలువ," అని పేరుపెట్టి పద్యాలువ్రాశాడు. సెక్రిటరీగారు ఇంట్లో, హాకట్లో, ఎక్కడా, ఎవడినీ, విడువకుండా కనబడ్డవాళ్లందరికీ ఆ పద్యాలు చదివి వినిపిస్తున్నాడు—పిల్లవాడిశక్తి సామర్థ్యాలనుగురించి గ్రామస్థులందరికీ గొప్ప ఆశ కలిగింది.

ఈ ఉత్సాహముయొక్క ఫలితం ఏమిటిఅంటే ఊళ్లోకి వస్తూనే, ఇంకా ఇల్లుచేరకముందే, ఈశుభవార్త నాన్న చెవిని పడ్డది. ఆ వార్త జరిగినది, అమ్మభోజనము మానేయడమూ, ఏడుస్తూ పొర్లుతూఉండడమూ, ఇంట్లోనివాళ్లందరూ భయముతో వణుకుతుండడమూ, నౌకర్లను అకారణంగా జరిమానాలూ, కోర్టులో కేసులు డిస్మిస్ కావడమూ, అపరాధులపైని ఘోరమైన శిక్షవేయడమూ, పండితమహాశయుని ఉద్వాసనమూ, ఆతనితోకూడా, ఆ సాటిన్ జాకెట్ తొడుక్కొని రిబ్బను జడ వేసుకొన్న అమ్మాయి అంతర్ధానముకావడమూ. సెలవులు ఇంకా ముగియకముందే అమ్మదగ్గరనుండి బలవంతాన వేరుచేసి నన్ను కలకత్తా దేశాంతరము పంపించేశారు. నాహృదయం పగిలిపోయిన ఫుట్‌బాలులాగు చప్పిడిపడిపోయింది—ఆకాశం మీద ఎగురుతూఉండడము మరి నాకు ప్రాప్తిలేకపోయింది.

* నాలుగోఫారం

౨

నా పరిణయపథంలో ప్ర ప్రథమములోనే ఈ విఘ్నము సంభవించింది. అటుపైని వివాహదేవత పదేపదే నామీద దయదలచాడు కాని ఆతనికోరిక సఫలంకాలేదు. సవిస్తరంగా అదిఅంతా చెప్పడానికి నా కేమీ ఇష్టములేదు, కనుక సంక్షిప్తముగా ఒకటి రెండు నోట్సు* మాత్రము ఉంచిపోతాను: నాకు ఇరవై యోవడు రాకముందే ఎం. ఏ., పాస్ అయిపోయి, కళ్లకు సులోచనాలుపెట్టుకొని, మీసముమీద చెయ్యివేసుకొంటూ బయలుదేరాను. మానాన్న అప్పుడు రామ్‌పూర్ హాట్ లోనో లేక నొఆఖాలిలోనో ఉండేవాడు, లేదా బారాసత్ లోనో లేక అట్లాంటిది ఇంకేదోస్థలంలోనో ఉండేవాడు. ఇప్పటివరకూ నేనుచేసినది శబ్దసాగరమంథనము. దానివల్ల లభించినవి డిగ్రీలు. ఇప్పుడు చేయవలసినది అర్థసాగర మంథనము. నాన్న అప్పుడు, తన హితాన్నికోరే పేట్రన్† లను స్మరించడము మొదలుపెట్టాడు. చూచేటప్పటికి అందరిలోకి ముఖ్యుడు, నాన్నకు సహాయము తప్పక చెయ్యవలసినవాడు, పరలోకంలో ఉన్నాడు. అంతకు కొంచము తక్కువవాడు పెన్షన్ తీసుకొని సీమ వెళ్లిపోయినాడు, అంతకంటె కొంచము తక్కువవాడు పంజాబు బదిలీ అయిపోయినాడు. బంగాళా

---

* Notes=జ్ఞాపకార్థం వ్రాసుకొన్న పొడిమాటలు.

† Patron = పెద్దకదవిలోగాని, మంచిఅవస్థలో ఉండి ఉపకారం చేయగలవాళ్లు.

దేశంలో మిగిలిఉన్న చిన్నవాళ్లల్లో పెద్దవాళ్లు ఆశ్రితులకి మొట్టమొదట ఇచ్చినది ఆశ, ఉపసంహారములో సంహారము. మా తాత డిప్యూటీకలెక్టర్‌గా ఉండేటప్పుడు సిపార్సు-బజారు ఇంత ముందంగా లేదు. ఆ కాలంలో ఉద్యోగంచేసి పెన్షన్ పుచ్చుకోవడం, పెన్షన్ కాగానే ఆవంశంలో ఇంకొకరు ఉద్యోగంలో ప్రవేశించడం—ఈ విధంగా రేవు దాటించే పడవల్లాగు ఉద్యోగాలు ఇటునుంచిఅటూ అటునుంచి ఇటూ విరామములేకుండా తిరుగుతుండేవి. ఇప్పటిరోజులు బాగులేకపోవడముచేత, మానాన్న నాగురించి ఏమిచేయడమో అని దిగులుపడుతుండెను. ఉచ్చస్థానంలోఉండే గవర్నమెంటు ఉద్యోగపంజరము వదులుకొని క్రిందనుండే వర్తకస్థుల ఆఫీసుల లోకి దిగడమా లేదా అని నాన్న ఆలోచిస్తున్నసమయాన, ధనికుడైన ఒక బ్రాహ్మణుని ఏకమాత్రపుత్రిక అతనికంట పడ్డది. ఆ బ్రాహ్మడు ఒక కంట్రాక్టర్. కంటికి కనబడే మార్గాలద్వారా గడించే డబ్బుకంటె, అతనికి అదృశ్యమార్గాలద్వారా వచ్చేది చాలా అధికము. క్రిస్మస్‌రోజులలో అర్హులైనవాళ్లందరికీ కమలాపళ్లు మొదలైన కానుకలన్నీ పంచిపెట్టే హడావిడిలో అతడు ఉంటున్నాడు, అట్లాంటప్పుడు అతడుండేపేటలో నే నుదయించాను.

మానాన్నబస ఆతని ఇంటికి ఎదుటనే, రెండిళ్లకు మధ్య నుండేది రోడ్డుమాత్రమే. బాగా పొడుగైన చేతులుఉంటేనే

తప్ప, పెళ్లికాని పిల్లలతండ్రులను ఎం. ఏ., ప్యాసయిన యువకులు అంటని ఫలము. కనుకనే కంట్రాక్టర్‌గారు నాయెడల ఉద్యాహులైనారు. ఆయన బాహువులు మిక్కిలి పొడవైనవని పాఠకులు గ్రహించిఉంటారు, అవి కనీసపక్షము డెప్యూటీ కలెక్టర్‌గారి హృదయాన్ని సునాయాసంగా అందుకోగలగాలి. కాని అప్పటికి నాహృదయము అంతకంటే చాలా పైకి ఎక్కిపోయింది.

అప్పటికి నావయస్సు ఇరవైదాటీ దాటకుండా ఉన్నది, అసలైన స్త్రీరత్నమే కాని ఇంకేరత్నమూ నేను అప్పుడు కోరుతుండలేదు. భావదీప్తితో ఉజ్వల మౌతుండేది నామనస్సు. అనగా, సహధర్మిణి అనేపదానికి నేనిచ్చే అర్థం వేరు, బజారులో చలామణి అవుతున్న అర్థము వేరు. అప్పుడు మన దేశము బహు సంకుచితావస్థలో ఉండెను. ఊహాప్రపంచంలో ఉన్నంత సేపూ మనవారు మనస్సులను జ్ఞానంతోనూ భావాలతోనూ నింపిఉన్న విశాలవిశ్వములో, విహారము చేయుస్తుండేవారు; కాని ఆచరణలో పెట్టేవేళకు తమ ఆదర్శాలను మానవలోకముయొక్క చిన్నచిన్న కొలపాత్రలలో కుక్కి వాటిని కృశింపజేసేస్తుండేవారు—ఇదిచూచి నేను భరించలేకపోయేవాడను. నేను కోరే *'ఐడియల్'సహధర్మిణి గృహమనే ఖైదులో నా కాళ్లకు సంకెళ్లై ఉంటుందన్నా, ఎటు అడుగువేయబోయినా ఝాంకార

* ఆదర్శస్వరూపమైన.

సహితంగా నా వెంటబడి నన్ను వెనకకు లాగుతుంటుంది అన్నా. నేను ఎన్నటికీ ఒప్పుకొనే ధోరణిలో లేను. మన దేశ ప్రవాహనాలలో "ఆధునికు" లని ఎటువంటివారిని ఎగతాళిచేసేవారో, నేను, కాలేజినుంచి తాజాగా వచ్చినప్పుడు, అట్లాంటి వాళ్ళలో ఒకణ్ణి. ఆ రోజుల్లో ఆ ఆధునికవర్గము ఇప్పటికంటె బహుపెద్దది. చిత్రం ఏమిటంటే సంఘము చెప్పినట్టు చేస్తుండటము దుర్గతిఅనన్నీ సంఘాన్ని తోసుకొని వెళ్ళటము ఉన్నతి అనిన్నీ వాళ్ళు నిజంగా నమ్మేవాళ్లు.

శ్రీయుక్త సనత్కుమార్ అనే నేను, ఒకానొక పెళ్ళి కానిఅమ్మాయి తండ్రి, రూపాయలతో నింపిఉంచిన పళ్ళెము ఎదుటను, వచ్చి పడ్డాను. నాన్న "శుభస్య శీఘ్రం," అన్నాడు. నే నేమీ అనలేదు. మెల్లిమెల్లిగా సంగతేదో గ్రహిద్దాము అనుకొన్నాను. కళ్లూ చెవులూ తెరిచేఉంచాను, కొంత చూచాను అంతకంటె అధికము విన్నాను. పిల్ల బొమ్మలాగు ఉంటుంది, చిట్టిది, చక్కనిది. చూచేవాళ్ళకు ఆమె సహజంగా పెరిగిన అమ్మాయి అని తట్టదు—ఒక్కొక్క వెంట్రుకతీసి సాఫు చేసి అంటించి, కనుబొమ్మలు అద్ది, అమ్మాయిని ఎవరో అచ్చులో పోశారా అనిపిస్తుంది. ఆమె సంస్కృతభాషలో గంగాస్తవం ఏకరవుపెట్టగలదు. ఆమెతల్లి బొగ్గులను గంగాజలంతో కడుగనిదే వాటితో వంటచేసేది కాదు. జీవులకు ధాత్రిఅయిన వసుంధర నానా జాతులనీ మోస్తున్నది గనుక, ఆమె పృథ్విని

ముట్టుకోడానికి సర్వదా సంకోచిస్తూఉండేది. ఆమె పనిఅంతా విశేషభాగము నీటితోనే. జలచరాలైన చేపలు తుంకజాతికి చెందినవి కావు, కనుక చేపలు నిషేధంకాదు; కాని ఉల్లిపాయల జన్మస్థానము నీరుకాదు. ఆమె జీవనములో విరామములేకుండా చేసేపనులు ఏవీ అంటే, ఒళ్లూ ఇల్లూ, బట్టా పాతా, బంచెలూ చెంబులూ, మంచమూ పరుపూ, మొదలైనవన్నీ శుభ్రంగా, మడిగా, ఉంచుకొంటూ ఉండడము మొదలైన పనులు. ఈ నిన కృత్యాలన్నీ పూర్తిఅయేటప్పటికి మధ్యాహ్నము రెండుఘంటలన అయిపోతూండేది. తనకొమార్తెనుకూడా తన మొూస్తరుగానే తయారుచేసింది—పిల్లసంరక్షణఅంతా తన చేతులతో తానే స్వయంగా చేస్తూండేది; ఆపిల్లను అన్నివిషయాల్లోనూ అతిపరిశుభ్రంగా, స్వంతఅభిప్రాయాలుగాని కోరికలుగాని ఉండడమువల్లకలిగే ప్రమాద మేదీలేకుండా, తయారుచేసింది. ఎంత ఇబ్బందికలుగజేసే పస్థితులైనా సులభంగా భరించేది—సంగతముగా కనబడే కారణాలు ఎవరైనా బోధపరచగలిగితే, ఆమె భోజనంచేసేటప్పుడు శుభ్రమైనబట్ట ఎప్పుడూ కట్టుకొనేది కాదు బట్టకు మడి ముఖ్యముగాని శుభ్రత ముఖ్యముకాదు. సీడను గురించి కూడా మంచిచెడ్డలు ఆమెకు తెలిసేవి. పల్లకీలో కూర్చొనే గంగాస్నానముచేసేది ఆమె; ఎంత చిన్నవిషయమైనా అష్టాదశపురాణాలను అనుసరించే ఆమె సంసారయాత్ర చేసేది. విధివిధానాలంటేకూడా మా అమ్మకు భక్తిఉండేది, పట్టుదల ఉండేది, ఆ విషయములో తనకంటె ఎక్కువపట్టింపూ, హెచ్చు

శ్రేష్ఠాళం కెవరికైనా ఉన్నవిఅన్నా, ఉన్నవని గర్వపడుతున్నా చూచి సహించలేకపోయేది. ఆమాట నేనెరిగి, "నేను ఆ అమ్మాయికి తగిన వరుణ్ణి కాను అమ్మా," అని అన్నాను. అమ్మ నవ్వుతూ జబాబుచెప్పింది, "ఈ కలికాలంలో ఆమెకు తగినవరుడు దొరకడం కష్టం," అని. "అయితే నాకు సెలవిచ్చేయండిఅమ్మా," అని నేను అన్నాను; "ఏమి నాయనా, పిల్ల అంత చక్కగా ఉన్నదే, నీకు నచ్చలేదా ?" అని అమ్మ అడిగింది.

"కేవలము చూచి మెచ్చుకొంటూ కూర్చోడానికన్నా భార్య? బుద్ధిఅంటూ ఒకటి ఉండాలి కదా!" అని నే నన్నాను.

"ఏమిటి నాయనా నీ వనేది? ఆమెకు బుద్ధిలేనట్లు క్షణంలో ఎట్లా కనిపెట్టావు?" అని అమ్మ అన్నది. "బుద్ధి ఉంటే అటువంటి అర్థములేని పనులు రాత్రింబగళ్లు చేస్తూ కూర్చోలేరు, ఒకవేళ చేయవలసేవస్తే ఊపిరితిరగక చస్తారు" అని నేను జబాబిచ్చాను.

ఈ జబాబు వినగానే అమ్మముఖము వాడిపోయింది, ఈ సంబంధమువిషయమై మాట ఇచ్చినంత రూఢిగా ఆడపిల్ల పక్షమువారితో నాన్న చెప్పాడని అమ్మ ఎరుగును. ఇతరులకు కూడా ఇచ్ఛ అనే ఒక అనవసరపదార్థ ముండవచ్చు నన్న మాట నాన్నకు జ్ఞాపక ముండదనికూడా అమ్మ ఎరుగును. కాని మానాన్న అగ్నిహోత్రుడయి బలవంతం చేయకుండాఉంటే కొద్దిరోజులలో నేను ఆ అష్టాదశపురాణాల

మధ్య నివసిస్తూఉన్న బ్రాహ్మణ పెద్దాడి, అతిథిసత్కారాలూ స్నానపానాదులుచేస్తూ, వ్రతాలూ ఉపవాసాలూ జరుపుతూ, గంగా తీరాన బహుశా స్థితిపొందిఉండవును. అసలు, ఈపెళ్లి భారమంతా నాన్న అమ్మమీద విడిచిపెడితే, అమ్మ సమయానికి చూచి మెల్లిమెల్లిగా నాచెవిలో మంత్రోపదేశము చేస్తూ, మంచివేళ కనిపెట్టి, కళ్ల నీళ్లుపెట్టుకొంటూ, ఆ పని సాధించి ఉండును. నాన్న గర్జిస్తూ పెళ్లిచేసుకొంటావా లేదా అని అడిగేసరికి, ఏమైతే అది కాని అని మొండిధైర్యము తెచ్చుకొని నేను జవాబిచ్చాను—"భోజనముచేయడం, బట్టకట్టుకోవడం, మొదలైన చిన్నచిన్న విషయాలలో స్వాధీనత నేర్చుకోవలసింది అని చిన్నప్పటినుండి ఉపదేశిస్తూ వచ్చావు పెళ్లిమాట వచ్చేసరికి అస్వాధీనత పనికిరాదు కాబోలు!" అని నేనన్నాను.

కాలేజీలో నేర్చుకొంటూఉండే న్యాయశాస్త్రమూ, తర్కశాస్త్రమూ—వీటిమూలముగా పరీక్షలు ప్యాసుకావడం తప్ప, నే నెరిగినంతమట్టుకు, ఎవరూ దేనినీ సాధించలేదు. సరియైన తర్కము కుతర్కముపైని, మంటమీదపోసిన నీరు మాదిరి—పనిచెయ్యదు, మంటలోపోసిన చమురులాగు పని చేస్తుంది. నాన్న వాళ్లకు మాట ఇచ్చాడు, కనుక పెళ్లి అయేతీరవలెను. పెళ్లి ఉచితము అనడానికి ఇంతకంటె బలమైన ప్రమాణము మరేది ఉంటుంది, అని నాన్న అభిప్రాయము. అయితే, సంస్కృతపండితుడికి అమ్మ మాటఇచ్చినా పెళ్లి కాలేదు

సరేకదా, పెళ్లితోపాటు పండితుని జీవనోపాయానికికూడా నష్టముకలిగింది. ఆసంగతి ఇప్పుడు నాన్నకు జ్ఞాపకముతెస్తే దావాలదాకా వచ్చిఉండును. జ్ఞానము, వివేకము, సురుచి— వీటన్నిటికంటెకూడా, శుచీ, మంత్రతంత్రాలూ, క్రియాకర్మలూ చాలా గొప్పవనిన్నీ, వీటిలో ఉండే సారము చాలా ఘనమైన దనిన్నీ, వీటిఫలం మహా ఉత్తమమైనదనిన్నీ, నాన్న అంటూ ఉండేవాడు. సమయము అసమయము అని చూడకుండా ఈ మధ్య నాన్న రోజూ "సింబాలిజమే" "ఐడియలిజమ్" అంటూ నాకు వినబడేటట్టుగా వాదించడము మొదలుపెట్టాడు. నేను నోటినేమో కట్టిపెట్టి ఉంచానుగాని మనస్సునుమాత్రము కట్టి పెట్టి ఉంచలేకపోయినాను. ఉండిఉండి ఒకమాట నా నాలిక చివరకువచ్చి తిరిగి లోపలికి వెళ్లిపోయేది—"వీటిమీద నీ కంత భక్తి అయితే పాలించవలసినప్పుడు *కుక్కుటపాలన ఎందుకు?" నాకు ఇంకొకసంగతికూడా జ్ఞప్తికివచ్చింది—నాన్న ఒకనాడు దానదక్షిణలవల్లనో, తిథివారాలవల్లనో, వ్రతాలునోముల వల్లనో, తనకేదో ఇబ్బందికలిగిందనో, లేక నష్టమువచ్చింది అనో, వాటన్నిటినీ మన్నించేవాళ్లు పశుప్రాయులని అతి తీవ్ర ముగా అమ్మను దూషించాడు. అమ్మ అపరాధమయిందని ఒప్పు కొని, స్త్రీలు సహజంగా జ్ఞానము లేనివాళ్లని అంటూ, తలవా ల్చుకొని, మరింత గొప్పగా బ్రాహ్మణసంతర్పణ చేయవలెనని నిశ్చ

---

*బంగాళీవాళ్లలో మాంసభక్షకులైన వాళ్లకైనా కోడిమాంసము తిన కూడదని పదార్థము.

యించుకొని మనస్సులో పుట్టిన చీకాకునూ దుఃఖాన్నీ ఆ సంప
డిలో ముంచివేసింది, కాని నాన్నకు ఇవన్నీ జ్ఞప్తికి తేవడము
వల్ల ప్రయోజనముండదని నే నెరుగుదును—విశ్వకర్మ తర్కపు
అచ్చులలో పోసి మనుష్యులను తయారుచేయడం లేదు, కనుక
మనము ఎవరిదగ్గిరికైనా వెళ్లి, "నీవు జెప్పేదానికీ నీవు చేసే
దానికీ పరస్పరవిరుద్ధం ఉన్నది," అని చెపితే అతను కళ్లు తెరిచి
చూడడం సరేకదా, కళ్లుమూసుకొని కోపముతో మండిపడ
తాడు. న్యాయదేవతను సాయముచేయమని ప్రార్థిస్తే అన్యా
యము ప్రచండరూపముతో లేస్తుంది—†రాజకీయఆందోళన
గాని, ‡గార్హస్థ్యఆందోళనగాని చేయదలచుకొన్నవాళ్లు ఈ
సంగతి తెలుసుకొని ఉండవలెను. గుర్రము, తనను బండికి కట్ట
డం అన్యాయమని తలచి బండిని తన్నడంవల్ల, ఆ అన్యాయము
ఆలాగు ఉంటూఉండగా పైగా కాళ్లకు దెబ్బలు తగులుతవి.
యౌవన వేగముకొద్దీ నేను కొంచెము వాదించబోయేసరికి
నాగతీఅంతే అయింది—ఆ పురాణాల పెళ్లికూతురు చేతులలో
నుంచి తప్పించుకోగలిగాను నిజమే, కాని మానాన్న జమా
ఖర్చుల పుస్తకాలతో నాకు ఉండేసంబంధముకూడా దానితో
పాటు వదులుకోవలసివచ్చింది. నాన్న, "సరే నువ్వు స్వాధీ
నత ప్రారంభించు," అని అన్నాడు. నేను నమస్కారముచేసి

† Political Agitation—పొలిటికల్ ఏజిటేషన్

‡ Domestic Agitation—డొమెస్టిక్ ఏజిటేషన్

"మంచిది," అన్నాను. అమ్మ మూలకూర్చొని ఏడవడం ఆరంభించింది.

మా నాన్నగారి దక్షిణహస్తము విముఖతవహించింది, కాని అమ్మ మధ్యనుండడంవల్ల మాటిమాటికి మనియార్డరు భేటులు వస్తూఉండేవారు. మేఘము వర్షించడము మానింది, కాని రహస్యముగా అర్ధరాత్రివేళ శిశిరాభిషేకము మాత్రం జరుగుతూ ఉండెను. దీనిని ఊతచేసుకొని వర్తకం మొదలుపెట్టాను—సరిగా డెబ్బైభత్తొమ్మిదిరూపాయిలతో పునాది వేశాను. ఆ వర్తకములో నేడు తిరుగుతూఉన్న రూపాయలు, నలుగురూ ఈర్ష్యకొద్దీ, బాగా తక్కువగా లెక్కవేసి ఇరవైలక్షలు అంటున్నారు.

వివాహదేవత భృత్యులు నావెంటతిరగడం మొదలుపెట్టారు. ఇప్పటివరకూ ద్వారాలు మూసిఉండెనుకాని ఇప్పుడు ఏవిధమైన అడ్డూలేదు. యౌవనములోఉండే ఆశ దుర్నివారమైనదవడముచేత, ఆ ఆశకొద్దీ ఒకపదహారేళ్ల కన్యకవైపు నా మనస్సును పోనిచ్చాను—పూర్వాచార పరాయణులమనస్సులకు కష్టమౌవుతుందేమో అని వయస్సు తగ్గించి పదహారేళ్ల కన్యక అన్నాను. కాని పిల్లఇంటివారు ఐ. సి. ఎస్. పాసయినవా డెవడైనా దొరుకుతాడేమో అని చూస్తున్నారని విన్నాను. ఐ. సి. ఎస్. దొరకనప్పుడు అధమము బారిస్టర్ పరీక్ష అయినా పాసయినవాడు కావలెనట—అంతకు తక్కువవాళ్లవైపు

వాళ్ల దృష్టి పోనేపోవటం. వాళ్ల *మీటరు ప్రకారము నేను †జీరో పాయింటుకంటె దిగువనే ఉన్నాను. కాని కొద్దిరోజులయిన తరువాత ఆయింటికి టీతాగడానికేకాకుండ ఫలహారానికి కూడా వెళ్లడము తటస్థించింది. ఒకనాడు రాత్రి విందు అయినతరువాత ఆ ఇంటి యువతీమణులతో కలసి పేకాట ఆడాను. వాళ్లనోట ఇంగ్లీషుమాటలు విన్నాను, ఆమాటలూ ఆ ధోరణీ పక్కాదొరలమోస్తరు. ర్యాసిల్లాస్, డిజర్టెడ్ విలేజ్ మొదలయినవి చదివీ, ఎడిసన్, స్టీల్ వ్రాసినపుస్తకాలు చదివీ, ఇంగ్లీషులో బాగా ప్రవీణత సంపాదించాను, కాని ఆ యువతులతో కలిసి సంభాషణచేయడము నాకు చేతనైన పనికాదు. ‡'ఓ మై, ఓ డియర్, ఓ డియర్' అని దొరలలాగు నే ననబోతే మాటలు తిన్నగారాక విన్నవాళ్లకు పరమ అసహ్యంగా ఉంటుంది. నాకు చేతనైన ఇంగ్లీషుతో, సహా చేయగలిగితే, బజారులోకివెళ్లి దుకాణదారులతో బేరమాడి ఏమైన కొనితీసుకొని రాగలను, కాని ప్రేమాలాపము చేయబోతే ప్రేమ ఎగిరిపోక మానదు. ఆ ఇంట మాతృభాష కరువు కొట్టి చచ్చింది, చక్కని మాతృభాషలో ఆ అమ్మాయిలతో సంభాషణ చేయబోతే ప్రయత్నము నిష్ఫలము కాకమానదు. సరే అది ఎట్లాగున్నా ఆ ఇంటి విదేశీ గిల్టుపూసినఅమ్మాయి నాకు సులభ్యమైన వస్తువయింది. కాని తలుపుమూసి ఉన్నంతసేపు ఆ సందులోనుంచి

---

* Meter † Zero point 0 °

‡ O my, O dear O dear !

కనబడుతుండే స్వప్నవృత్తి తెలివి తెరవగానే అంతర్ధానమయింది. అప్పుడు, వెనుక నాకిచ్చి పెళ్లి చేస్తానన్న వ్రతచారిణిమాట జ్ఞప్తికి వచ్చింది. నిరర్థకనియమాలలో రాత్రింబగళ్లు ఎడతెరిపి లేకుండా ప్రదక్షిణచేస్తూ, ఆమె తనజడబుద్ధిని తృప్తిపరచుకొంటూ ఉండేది. ఈ యువతులవిషయం కూడా అటువంటిమనస్సులే, వీళ్ల బుద్ధీ అటువంటిదే. అతినిస్సారములైన దొరలపద్ధతులన్నీ అవలంబించి, ప్రొద్దున్న మొదలు సాయంకాలంవరకు వాళ్ల నియమాలలో మునిగి తేలుతూ, సంవత్సరాల కొలదీ విసుగు విరామంలేక, హాయిగా కాలము గడుపుతున్నారు. మడీ స్నానాల విషయాలలో ఏ కవంత లోపముకలిగినా వాళ్లకు ఒంట్లో గగుర్పాటుపడుతుంది. అదేవిధముగా వీళ్లకుకూడా మనము మాట్లాడుతుండేటప్పుడు ఉచ్చారణలో ఎటువంటి లోపము కనబడినా, లేక వాళ్లతో భోజనము చేస్తున్నప్పుడు చమ్చాలు, ఫోర్కులు, పట్టుకోవడంలో ఎటువంటి పొరబాటు జరిగినా, వాళ్లు మన మనుష్యత్వాన్ని గురించి సందేహించక మానరు. వాళ్లు దేశవాళీబొమ్మలు, వీళ్లు విదేశీబొమ్మలు. వీళ్లైనా తమ మనస్సులలో ఉండేశక్తివల్ల నడవలేరు—లోపునఉండే అభ్యాసమనే మరవల్లనే వీళ్లకి నడక ప్రారంభమవుతుంటుంది.

దీని అంతటి ఫలం ఏమిటంటే, స్త్రీజాతిఅంటేనే నాకు గౌరవముపోయింది. వాళ్లకు జ్ఞానము తక్కువఅవుతున్న కొలదీ, స్నానాలూ, ఉపవాసాలూ, నియమాలూ, ఎక్కువఅవుతూ

ఉంటవి, లేకుంటే వాళ్లు బ్రతికిఉండలేరు అని నేను సిద్ధాంతో పరిచాను. ఒకవిధమైన జీవాణువున్నదనీ, అది ఎల్లప్పుడూ చుట్టూ తిరుగుతూ ఉంటుందనీ, ఒక పుస్తకములో చదివాను. మానవు డావిధముగా తిరుగుతూఉండకను, తిన్నగా నడుస్తూ ఉంటాడు—మానవజాతి ఆ జీవాణువుయొక్క పరివర్తిత సంస్కారణము—ఈ పరివర్తితసంస్కారణములోని ప్రకృతులలో ఒకదానిని, అనగా స్త్రీ నొకర్తెను, ఎంచుకొని పెళ్లాడి, యావజ్జీవమూ గడపవలెనని పురుషుని నొసట భగవంతుడు వ్రాశాడు.

ఇవతల, నా వయస్సెలాగున పెరుగుతూ వచ్చిందో అవతల పెళ్లిఅంటే కలిగిన సందిగ్ధభావముకూడా అలాగే వృద్ధి పొందుతూ వచ్చింది. ఒక వయస్సుఉంటుంది—ఆవయస్సులో ఉండేటప్పుడు ఎవరైనా ఎటువంటి ఆలోచనా, ఎట్టిసందేహమూ లేకుండా పెళ్లిచేసేసుకోగలడు. ఆ వయస్సుదాటినతరువాత పెళ్లిచేసికోవలెనంటే గొప్పసాహసం అవసరము. నేను ఆ సాహసికులలోనివాడను కాను. అంతేకాక, స్వాభావిక రీతిని పెరుగుతూఉన్న అమ్మాయి ఎవరైనా నన్ను చూచీ చూడడమంతోనే ఎటువంటికారణములేకుండా పెళ్లిచేసుకో వలెనని కోరుతుందని నేను నమ్మను. ప్రణయానికి కళ్లులేవు అని అన్నాను, కాని అంధప్రణయానికి పెళ్లితో సంబంధము లేదు. సంసారయాత్రకు కావలసిన వివేకానికి రెండేకళ్లు ఉండవు, అంతకంటె అధికం ఉంటవి. ఎటువంటి నిషాగాని

ఉన్మత్తతగాని లేకుండా నావైపుచూచినప్పుడు ఆ కళ్లకు కనబడగల గొప్ప నాలో ఏమి ఉన్నది అని నే నాలోచిస్తున్నాను. నాలో విలువ లేకపోలేదు, కాని అదిచూడగానే కంటపడవలసినది కాదు, అది తెలుసుకోడానికి కొంతకాలము పడుతుంది. నా ముక్కు చప్పిముక్కు, నా మనస్సులో ఉండేబుద్ధి ఆ లోటును పూర్తిచేసింది అని నే నెరుగుదును. అయితే నేమి, ముక్కు కంటికి ప్రత్యక్షముగా కనబడేట్టుగాను మనస్సును నిరాకరముగానూ దేవుడు చేశాడు. కనుక ఈడు వచ్చిన పిల్ల ఎవరైనా, ఎటువంటి అభ్యంతరమూ లేకుండా, నన్ను పెళ్లాడుతానని అతిత్వరలో ఒప్పుకొన్నదని తెలియగానే స్త్రీజాతియెడల నాకుగల గౌరవము మరింతతగ్గుతూ వచ్చింది. నేనే ఆడదాననయిఉంటే శ్రీయుత సరత్ కుమారుని ఆశా, అతని అహంభావమూ, అతని చప్పిముక్కులోనుంచి వస్తుండే నిట్టూర్పులతోనే మంటగలిసిపోయి ఉందును.

ఈ విధముగా నా వివాహానావ అక్కడక్కడ దెబ్బలకు తగులుకొంటూ ఉండెను, కాని ఎన్నడూ రేవుకుమాత్రము చేరలేదు. నా వర్తకము అభివృద్ధిచెందుతూ ఉన్నకొలదీ దానితోపాటు ఒక్కభార్యతప్ప సంసారానికి కావలసిన ఉపకరణాలన్నీ పెరుగుతూవచ్చాయి. నా వయస్సుకూడా పెరుగుతున్నది అన్నసంగతి మరచిపోయినాను, కాని ఒక చిన్నఘటన వల్ల అది జ్ఞాపకమువచ్చింది. అభ్రకం గనులు తనిఖీచేదామని ఛోటానాగర్ పూర్ లో ఉన్న ఒక పట్టణానికి వెళ్లవలసివచ్చింది.

అక్కడికివెళ్లి ఆ ఊరి అవతలఉండే గుగ్గిలపుఅడవిదగ్గర డేరా వేయించాము. మాచేతికి మా సంస్కృతం చెప్పినాయన ఆ గ్రామము లోనే ఒక చిన్న నదిఒడ్డున చిన్న కుటీరం కట్టుకొని హాయిగా కాలము గడుపుతున్నారట. అతనికొడుకు ఆ ఊళ్లోనే ఉద్యోగముచేస్తున్నాడట. నేను గొప్ప ఐశ్వర్యవంతుడనన్న సంగతి దేశమంతటా వ్యాపించింది. ముందునుంచి నే నొక అసామాన్యమానవుని లోకి వస్తానని సంస్కృతంమాష్టారు మొదటినుండీ ఎరుగునట. ఎరిగిఉండవచ్చును కాని సంగతి అతిరహస్యముగా ఉంచాడు. అంతేకాక, అతను ఏ చిహ్నాలనుబట్టి ఆ సంగతి కనిపెట్టాడో అదికూడా నే నెరగను—అసామాన్య మానవిలోకి రావలసిన వాళ్లకు చిన్నప్పుడు వర్ణక్రమము తిన్నగా రాదేమో, బహుశా సంస్కృతం మాష్టరు దానిబట్టి పోల్చి ఉండవచ్చును. కాశీశ్వరి అత్తవారింటికి వెళ్లిపోయింది. అందుచేత మాష్టరుగారి ఇంట్లో వారింటి అబ్బాయిలాగే స్వేచ్ఛగా ఉండగలిగాను. కొద్దిసంవత్సరాలక్రిందట మాష్టరుగారిభార్య చనిపోయింది, ఇప్పు డాయనను ముట్టడించి ఉన్నది మనుమరాళ్లు, కాని అందరూ అతని కానా మనమరాళ్లుకారు, వాళ్లలో ఇద్దరు పరలోకగతుడైన అతని అన్నగారిబిడ్డలబిడ్డలు. వృద్ధుడైన మా మాష్టరు తన వార్ధక్యముయొక్క అంత్యభాగాన్ని ఆ బిడ్డలతో కలసి నానారంగులతో చిత్రించుకొని హాయిగా కాలముగడుపుతున్నాడు. కొండలమీదినుంచి నదీప్రవాహము, రాళ్లమధ్యనుంచి వంకలువంకలుగా తిరుగుతూ, బుడగలతో నిండి, శబ్దము

చేసుకొంటూ పరుగెత్తుతున్నట్టుంటుంది. అదేవిధముగా సంస్కృత పండితుని అమరకోశము, అప్పయ్యశాస్త్రి, హంసదూత, మొదలైన వాటి శ్లోకాలు ఆ పిల్లల నవ్వులతో కలిసి చుట్టూ ఒకశబ్దప్రవాహాన్ని కల్పిస్తున్నవి. అదిచూచి నేను నవ్వుతూ "ఇదేమిటండోయి మాస్టరుగారూ?" అన్నాను. "మీ ఇంగ్లీషు విజ్ఞాన శాస్త్ర ప్రకారం శనిగ్రహముచుట్టూ చంద్రసూాల ఒకటి ఉంటుంది. ఇది నా చంద్రమూాల," అని అతను జవాబు చెప్పాడు.

పరిసరకుటీరములోని ఈ దృశ్యము చూడగానే "ఆహా నేను ఏకాకిని కదా," అని నాకు హఠాత్తుగా తట్టింది. నన్ను నేనే మోసుకొంటూ శ్రమపడుతున్నాను కదా అని అప్పుడు నాకు బోధపడ్డది. తాను ముసలివాడవౌతున్నట్టు మాస్టరుగారికి తోచడం లేనేలేదు. కాని నాకు వయస్సు ముదిరిపోయిందని నాకు స్పష్టముగా తెలుస్తున్నది. వయస్సు ముదిరిపోవడమనగా చుట్టూఉండే పరికరాలతో సంబంధమువిడిచి ఎదిగిపోవడము—అట్లా పెరగడంవల్ల మన చుట్టూ ఖాళీ ఏర్పడుతుంది. ఆఖాళీ మన ఖ్యాతితోగాని మన డబ్బుతోగాని పూడ్చలేము. ప్రపంచమునుంచి నేను కేవలము వస్తువులనుమాత్రము సంగ్రహించగలుగుతున్నాను కాని రసము పొందలేకుండా ఉన్నాను. నేను చేస్తూఉన్నపని ఎంత నిస్సారమైనదో ఎంత వ్యర్థమైనదో అలవాటు అయిపోవడంవల్ల నేను తెలుసుకోలేకపోయిఉండ

వచ్చి, మాస్టరుగారి ఇల్లు చూడగానే నా జీవిత మెంత రస
హీనమైనదో, ఎంత శూన్యమైనదో నాకు తట్టింది. నేను
తనకంటె మహా అదృష్టవంతుడనని మాస్టర్ గారు నిర్ధారణ
పరచికూర్చున్నాడు. ఆ మాట అనుకోగానే నాకు నవ్వు
వచ్చింది. మన ప్రపంచంచుట్టూ అదృశ్యలోకం ఒకటి ఉన్నది,
అది ఆనందలోకం, ఆ ఆనందలోకంతో మనను కలిపెట్టించే
సూత్రమేదీ లేనప్పుడు మన మున్న ప్రపంచము త్రిశంకుస్వర్గము,
మన జీవితము శూన్యము. మా మాస్టరుగారికి ఆ లోకముతో
సంబంధం ఉన్నది, నాకు లేదు—పడకకుర్చీమీద కూర్చొని
రెండుచేతులమీద రెండుకాళ్లూ చాచుకొని ఆలోచిస్తున్నాను.
పురుషుని జీవితములో నాలుగవస్థలలోను నలుగురు అధిష్ఠాన
దేవతలు—బాల్యావస్థలో తల్లి, యౌవనావస్థలో భార్య,
ప్రౌఢావస్థలో కొమార్తె, వార్ధక్యములో మనమరాళ్లు, మన
మలభార్యలు. ఈ విధముగా స్త్రీల మూలముగా పురుషుడు
పూర్ణత్వము పొందుతుంటాడు. ఆ గుగ్గిలపాకులశబ్దము
వింటూ కూర్చుండగా ఈ తత్త్వములోఉండే నిజము నా మనస్సు
నాక్రమించింది. నాకు రాబోయే వార్ధక్యదశ మొదటినుండి
చివరవరకు నా కంటికి కనబడ్డది, దాని రసహీనతవల్ల నా మనస్సు
లో ఒకవిధమైన ఆందోళనపుట్టింది. నేను గడించిన డబ్బు నెత్తి
మీదపెట్టుకొని ఆ మరుభూమిమధ్య నెక్కడో బోర్లపడి చావ
బోతున్నానని నాకు తట్టింది. ఇక మరి ఆలస్యముచేయకూడదు.
నా కిప్పుడు నలభై దాటిపోయింది. నాలో ఉండే యౌవన

న్నాన్ని దులిపివేదామని యాభై యోవేళ్ళు వారిపక్కను నిలు చొని ఉన్నది—దానిచేతనుండే కర్ర చివరభాగం నా కక్కడ నుంచి కనబడుతున్నది. డబ్బుమాట వెనుకఉంచి ఇక జీవితము మాట కొంచెమాలోచించవలెను. కాని జీవితములో సరి అయిన సమయములో చేయక వెనకపెట్టిన పని ఇప్పుడు చేయ డానికి వీలుండదు. అయితే నేమి, చినిగినముక్కలను అతికి చక్కచేసుకొనేవేళ పూర్తిగా పోలేదు.

వర్తకము సందర్భములో అక్కడనుండి పశ్చిమానికి వెళ్లవలసివచ్చింది. అక్కడ విశ్వపతిబాబు అని ఒక వర్తకు డుండెను, అతను మహా ధనవంతుడు, అతనితో నాకు పని ఉం డెను. అతను చాలా జాగరూకుడు, కనుక అతనితో వర్తకవిష యమై ఏదైనా స్థిరపరుచుకొందామంటే చాలా రోజులు పడు తుంది. బాగా చీకాకు పుట్టి, ఇతనితో నాకు పని వీలయే టట్టు లేదని అనుకొని, ఒకనాడు నౌకరుతో ప్రయాణానికి పెట్టెలు సర్దమన్నాను. ఆటువంటిసమయములో ఒకనాటి సాయంకాలము విశ్వపతిబాబు నా బసకువచ్చి, "మీకు చాలా మందితో పరిచయ ముంటుంది, మీరు కొంచెము శ్రద్ధపుచ్చు కొని సాయము చేయబూనుకొన్నారంటే ఒకవితంతువు ప్రాణా లను కాపాడినవా రౌతారు," అని అన్నాడు.

కథ ఏమనగా—నందకృష్ణబాబు అనే ఆయన బెరిలీలో ఒక హైస్కూలుకు హెడ్‌మాస్టరుగా వచ్చాడు. బాగా

చదువు చెప్పగలిగేవాడు. అంతమంచివాడు, అంత పెద్ద చదువు చదివినవాడు, దగ్గరస్థలాలు విడిచి ఇంతదూరము, ఇంత చిన్న జీతముమీద ఎందుకువచ్చాడో అని అంతా ఆశ్చర్యపడు తుండేవారు. బాగా చదువుచెప్పి కుఱ్ఱవాళ్లను పాసుచేయించ డమేకాకుండా, అనేకమైన మంచిమంచిపనులు చేయడానికి ప్రయత్నించేవాడు. అంతలో, అతని భార్య మంచిదైనప్పటికీ గాని తక్కువజాతిది అన్న సంగతి, బయలుపడ్డది. ఆమె ముట్టు కొన్న నీళ్లుతాగితే పాపమట—నీళ్లలోఉండే సాత్వికగుణ మంతా ఆమె ముట్టుకోగానే పోతుందట—అంత తక్కువజాతి అట ఆమెది. ఆ ఊరివాళ్లంతా అతన్ని పట్టుకొని అడిగారట— అడిగితే అతను, "ఆహా, ఔను, ఆమెది తక్కువజాతే, కాని నాకు మాత్రం ఆమె, భార్య." అని అన్నాడు. అటువంటి పెళ్లి శాస్త్రవిరుద్ధముకదా, పెళ్లి అనదగినదా అని అందరికీ సందేహము కలిగింది. వారిలో ఒకడు నందకృష్ణబాబువద్దకు వచ్చి అడిగితే, నందకృష్ణబాబు జబాబిచ్చాడట—"అయ్యా మీరు సాలిగ్రా మాన్ని సాక్షిగాపెట్టుకొని ఒక భార్య అయినవెనుక మరి ఒక భార్యను పెళ్లాడుతారు—కొందరు ద్వివచనముతోకూడా తృప్తిపొందరనడానికి కావలసినంత ప్రమాణం ఉన్నది— సాలిగ్రామముమాట నేను చెప్పలేనుగాని భగవంతుడు మాత్రం మా పెళ్లి సరియైనపెళ్లి అని ఎరుగును— మా పెళ్లి ప్రతిదినమూ, ప్రతిక్షణమూకూడా పటుత్వం కలది, ఇంతకంటె అధికము మాట్లాడి ఈ విషయమై

మీతో వాదనపెట్టుకో దలచుకోలేదు." సంపత్కృష్ణబాబు ఈలాగని ఏ పెద్దమనిషితో అన్నాడో అతనికి ఆ జవాబు విని అట్టే సంతోషం కలగ లేదు, ఇతరుల కపకారముచేసే శక్తి కూడా ఆ పెద్దమనిషిలో చాలా ఉన్నదట. కనుక, దీనికి ఫలంగా, సంపత్కృష్ణబాబు బెరెలీ విడిచిపెట్టి ప్రస్తుతము అతనుండే ఊరికి వచ్చి అక్కడ ప్లీడరీ చేసుకోవలసివచ్చింది. అన్యాయమూ,అబద్ధమూ,అక్కరలేనివాడు సంపత్కృష్ణబాబు—ఉపవాసముండేవాడుగాని దొంగకేసులు పట్టేవాడు కాడు. దీనివల్ల ప్రారంభములో అతనికి ఎంత ఇబ్బంది కలిగినా రాను రాను మాజిస్ట్రేట్లను, కలెక్టర్లకు అతనంటే బాగా నమ్మకం కలిగింది. ఇది అతనికి లాభించింది. ఇక్కడ ఇల్లొకటి కొనుక్కొని, డబ్బు కొంతసంపాదించి సంపత్కృష్ణబాబు హాయిగా ఉంటూఉండగా దేశములో కరువుపుట్టింది. దేశమంతా అల్లకల్లోలంగా ఉండెను, ఎవరికీ తిండికిలేదు. ప్రజలకు సాయం చేసే అధికారం సర్కారువారు ఎవరికి ఇచ్చారో, వాళ్లు సొమ్ము అపహరిస్తున్నారని సంపత్కృష్ణబాబు కలక్టరుతో ఒకనాడన్నాడు. "మంచివాళ్లు మన కెక్కడ దొరుకుతా"రని కలక్టరుగారు సెలవిచ్చారు. "నాలో మీకు నమ్మకముంటే నేను కొంత భారము వహించగలను," అని సంపత్కృష్ణబాబన్నాడు. భారమతనిమీద పడ్డది. ఆ భారము వహిస్తూ, వహిస్తూ ఒకనాడు మట్టమధ్యాహ్నము ఒక పొలములో చచ్చిపడిఉండెను.

గుండె హఠాత్తుగా నిలిచిపోయి చచ్చిపోయినాడని డాక్టరన్నాడు.

కథ ఇంతవరకు నేను ఇంతకుపూర్వమే విన్నాను. నామనస్సులో ఉత్తమభావ మొకటి ఉదయించి ఆవిషయమై ఒకనాడు మాక్లబ్‌లో మాట్లాడడము ప్రారంభించాను—"నందకృష్ణబాబు ప్రపంచములో ఏమీ సాధించలేకపోయినాడు—ఊరు లేదు, పేరులేదు—ఎండకు మాడి చచ్చిపడిపోయినాడు—కాని అటువంటి వాళ్లే భగవంతునికి సహాకారులయి మన ప్రపంచాన్ని ఉన్నతికి—" ఇంతవరకు వచ్చి, నిండువేగముతో పోతున్న నా నావ, దిబ్బకు తగిలి ఆగిపోయినట్లుగా, నామాటలు అకస్మాత్తుగా ఆగిపోయినవి. మాక్లబ్ మెంబర్లలో బాగా ధనవంతుడని పేరుపడ్డవాడూ, అందరిచే మన్నింపబడుతున్నవాడూ, ఒకడుండేవాడు—అతను వార్తాపత్రిక చదువుతూ చదువుతూ, సులోచనాలమీదినుంచి నావైపుచూచి, 'హియర్, హియర్,' అన్నాడు. నా లెక్చర్ హఠాత్తుగా ఆగిపోవడానికి కారణము ఇది.

ఆనందకృష్ణబాబుగారి కొమార్తె, నేను ఇప్పుడు బసచేసి ఉన్న గ్రామములోనే ఉన్నదట. అమ్మాయి దీపావళినాడు పుట్టిందని తండ్రి ఆమెకు, "దీపాలి," అని పేరుపెట్టాడు. ఏ సంఘములోనూ స్థానములేకపోవడముచేత, ఆ వితంతువు తన కొమార్తెకు చదువుచెప్పించుకొంటూ ఒంటరిగా కాలము గడు

పుతూఉండేది. ఇప్పు డాకొమా ర్తెకు పాతికేళ్లు. తల్లివి ఆరోగ్యమైన శరీరము కాదు, వయస్సుకూడా తక్కువ కాదు. ఆమె చనిపోయింటంటే అమ్మాయిని చూచే వా రెవరూ ఉండరు. కనుక విశ్వపతిబాబు వచ్చి, "ఆ అమ్మాయిని పెళ్లి చేసుకోడానికి ఇష్టపడేవారి నొకరిని చూచి పెట్టగలిగితే, చాలా పుణ్యము చేసినవా రౌతా"రని, నన్ను మహాబ్రతిమాలాడు.

విశ్వపతి శుష్కహృదయముగల స్వార్థపరుడనీ, కేవలము పత్రికమూ, తన వ్యవహారమూ తప్ప, మరేదీ అతనికి అక్కర లేదనీ, నే ననుకొంటూ ఉండేవాణ్ణి, కనుక అతనంటే మన స్సులో అసహ్యించుకొంటూ ఉండేవాణ్ణి. కాని ఎట్టిసహా యమూ లేని ఆ వితంతువు కొమార్తెనుగురించి అతనికిగల ఆసక్తిని చూడగానే నామనస్సు కరిగిపోయింది. యుగ యుగాల క్రిందట చచ్చిన ఆదిజంతువుల కడుపులలోనుండి తీసిన గింజలు భూమిలో పాతితే అవి విత్తులయి వాటిలోనుంచి మొక్కలు పుట్టుతున్నవి కదా! చచ్చిన కుప్పలలాగు కనబడే మనుష్యులలోకూడా మనుష్యత్వము పూర్తిగా చచ్చిఉండదు!

"నే నెరిగినవా రొకరున్నారు, ఎటువంటి అభ్యంత రమూ ఉండదు, మీరు పెళ్లి స్థిరపరిచి రోజు నిశ్చయించండి," అని విశ్వపతితో నేను అన్నాను.

"కాని, పిల్లను చూడకుండా——"

"చూడ నక్కర లేదు."

"డబ్బాశకొలదీ చేసుకోబోతే తరువాత చిక్కులు రావచ్చును. తల్లి మరణానంతరము ఆ ఇల్లూ, పదిహేనువేల రూపాయిలూ తప్ప మరేమీ ఆశించకూడదు."

వరునికి కావలసినంత ధనమున్నది, దానివిషయమై మన మాలోచించనక్కరలేదు."

"అతని పేరూ, అతని ఉద్యోగమూ—వాటివిషయమైనా నాకు కొంచెము వివరంగా—"

"అవిఅన్నీ వివరంగా ఇప్పుడు చెపితే, నలుగురికీ తెలిసి పోయి, పెళ్లికి ఆటంకము రావచ్చును."

"అమ్మాయి తల్లితోనైనా చెప్పవలెను కదా—"

"వరుడు నలుగురిమోస్తరుమనిషే అని చెప్పండి. లోపాలూ లేకపోలేదు, మంచిగుణాలూ లేకపోలేదు. మనము భయపడవలసినంత చెడ్డాలేదు అతనిలో, పెద్ద ఆశ పెట్టుకోవలసినంత మంచీ లేదు. పెళ్లిచేసుకోబోయే కన్యకలమనస్సుల కేలాగు ఉంటుందో నేను చెప్పలేను గాని, తల్లిదండ్రులు మాత్రము 'మా అమ్మాయికి ఈలాంటివరుడు దొరికితే ఎంత బాగుండును?' అని అనుకోవడం మాత్రము నే నెరుగుదును."

విశ్వపతిబాబుకు నాయెడల కృతజ్ఞత కలిగింది, అది చూచి నాకు అతనియెడలభక్తి అధిక మయింది. ఇంతకు ముందు నాకూ అతనికీ షరతులు తెగక వదలుకోవలె నను

కున్న వ్యవహారం, నష్టానికైనా ఒప్పుకొని, ఖాయపరచవలెనని నిశ్చయించుకొన్నాను, త్వరగా రిజస్టరీచేయించవలెనని ఉత్సాహం కలిగింది. విశ్వపతిబాబు, వెళ్లిపోతూ వెళ్లిపోతూ, తక్కిన విషయా లేలాగున్నా, ఇంత గుణవతి మరిఒకతె దొరకదని వరునితో చెప్పండి," అని చెప్పాడు.

సంఘంలో స్థానమియ్యక నలుగురూ నిరాకరించిన స్త్రీని మిక్కిలి ఆదరంతో నా హృదయములో ప్రతిష్ఠించినట్లైతే ఆమె తన సర్వామూ నాకు సమర్పించడానికి సంకోచించదని నా నమ్మకము. పెద్ద ఆశపెట్టుకొన్న స్త్రీయొక్క ఆశకు అంతుఉండదు. కాని ఈ దీపాలిదీపము మట్టిప్రమిదలోనిది కనుక, నా ఇంటివంటి మట్టిఇంట ఆమెకు అనాదరణ కలగదు.

ఆ సాయంకాలము దీపము వెలిగించి, ఇంగ్లీషు వార్తాపత్రి కొకటి చదువుతూ కూర్చొని ఉండగా, ఎవరో ఒక ఆడమనిషి నాతో మాట్లాడవలెనని వచ్చిందని నౌకరు చెప్పాడు. ఇంట్లో ఆడ వా ళ్లెవరూ లేకపోవడముచేత ఆమె నెట్లా ఇంట్లోకి రమ్మనడం అని కంగారు పడుతున్నాను. ఏ ఉపాయమూ తట్టకుండా ఉన్నది, అంతలో ఆమె ఇంట్లోకి వచ్చి నమస్కారము చేసింది. నా పై ధోరణిచూచి ఎవరూ నమ్మరేమో గాని, నాకు అతి సిగ్గు. నే నామెముఖంవైపు చూడ లేదు, ఒక్కమాట టాడ లేదు. "నాపేరు దీపాలి," అని ఆమె అన్నది.

అతిమధురమైనకంఠ మామెది. ధైర్యము తెచ్చుకొని ఆమె ముఖమువైపు చూచాను, బుద్ధీ, కోమలతా, ఆ ముఖము లో వికాసము పొందుతున్నవి. ఆమె తలపైని ముసుగు లేదు, తెల్లనిచీర ఆ దేశస్థుల తరహాగా కట్టుకొనిఉన్నది. ఎట్లా సంభాషణ ప్రారంభించడమని ఆలోచిస్తున్నాను, అంతలో ఆమె, "నా పెళ్లికోసము మీరేమి ప్రయత్నము చేయుకండి," అని అన్నది.

దీపాలి వచ్చి ఈ విధంగా అభ్యంతర పరుస్తుందని నేనెన్నడూ ఊహించనైనా లేదు. పెళ్లిమాట వినగానే ఆమె మనస్సూ, ఆమె హృదయమూ, కృతజ్ఞతతో నిండిపోతవని నేను అనుకొన్నాను.

"మీరు ఎరిగినవారిని గాని, ఎరగనివారిని గాని—ఎవరినైనా పెళ్లాడరా?" అని నే నడిగాను.

"ఎవ్వరినీ పెళ్లాడను," అని ఆమె అన్నది.

మన స్త్రీత్వంకంటె వస్తుతత్వం నేను బాగా ఎరుగుదును- నారీచిత్తం తెలుసుకోవడం నామట్టుకు ఇంగ్లీషు స్పెల్లింగు కంటె కఠినము; కాని ఆమె అంతస్పష్టంగా చెపుతూఉన్నా, వినగానే తట్టే అర్థం, ఆమె మాటలయొక్క నిజమైన అర్థం కాదేమో అని, నాకుతోచింది, "మీకొరకు నేను స్థిరపరిచిన వరుడు మీరు నిరాకరించ దగినవాడు కాడు," అని నే నన్నాను.

"నాకు అతనియెడల ఆదరణలేక పోవడంకాదు, నాకు పెళ్లే వద్దు," అని దీపాలి అన్నది.

"అతనికి మీమొహం చాలా గౌరవం ఉన్నది."

"అయినా, నన్ను పెళ్ళాడుమని చెప్పకండి."

"సరే, అలాగైతే పెళ్ళిమాట పోనివ్వండి— మీకేటు వంటిదైనా సహాయం చేయడానికి అవకాశ మియ్యండి."

"ఆడపిల్లల బడిలో నాకొక చిన్నఉద్యోగము కుదిర్చి పెట్టి నన్ను కలకత్తా తీసికొని వెళ్ళగలిగితే చాలా ఉపకారం చేసినవా రవుతారు."

"పని ఒకటి ఉన్నది, మీ కది కుదిర్చిపెట్టగలను," అని నే నన్నాను. కాని అది పూర్తిగా నిజంకాదు. ఆడపిల్లల స్కూలుమాట నేనే మెపగుదును? కాని ఆడపిల్లలస్కూలొ కటి స్థాపిస్తే తప్పులేదే అని నాలో నే ననుకొన్నాను.

"మా ఇంటి కొకమారు వచ్చి అమ్మతో ఈ విషయమై మాట్లాడి చూడగలరూ ?" అని దీపాలి అన్నది.

"రేపు ప్రొద్దున్నేవచ్చి మాట్లాడుతాను," అని నే నన్నాను.

దీపాలి వెళ్ళిపోయింది. నా పేపరు చదవడం ఆగిపో యింది. డాబామీదికి వెళ్ళి కుర్చీమీద కూర్చుండబడి పోయాను, నక్షత్రాలవైపు చూస్తూ, "మీ రెన్నోకోట్ల ఆయోజనాల దూరానఉండి మానవుని జీవన సూత్రా లనూ, కర్మసూత్రాలనూ నడుపుతుంటారట నిజమేనా ?" అని అడిగాను.

అప్పుడు విశ్వపతిబాబు రెండవకుమారుడు, శ్రీపతి, ముందు కబురైనా పంపకుండా, హఠాత్తుగా డాబామీదికి వచ్చి నా ఎదుట నిలుచున్నాడు. అతనికీ నాకూ జరిగిన సంభాషణవల్ల తేలినది ఇది:

శ్రీపతి సంఘాన్ని విడిచిపెట్టైనా దీపాలిని పెళ్లిచేసుకోడానికి సిద్ధంగా ఉన్నాడు. పెళ్లిచేసుకొంటే బయటికి తోలేస్తానని కూర్చున్నాడు, విశ్వపతి. తనకోసమని అంత దుఃఖమూ, అవమానమూ, అన్యాయమూ, సహించి ఉండడానికి తగిన యోగ్యత తనలో లేదని దీపాలి అంటున్నది. అంతేకాక, శ్రీపతి ధనవంతులఇంట ముద్దుగా పెరిగినవాడనిన్నీ, సంఘంనుంచి బహిష్కారం పొంది, ఇల్లూ వాకిలీ లేక డబ్బులేక పడవలసిన బాధల కోర్వలేడనిన్నీ దీపాలి నమ్మకం. దీనివిషయమై శ్రీపతికీ, దీపాలికీ వాదన జరుగుతుండెను, వాదన ఎంతకూ తెగకుండా ఉన్నది—ఆసమయంలో నేను మధ్యకు వచ్చిపడ్డాను, పడడం వల్ల సమస్య మరింత చిక్కు పడిపోయింది కనుక, ప్రూఫ్‌షీట్‌లో గీటుగీసి కొట్టివేసిన పదంలాగు, నన్ని నాటకంలోనుంచి బయటికి వెళ్లమని కోరడానికి శ్రీపతిబాబు నావద్దకు వచ్చాడు.

"రావడం ఏలాగునో జరిగింది గనుక ఇక వెళ్లను," అని నే నన్నాను. "ఒకవేళ వెళ్లవలనే వస్తే చిక్కు విప్పి మరీ వెళ్లుతాను." అన్నాను.

పెళ్లిరోజు మార్చవలసిన అవసరం రాలేదు, వరుడు

మాత్రం మారాడు. విశ్వనాథబాబు కోరిక నెరవేర్చాను కాని ఆయన సంతోషించలేదు, దీపాలికోరిక నెరవేర్చలేదు కాని ఆమె సంతోషించిందని ఆమె ధోరణివల్ల బోధపడ్డది. ఆడ పిల్లలస్కూలులో ఖాళీ ఉన్నదో లేదో నాకు తెలియదు గాని నాకు కొమార్తె లేకపోవడం అనేలోటు దీపాలి పూర్తిచేసింది. పిల్లలు లేకపోవడముచేత కలిగిన శూన్యత నా ఇంట మరిలేదు. నావంటి పేరులేని వాడి జీవితం కూడా కేవలం నిరర్థకం కాదని నా ధనసంపదద్వారా శ్రీపతి పోల్చుకొన్నాడు. సరియైన సమయములో పెళ్ళాడకపోవడమువల్ల కలిగిన లోటును అసమయములో పెళ్ళిచేసికొని సరిచేయవలసివస్తుందేమో అని అను కొన్నాను. కాని భగవంతుని కృపకలిగితే డబుల్ ప్రొమోషన్ పొంది రెండుక్లాసులు ఒక్కదాటున ఎక్కిపోవచ్చునని బోధపడ్డది.

నాకు యూస్టేగ్సు వేళ్ళు వచ్చేసరికి నా ఇల్లు మనమ రాళ్ళతో నిండింది, పైగా ఒకమనమడు కూడా కలిగాడు. కాని విశ్వనాథబాబూ నేనూ కలిసి చేయవలెననుకొన్న వ్యాపారం మాత్రం నిలిచిపోయింది. అది నిలిచిపోవడానికి కారణం వసుసు ఆయన ఇష్టపడకపోవడమే.

# పోస్ట్ మాస్టర్

అతడు పోస్టుమాస్టరు—పనిలో ప్రవేశించగానే అతనిని ఉలాపూర్ అనే గ్రామములో పోస్టుమాస్టర్‌గా వేశారు. ఊరు చాలా చిన్నది. ఆ సమీపములో ఒక నీలిమందు ఫ్యాక్టరీ ఉన్నది—ఆ ఫ్యాక్టరీ యజమాని ఒక దొర. అతడెంతో ప్రయత్నముపైని అక్కడ కొత్తగా ఈ పోస్టాఫీస్ పెట్టించగలిగాడు.

మన కొత్త పోస్టుమాస్టరుగారు కలకత్తా అబ్బాయి. చేపను నీటిలోనుంచి తీసి గట్టుమీద వేస్తే దాని కేలాగుంటుందో పోస్టుమాస్టరుగారికి కలకత్తానుంచి తీసుకొనివచ్చి ఈ గ్రామములో విడిచిపెడితే అలాగున ఉన్నది. పోస్టాఫీసు బల్లలతో కట్టిన ఒక చిన్న యిల్లు; ఇంటిలోపలికి వెలుతురు రాదు.

పోస్టాఫీసుకు దగ్గరగానే ఒక చిన్న చెరువు—ఆ చెరువు నిండా నాచు—దానిచుట్టూ అడివి బలిసి ఉన్నది. ఫ్యాక్టరీ గుమాస్తాలకు కొంచెమైనా తీరుబడి ఉండేది కాదు; ఉన్నా, వాళ్లు పెద్దవాళ్లతో కలిసి మెలిసి ఉండదగినవాళ్లు కారు.

ఇంతేకాక, కలకత్తానుంచి వచ్చే యువకులు, నలుగురితో కలిసి మెలిసి ఉండడము ఎరగనివాళ్లు; కొత్తస్థలానికి వెళితే, తామేమో చాలా పెద్దవాళ్లు అన్నట్టుగానైనా నటించు

కొంటూరు, లేదా పనిచేయడమో తెలియనివాళ్లలాగు సంకోచముతో మసులుతుంటారు. కనుక మన పోస్టుమాస్టరుకు ఆ గ్రామస్థులతో స్నేహము బాగా కలియలేదు. పని ఆట్టే లేకపోవడంచేత, కూర్చొని, అతడప్పుడప్పుడు పద్యాలు వ్రాస్తూ ఉండేవాడు. "తరుపల్లవకంపనాన్ని," "మేఘాచ్ఛన్న" ఆకాశాన్ని, చూస్తూ అతిసుఖముగా అతడు కాలము గడుపుతున్నాడని ఆపద్యాలు చదివేవాళ్లకు తట్టుతుంది. కాని నిజము భగవంతునికి తెలియకపోలేదు—అరేబియన్ నైట్సులోని రాక్షసి ఒకడు వచ్చి, రాత్రికిరాత్రీ, చెట్లూ చేమలూ, జాడైనా లేకుండా, తెగనరికి, అక్కడ చక్కని రోడ్లు వేయించి ఈప్రక్కనూ ఆప్రక్కనూ ఆకాశాన్ని అంటుతూఉన్న మేడలు కట్టించగలిగినట్లైతే, పట్టణవాసిఅయిన మన పోస్టుమాస్టరుగారికి పోయిన ప్రాణాలు తిరిగి వచ్చిఉండును.

పోస్టుమాస్టరుగారికి జీతము అతిస్వల్పము, తానే వండుకొని తింటూఉండేవాడు; తల్లీతండ్రీ లేని పిల్ల ఒకతె ఇంటిపని చేస్తూ ఉండేది. ఆ పిల్లకికూడా పోస్టుమాస్టరే నాలుగు మెతుకులు వేస్తూఉండేవాడు. తిని, పిల్ల ఇక్కడనే పడిఉండేది. ఆ పిల్లపేరు 'రత్న', వయస్సు పన్నెండు పదమూడు అయిఉంటుంది, పెళ్లి అయేదారేదీ కానరాలేదు. ప్రతిదినమూ చీకటి పడుతూ పడుతూఉండేవేళకు, ఊరిచివరనుండే ఆవులసాలలో నుంచి చుట్టలుచుట్టలుగా పొగలేస్తూ ఉండేది, పొదలలో

నుంచి పురుగులు గీంపెడుతూ ఉండేవి, ఊళ్లోని నిషాకోసుల బృందము మద్దెలా తాళాలతో గొంతుకలెత్తి పాడుతూఉండే వాళ్లు. ఆ చీకటిలో అరుగుమీద ఒంటరిగా కూర్చొని, "తరు పల్లవకంపనము," చూస్తూఉంటే ఏ కవిహృదయములోనైనా కంపనము పుట్టకమానదు——ఇటువంటివేళ, మిణుకు మిణుకుమని దీపము వెలుగుతున్న గదిలో ఒకమూలను కూర్చొని పోస్టు మాస్టరు 'రత్నా'! అని ఒకనాడుపిలిచాడు. ఆపిలుపు ఎప్పుడు వచ్చునాఅని కనిపెట్టుకొని ఉండేది రత్న, కాని ఒక్కపిలుపుకు ఎన్నడూ లోపలికి వెళ్లేదికాదు——"ఏమి బాబూ ఏమికావాలి?" అని బయటనుంచే అడిగింది.

పోస్టమాస్టరు——"ఏమి చేస్తున్నావే?"

"పొయ్యిలో నిప్పువేయడానికి ఇప్పుడే వెళ్లాలి——వంట పంచలో——"

"వంట కాస్సేపుపోయాక ప్రారంభించవచ్చు, ముందుగా కొంచెము హుక్కా తయారుచేసి ఇయ్యి."

బుగ్గలు పూరించి చిలుములో నిప్పుచేస్తూ తొందర తొందరగా రత్న గదిలో ప్రవేశించింది. రత్న చేతిలోనుంచి హుక్కా తీసుకొంటూ, పోస్టుమాస్టరు చటాలున ఒకప్రశ్న అడిగాడు——

"రత్నా మీ అమ్మ నీకు జ్ఞప్తికి వస్తూ ఉంటుందీ?"

ఒక్కమాటతో ఆ ప్రశ్నకు జబాబుచెప్పడము కష్టము.

అమ్మను గురించిన సంగతులు కొన్ని రత్నకు జ్ఞప్తికివస్తూఉంటవి. కొన్నిసంగతులు ఎంతేసా జ్ఞప్తిరాకుండా ఉన్నవి. రత్నను తల్లి కంటె తండ్రి చాలా ముద్దుచేసేవాడు. ఆమెకు తండ్రిసంగతులు కొంచెము కొంచెము జ్ఞప్తికి వస్తూఉంటవి. తండ్రి పగలంతా పనిచేసి సాయంకాలం ఇంటికి వచ్చేవాడు. ఒకటి రెండు సాయంకాలాలమాట రత్నకి బహుస్పష్టముగా జ్ఞాపకమున్నది. ఆసాయంకాలాలలో జరిగినసంగతులు అతిస్పష్టముగా చిత్రించిన పటములాగు ఆమెకంటికి నేటివరకూ కనబడుతున్నవి. ఈమాటా ఆమాటా చెపుతూ రత్న పోస్టుమాస్టరు కాళ్లదగ్గర మెల్లిగా కూర్చుండబడిపోయేది.

రత్ననికి ఒక చిన్నతమ్ము డుండేవాడు. వర్షాకాలంలో ఒకనాటిసాయంకాలము, రత్నా వాడూకలిసి చెరువుగట్టుమీదికి వెళ్లి, అక్కడ విరిగిపడిఉన్న చెట్టుకొమ్మ నొకదానిని గాలపు రువ్వచేసి, చేపలుపట్టడము-ఆట ఆడుతూ కూర్చున్నారు. ఎన్నో పెద్దవిషయాలకంటే ఈ చిన్నసంగతే రత్నకి మాటిమాటికి జ్ఞప్తికి వస్తూఉండేది. ఇట్లామాట్లాడుతూ మాట్లాడుతూ చాలా రాత్రి అయిపోయేది. ఒకొకనాడు పోస్టుమాస్టరుకు మరి వంట చేయాలని బుద్ధిపుట్టేదికాదు. ప్రొద్దున్న వండిన కూర కొంచెము ఉండేది, రత్న త్వరగా త్వరగా నిప్పుచేసి నాలుగు రొట్టెలు కాల్చితెచ్చేది, వాటితోనే ఇద్దరికీ రాత్రిభోజనము జరిగిపోయేది.

ఆ కుటీరములో మూలను బల్లకుర్చీమీదకూర్చొని ఒకోనాడు సాయంకాలం పోస్టుమాస్టరు తన ఇంటి సంగతులు కూడా చెపుతూ ఉండేవాడు. విదేశంలో ఒంటరిగా ఉన్న పోస్టుమాస్టరుకు స్వగ్రామంలో ఉన్న తల్లిమాట, చిన్నతమ్ముని మాట, అక్కమాట, జ్ఞప్తికి వస్తూఉండేవి. మాటిమాటికి వారి సంగతి అనుకొంటూ అతని ప్రాణము కొట్టుకొంటూ ఉండేది. కాని ఇక్కడఉండే నీలిఫ్యాక్టరీగుమాస్తాలతో తన ఇంటి మాటచెప్ప బుద్ధి వేసేదికాదు. అతను, చదువుసంధ్యలులేని ఆ చిన్నపిల్ల రత్నతో, వాళ్లనుగురించి ప్రసంగిస్తూ ఉండేవాడు. ఇది అతనికి అసందర్భముగా కనబడేదికాదు. రానురాను ఏమయినదంటే, కబుర్లుచెప్పుకొంటూఉండేటప్పుడురత్న అతని ఇంటివారిని గురించి ఏమైనా అనవలసివస్తే, ఎన్నాళ్లబట్టో వాళ్ల నెరిగినదానివలె, "అమ్మ" "అక్క" "అన్న" అని వరసలుపెట్టి వాళ్లనుగురించి ఆమె అంటూ ఉండేది. ఆబాలిక చిట్టి హృదయములో అక్క, అమ్మ, అన్నల ఆకారాలుకూడా ఊహామూలముగా ముద్రితమై ఉండేను.

ఒకనాటి మధ్యాహ్నం బాగా మేఘంకాసి ఉన్నది; వేడివేడిగాలి మెల్లిగా వీస్తూ ఉన్నది; వేడెక్కిన పచ్చికనుంచీ, చెట్లనుండే ఆకులనుంచీ, ఒకవిధమైన వాసన వస్తూఉన్నది; అలసి పడిఉన్న పృథ్వి ఊపిరితీస్తూఉంటే, ఆ ఊపిరి వచ్చి ఒంటికి తగులుతూ ఉన్నదా అని అనిపిస్తూ ఉన్నది. సృష్టి

ఎదుట ఫిర్యాదుచేస్తూ, మొండిపట్టుపట్టిన పక్షి ఒకటి, విన్నవారి మనస్సులు కరిగేటట్టుగా, మధ్యాహ్నమంతా, ఒకేవరసను కూత వేస్తున్నది. ఆనాడు పోస్టుమాస్టరు పని లేకుండా ఉన్నాడు. కురిసి కురిసి వర్షం ఆగింది; మిగిలిఉన్న మేఘాలు ఆకాశాన కుప్పలుకుప్పలుగా కూడి ఉన్నవి. వాటిపైని సూర్యకిరణాలు పడుతూఉన్నవి. ఈ మేఘరాసులూ, వర్షము కడిగి శుభ్రపరిచిన చెట్లమీద తళతళమంటూ నాట్యముచేస్తూఉన్న నల్లని ఆకులూ, నిజముగా చూడదగిన వస్తువులే. పోస్టుమాస్టరు అవి చూస్తూ కూర్చొని—"ఇటువంటి సమయములో కేవలము నావాళ్లే అనదగిన వాళ్లెవరైనా నాతో ఉంటే నేను ఎంత సుఖముగా ఉండిఉందును! అనురాగముతో నాహృదయముతో తన హృదయము కలపగల ఒక సుందరమూర్తి దగ్గరఉన్నయెడల నా కెంత ఆనందముగా ఉండిఉందును!" అని తనలో తా ననుకొంటున్నాడు. మరికొంతసేపటికి ఆ పక్షి కూడా ఆమాటే అంటున్నట్టు అతనికి తట్టింది; చెట్లనీడలో మాటుమడిగి, ఆ నిర్జనమధ్యాహ్నమప్పుడు, ఆకులుచేస్తూఉండే మర్మరధ్వనియొక్క అర్థముకూడా కొంతవరకు అదే. అతిస్వల్పజీతము తెచ్చుకొంటూ, ఆ చిన్నపల్లెలో సబ్ పోస్టుమాస్టరుగా ఉన్న అతనిమనస్సులో ఎంతకూ అంతంకాని ఆ సెలవునాటి నిస్తబ్ధమధ్యాహ్నసమయాన అటువంటిభావాలు పుట్టుతూ ఉన్నవని ఎవరూ ఎరగరు, పుట్టవచ్చునని ఎవరూ నమ్మరు.

పోస్టుమాస్టరు పెద్దనిట్టూర్పువిడిచి, 'రత్నా' అని పిలిచాడు. రత్న అప్పుడు జామచెట్టుక్రింద కాళ్లుచాచుకొని కూర్చొని పచ్చిజామకాయ తింటూ ఉన్నది. ప్రభువు కంఠం వినబడగానే పరుగెత్తివచ్చి, "పిలుస్తున్నావా బాబూ ?" అని అడిగింది. "నీకు నేను మెల్లిమెల్లిగా చదవడం నేర్పుతాను," అని అంటూ, అప్పుడే ప్రారంభించి, 'అ' 'ఆ' లు వ్రాయిస్తూ పోస్టుమాస్టరు ఆ మధ్యాహ్నమంతా రత్నతోనే కూర్చున్నాడు. ఈలాగు కొద్దిరోజులలో వర్ణక్రమమంతా నేర్పేశాడు.

శ్రావణమాసము. వర్షానికి విరామములేదు. చెరువులు, కాలువలు, పొలాలు, జలమయమైపోయినవి. రాత్రింబగళ్లు వర్షపుహోరు, కప్పల బెకబెకలు. దారులవెంట రాకపోకలు పూర్తిగా నిలిచిపోయినవనే చెప్పవచ్చును—సంతకు వెళ్లవలెనంటే పడవచేసుకొని వెళ్లవలసిందే !

ఒకనాడు ఉదయమే ప్రారంభించి వర్షము ఏకధారగా కురుస్తూ ఉన్నది. పోస్టుమాస్టరుగారిశిష్యురాలు ద్వారముదగ్గర చాలాసేపు కనిపెట్టుకొని కూర్చున్నదిగాని ఎంతకూర్చున్నా మామూలుప్రకారం గురువుగారి పిలుపు ఈవాళ వినబడలేదు. పుస్తకంపట్టుకొని మెల్లిగా గదిలో ప్రవేశించింది. పోస్టుమాస్టరు కర్ర మంచముమీద పడుకొని ఉన్నాడు ; అతడు విశ్రాంతి తీసుకొంటూ ఉన్నాడనుకొని రత్న, ముఖమటుత్రిప్పి, చప్పుడు చేయకుండా బయటికి వెళ్లిపోబోతున్నప్పుడు, హఠాత్తుగా

'రత్నా' అని పిలుపు ఆమెకు వినబడ్డది. రత్న వెంటనే అటు తిరిగి, "నిద్రపోతున్నావా * దాదాబాబూ?" అని అడిగింది. పోస్టుమాస్టరు కొంచె మాయాసపడుతూ, "ఒంట్లో బాగు లేదు, తలమీద చెయ్యివేసి చూడు రత్నా," అని అన్నాడు.

అటువంటి వర్షపురోజున పరదేశములో ఒంటరిగా ఉన్నప్పుడు ఒంట్లో జబ్బుగా ఉండడము తటస్థిస్తే, సంరక్షణ చేసేవా రెవరైనా దగ్గరఉంటే, ఎంత హాయిగా ఉండును అనిపిస్తూఉంటుంది, వేడెక్కిన నొసటిపైని గాజులు పెట్టుకొన్న చేతియొక్క కోమలస్పర్శ జ్ఞప్తికి వస్తూఉంటుంది, ఇటువంటి ఘోరమైన పరదేశవాసములో రోగముతో బాధపడుతూ ఉన్నప్పుడు ప్రేమస్వరూపిణిఅయిన తల్లో అక్కో దగ్గర ఉండవలెనను కోరిక పుడుతూ ఉంటుంది. పరదేశవాసి అయిన పోస్టుమాస్టరు కోరికకూడా ఇక్కడ నిష్ఫలము కాలేదు. పిల్లఅయినా రత్న, పిల్లగా ఉండక, ఆక్షణమే తల్లి పదవిని గ్రహించింది. వెంటనే వైద్యుని తీసికొనివచ్చింది, వేళప్రకారము మాత్రలు నూరి పట్టి, తానే రోగికి పథ్యము చేసిఇచ్చి, రాత్రి నిద్రలేకుండా అతని తలదగ్గిర కూర్చొని, "దాదాబాబూ, ఇప్పుడు కొంచెము నెమ్మదిగా ఉన్నదా?" అని ఉండిఉండి అడుగుతుండేది.

మంచము పడిలేసరికి పోస్టుమాస్టరుగారి ఒంట్లో ఏమీ

* దాదా=అన్న.

బలములేదు. అక్కడనుంచి ఏలాగో బదిలీ చేయించుకో వలెను, ఎంతమాత్ర మక్కడ ఉండకూడదు అని నిశ్చయించు కొన్నాడు. అది జబ్బుస్థలము గనుక తనను తక్షణం అక్కడనుంచి బదిలీచేయించమని కలకత్తాలోనున్న ఆఫీసువారికి అతడు దరఖాస్తు పంపాడు.

రోగిసేవనుంచి విముక్తురాలు కాగానే రత్న తన మామూలు పనికి వచ్చి గది బయటను కూర్చోవడ మారం భించింది, కాని లోపలనుంచి మునుపటి పిలుపు ఎంతసేపూ రాకుండా ఉన్నది. అప్పుడప్పుడు గదిలోకి తొంగిచూస్తూ ఉండేది—పోస్టుమాస్టరు కుర్చీమీద పరధ్యానముగా కూర్చొని ఉండేవాడు ఒకప్పుడు, ఒకప్పుడు కర్రమంచముమీద పడుకొని ఉండేవాడు. ఏక్షణము అతను పిలుస్తాడో అని బయట గడపదగ్గర కనిపెట్టుకొని కూర్చుండేది రత్న. లోపున కూర్చొని తన దరఖాస్తుకు ఏమి జబాబువస్తుందో అని చూస్తుం డేవాడు పోస్టుమాస్టరు. రత్న తన పాతచదువు లెక్కలేనన్ని మార్లు వల్లిస్తూ ఉండేది, ఎప్పుడో అకస్మాత్తుగా గురువుగారు పిలిచేసరికి సంయుక్తాక్షరాలలో తప్పు లెక్కడ వస్తవో అని ఆమెకు భయముగా ఉండేది. ఈలాగున సుమారు ఒకవారము రోజులు గడిచిపోయిఉంటవి, ఒకనాడు సాయంకాలము హఠా త్తుగా పిలుపు వినబడ్డది. రత్న తడబడపడుతూ గదిలోకి వచ్చి, "నన్ను పిలిచావా. దాదాబాబూ?" అని అన్నది.

"రేపే నేను వెళ్లుతున్నాను," అన్నాడు పోస్టుమాస్టరు.

"ఎక్కడికి వెళ్లుతున్నావు?"

"ఇంటికి వెళ్లుతున్నాను."

"మళ్లా ఎప్పుడు వస్తావు?"

"మరి రాను."

రత్న మరేమీ అడగలేదు. పోస్టుమాస్టరు తానే చెప్పాడు, తాను బదిలీచేయమని దరఖాస్తుచేసినట్టూ, అధికార్లు దరఖాస్తు అంగీకరించకపోవడంవల్ల ఉద్యోగం విడిచిపెట్టి ఇంటికి వెళ్లిపోతున్నట్టూ. చాలాసేపటివరకు ఇద్దరిలో ఒకరూ మాటలాడలేదు. దీపం మిణుకుమిణుకుమని వెలుగుతున్నది, ఇంటికప్పులో సుండే కన్నములోనుంచి చినుకులు టుప్పుటుప్పు మని సిబ్బిమీద పడుతున్నవి.

కొంతసేపైన తరువాత లేచి రత్న రొట్టె చేదామని వంటింటిలోనికి వెళ్లింది. రోజూలాగు ఈవాళ పని తొందర తొందరగా జరిగినట్టు కనబడలేదు. ఉండిఉండి అనేకవిధాల భావాలు ఆమెతలలో దూరుతున్నట్టుండెను. పోస్టుమాస్టరు భోజనం ముగించినతరువాత రత్న హఠాత్తుగా, "దాదా బాబూ, నన్ను మీ ఇంటికి తీసుకొని వెళ్లుతావూ ?" అని అడిగింది.

పోస్టుమాస్టరు నవ్వుతూ, "అది ఎట్లాగు?" అని అన్నాడు.

అటువంటి పని ఎందుచేత నసాధ్యమో, ఆ కారణాలన్నీ చెప్పటా మవసరమని పోస్టుమాస్టరుకు తోచలేదు.

ఆరాత్రి అంతా కలలోనుగాని మెలుకువగా ఉన్నప్పుడుగాని పోస్టుమాస్టరుగారి నవ్వూ, అతనిమాటలే, రత్నకు వినబడుతూ ఉండెను—"అది ఎట్లాగు ?" "అది ఎట్లాగు?"

తెల్లవారేసరికి పోస్టుమాస్టరుకోసము స్నానానికి నీళ్లు సిద్ధముగా ఉన్నవి. పోస్టుమాస్టరు స్నానానికి ఏటికీ చెరువుకూ వెళ్లేవాడు కాడు. కలకత్తాలోని అభ్యాసముప్రకారము ఇంటిలోనే స్నానముచేసేవాడు. అత డెప్పుడు బయలుదేరుతాడో రత్న ఎందుచేతనోగాని అడగలేకపోయింది. ఏక్షణము నీళ్లుకావలసి వస్తవో అని ఆలోచించి ఏటినుంచి రాత్రే నీళ్లుతెచ్చి ఉంచింది. స్నానంచేసినతరువాత పోస్టుమాస్టరు రత్నను పిలిచాడు. రత్న లోనికి వచ్చి ఆజ్ఞకు తెలియగోరి పోస్టుమాస్టరు ముఖముచూస్తూ నిలబడ్డది. "నా స్థానే వచ్చే అతనితో నేను చెప్పి వెళ్లుతాను, అతడూ నాలాగే నీవు ఇక్కడే ఉండేటట్లుగా ఏర్పాటుచేసి, నీ కే కష్టమూ లేకుండా చూస్తాడు, నీవేమీ భయపడవద్దు," అని పోస్టుమాస్టరు రత్నతో అన్నాడు. మిక్కిలి దయతోనూ, ప్రేమతోనూ పోస్టుమాస్ట రన్నమాట అది—సందేహములేదు. పోస్టుమాస్టరు తిట్టినతిట్లూ పెట్టిన చీవాట్లూ రత్న ఇన్నాళ్లూ సునాయాసంగా సహించి ఉన్నది, కాని అత డిప్పుడు అంత దయతో అన్నా

ఈమాటలుమాత్రము సహించి ఉండలేకపోయింది—నారీ హృదయము తెలుసుకోవడం ఎవరికిసాధ్యము? రత్న అతని మాటలు వినగానే వెక్కి వెక్కి ఏడుస్తూ, "నీవెవరితోనూ ఏమీ చెప్పనక్కరలేదు, నే నిక్కడ ఉండను," అని అన్నది.

రత్న ఇంతకుపూర్వ మెన్నడూ ఈవిధముగా చేయలేదు. ఇదిచూచి పోస్టుమాస్టరు నిశ్చేష్టుడైనాడు.

కొత్తపోస్టుమాస్టరు వచ్చాడు, అతనికి చార్జి ఇచ్చి పాతపోస్టుమాస్టరు వెళ్లిపోడానికి సిద్ధంగాఉన్నాడు, వెళ్లే ముందర రత్నని పిలిచి, "రత్నా నీకెన్నడూ ఏమీ ఈయలేకపోయినాను, వెళ్లుతున్నప్పు డీవాళ నీకేమైనా ఇస్తాను, దీనితో నాలుగురోజులు గడపుకోవచ్చును," అని అన్నాడు.

పోస్టుమాస్టరు తన జీతములోనుంచి ప్రయాణము కర్చుకు కావలసినంత ఉంచుకొని మిగిలినరూపాయలు జేబులోనుంచి తీశాడు. రత్న పోస్టుమాస్టరు కాళ్లుపట్టుకొని "మీ పాదాలకి నమస్కారం దాదాబాబూ, మీపాదాలకి నమస్కారం. మీరు నాకేమీ ఇయ్యక్కరలేదు, మీకు నమస్కారము చేస్తున్నాను, నావిషయమై మీరెవరితోనూ చెప్పక్కరలేదు," అని అన్నది. ఇట్లాఅంటూ లేచి అక్కడినుంచి పరుగెత్తిపారిపోయింది.

పోస్టుమాస్టరు నిట్టూర్పువిడిచి రైలుసంచి చేతితో పట్టుకొని, భుజంమీద గొడుగువేసుకొని, ఎరుపూ తెలుపూ

సొరల టిన్‌ట్రంకొకటి కూలివాడి నెత్తిమీద పెట్టి, పడవరేవుకు బయలుదేరాడు.

పోస్టుమాస్టరు పడవ ఎక్కాడు, పడవ రేవు వదిలింది. వర్షాలవల్ల గట్లుతీసి పారుతున్న నదీప్రవాహము, విరామము లేకుండా ప్రవహిస్తున్న అశ్రుధారలవలె, కనబడుతున్నది. పోస్టుమాస్టరుకు ఒక విధమైన హృదయవేదన కలిగింది. అవ్యక్తముగా విశ్వమంతటా వ్యాపించిఉన్న వ్యథ ఒక సామాన్య గ్రామబాలికముఖాన వ్యక్తమవుతూ అతనికంటికి కట్టినట్లున్నది. తిరిగి ఆ గ్రామంలోకి వచ్చి, భూదేవి ఒడిలో సుంచితప్పిన ఆ అనాథబాలికను తనతోకూడా తీసుకొని పోవలెనని పోస్టుమాస్టరుకు చాలా కోరికపుట్టింది. కాని ఆ సమయంలోనే తెర చాపకు గాలి బాగా తగిలింది, కలకలధ్వనిచేస్తూ నదీప్రవాహం అతివేగముతో పోతున్నది. ఊరిఅవతలనుండే శ్మశానం ఏటి ఒడ్డున కనబడుతున్నది, నదీప్రవాహంలో ప్రయాణము చేస్తున్న పథికుని ఉదాసీనహృదయంలో వైరాగ్యంపుట్టి, అత డీవిధముగా అనుకొంటున్నాడు—“జీవితములో ఇటువంటి ఎడబాటు లెన్నిఉంటవో కదా! ఎన్ని మృత్యువులు నేను చూడవలసిఉన్నదో కదా! కనుక నేనిప్పుడు తిరిగివెళ్లడంవల్ల ఏమిప్రయోజనము? ఈలోకములో ఎవరు ఎవరివారు ?”

కాని రత్నహృదయంలో మాత్రం ఎటువంటి వైరాగ్యమూ పుట్టలేదు. పోస్టాఫీసుచుట్టూ తిరుగుతూ కన్నీటిధార

లతో ఆజాగాను తడిచేస్తున్నది. దాదాబాబు మళ్లా వస్తా డేమో అని లోలోపున కొంచెంఆశ ఉండెను కాబోలు, కనుక ఆస్థలం వదిలి దూరం వెళ్లలేకపోయింది.

మానవహృదయం ఎంత జ్ఞాన హీనమైనది! భ్రమ మనను ఒకంతట వదలదు. యుక్తి, యోచన, ఎంతో ఆలస్యముగాగాని మనలో ప్రవేశించవు. ఎంత బలమైన ప్రమాణాలనైనా నమ్మక, మాయఆశలనే గుండెమీద పెట్టుకొని, రెండుచేతులతో కౌగ లించుకొని, ప్రాణముపోయినా వదలకుండా కూర్చుంటాము. చివరకు ఎప్పుడో ఒకనాడు మన రక్తనాడులనుచీల్చి, మన హృద యములోనుండే రక్తాన్ని పూర్తిగా పీల్చి, ఆ ఆశ పారిపోతుంది. అప్పుడు మనకు తెలివివస్తుంది, కాని మళ్లా మరిఒక కొత్త భ్రాంతిపాశములో పడేవరకు మనకు శాంతి ఉండదు.

# శాస్తి

దుఖీరామ్, ఛిదామ్—ఇద్దరన్నదమ్ములూ ప్రొద్దున్నే లేచి కొడవళ్లు చేతపుచ్చుకొని ధాన్యముకోతకు బయలు దేరారు—వాళ్లూ ఇల్లు వదిలారు భార్యలిద్దరూ ఘోరముగా తిట్టుకొంటూ పోట్లాట ప్రారంభించారు. కాని సృష్టిలో ఉండే నానావిధాల కలరవాలకూ అలవాటు పడిఉన్నట్టే ఆ పేటలోని వాళ్లు ఈ పోట్లాటకుకూడా అలవాటు పడిఉన్నారు. కేకలు వినబడగానే చుట్టుప్రక్కలవారంతా, "అదిగో ఆరంభమయింది!" అనేవారు— వారన్నమాటకు అర్థమేమంటే— "మనంఅను కొన్నదేజరిగింది—రోజూ జరుగుతున్నదే ఈవాళా జరగ బోతుంది," అని. ప్రొద్దున్నే సూర్యుడుదయించడంచూచి కారణమేమి అని ఎవ్వరూ అడగరు. ఆవిధముగానే ఈ ఇంటి కేకలు వినబడినప్పుడు ఎవరికీ వింతా, విడ్డూరము ఏమీ లేదు, ఏమిటా కేక లని ఎవ్వరూ అడగరు.

ఈ తోటికోడళ్ల కేకలు ఇరుపొరుగులవాళ్ల నంతగా అం టకపోవచ్చును గాని, భర్తలకుమాత్రము అంతకంటె కొంచెము ఎక్కువగా అంటుతుండవలెను కదా. అయినా ఇది ఒక గొప్ప కష్టము అని వాళ్లు ఎన్నడూ అనుకోలేదు. ఒకే 'ఎక్కా' బండి ఎక్కి ఎంతకూ అంతంకాని సంసారయాత్ర జరుపుతూఉన్న

యాత్రీకులా యిద్దరన్నదమ్ములూ—బండికి, ఇరుసుకిందను, స్ప్రింగులు లేవు, ఎడ తెరిపిలేకుండా గడగడ దడదడ శబ్దమాత్రా ఉన్నది. విధివిహితమైన నియమాలలో ఈ శబ్దముకూడా ఒకటి అని తలచి, ఆ ఇద్దరన్నదమ్ములూ యాత్ర చేస్తున్నారు.

అంతేకాదు. ఎన్నడో ఒకనాడు ఇంట్లో సందడిలేకుండా ఉంటే, ఇంట్లో దయ్యాలు చేవుళ్లాడుతున్నట్టుండి ఏక్షణాని కేమిచేస్తుందో తెలియదన్నట్టుగా వాళ్లకు భయము వేస్తూ ఉండేది.

ఒకనాడు జరిగిన ముచ్చట వినండి: ఇద్దరన్నదమ్ములూ రోజంతా కూలిపనిచేసి సాయంకాలము ఇంటికి వచ్చేసరికి ఇంట్లో అతినిశ్శబ్దముగా ఉన్నది.

మధ్యాహ్నా మొకతెర వర్షము కురిసింది; ఇప్పటికీ ఆకాశమంతా మేఘము కమ్మి ఉన్నది, బయటకూడా నిశ్శబ్దము, చెట్లును ఒక్కాకైనా ఆడలేదు. వర్షాలకు ఇంటికి నాలుగువైపులా గాబు దట్టముగా పెరిగింది. ఇంటిదగ్గరనుంచి నీటితో నిండిఉన్న జనపనార చేలవరకు రవంతైనా ఖాళీ లేకుండా అంతా మొక్కలతో నిండిపోయింది. గాఢమైన వాసన ఒకటి ఆ ఆకులలోనుంచిపుట్టి, నాలుగువైపులా ప్రహరీలాగు నిలిచి ఉన్నది. ఆవులసాలకు వెనుకనుండే చెరువులోనుంచి కప్పలు అరుస్తున్నవి, గీ-ఈ-ఈ మని అరుస్తున్న పురుగుల శబ్దముతో నిశ్శబ్దముగాఉన్న సంధ్యాకాశము నిండిపోయింది.

నల్లని మేఘాలఛాయ పడుతుండుటవల్ల భయంకరాకారము ధరించిఉన్న పద్మానది ఆ సమీపాన్నే ప్రవహిస్తున్నది. ప్రక్కనుండుగట్లను, చేలను, కోసేస్తూ ప్రవాహము ఇళ్లవద్దరికి వచ్చేస్తూ ఉన్నది. ప్రవాహానికి ప్రక్కను, అక్కడక్కడ మామిడిచెట్లూ, పనసచెట్లూ ఉన్నవి. అన్ని ఆశలుం వదులుకొని ఆఖరుప్రయత్నముచేదామని భూమిని గట్టిగా పట్టుకొని ఉన్న చేతులవేళ్లలాగు ఆ చెట్లవేళ్లు, మన్నంతా కరిగిపోవడంచే, బయటికి కనబడుతున్నవి.

ఆనాడు దుఃఖీరాము చిధాములు జమీందారుగారి కచేరిఇంటిపనికై వెళ్లారు. పంట అవతలిబడ్డానటుండే వరి పండి ఉన్నది. వర్షానికి మళ్లీ మునిగిపోతవేమో అనేభయమువల్ల, నీరురాకముందే చేసుకోసుకొందామని ఆవక్కను, మళ్లీగల బీదసాదలు కొందరుమాత్రము, వాళ్ల వాళ్ల చేలు కోసుకోడానికి బయలుదేరారు. జమీందారుగారి నౌకర్లు వచ్చి ఈ ఇద్దరన్నదమ్ములనూ వారి కచేరిఇంటి మరామత్తుకని జబర్దస్తీ చేసి తీసుకొనివెళ్లారు. కచేరిఇల్లు అక్కడక్కడ కారుతున్నదట; అది సరిచేసి, అది అయినతరువాత, వరండాలమీదికి జల్లురాకుండా అడ్డుకట్టవలసి ఉండెను. రోజంతా చేస్తేనేగాని ఈపనులన్నీ పూర్తికాలేదు—మధ్యాహ్నమైనా వాళ్లను ఇంటికి వదలలేదట; అక్కడే కొంచెము ఫలహారము పెట్టి పని పూర్తిచేయించి మరీ వదిలారు. మధ్యమధ్య వర్షములో

తపిస్తూకూడా పని చేయవలసివచ్చింది. సరియైన కూలి అయినా దొరకలేదు—కూలికి పదిరెట్లు తిట్లుమాత్రం దొరికినవి.

సాయంకాలమైనతరువాత బురదలోనుంచి, నీళ్లలోనుంచి, నడచుకొని ఇద్దరన్నదమ్ములూ ఇంటికి వచ్చేసరికి చిన్నతోటికోడలు, చందర, పైటచెంగుపరుచుకొని నేలనుపడుకొని ఉన్నది. ఆ వర్షపుదినములాగునే ఆమె, మధ్యాహ్నమంతా, అశ్రువర్షము కురిపించి కురిపించి సాయంకాల మవుతూ ఉన్నసగా వర్షమాపి, ఎటువంటిచలనమూ లేకుండా కూర్చున్నది. పెద్దతోటికోడలు, రాధ, పెద్దముఖముచేసికొని అతిగంభీరముగా అరుగుమీద కూర్చొని ఉన్నది—పెద్దామె కొడుకు, రెండేళ్లవాడు, ఇంతసేపూ ఏడ్చిఏడ్చి, వీళ్లు ఇంటికివచ్చేవేళకు ఒంటిమీద బట్టఅయినా లేకుండా అరుగుమీద ఒకమూలను పడుకొని నిద్రపోతున్నాడు.

మిక్కిలి ఆకలిగాఉండి దుఃఖరామ్ ఒక్కనిమిషమైనా ఊగలేక వెళ్లము కంటపడగానే అన్నము పెట్టమని అడిగాడు.

తుపాకిమందుపీపామీద అగ్గినిప్పుపడ్డది—పెద్దతోటికోడలు రాక్షసిగొంతుకతో కేకలువేసుకొంటూ అతి తీవ్రముగా జవాబుచెప్పింది—"పెట్టడానికి ఎక్కడఉన్నది అన్నము? వెళ్లేటప్పుడు బియ్యంతెచ్చి వెళ్లావా? లేక నన్ను ఎక్కడికైనా వెళ్లి, సంపాదించుకొని రమ్మన్నావా?"

రోజంతా శ్రమపడడమూ, తిట్లుతినడమూ అయినాకను రాత్రి ఇంటికివచ్చాడు, దుఖిరామ్—తిండిలేదు, ఆనందములేదు. చీకటి ఇంట్లో ప్రవేశించేసరికి ఉసుబాసలముతప్ప మరేమీలేదు, దానిపైని పెళ్లాం ఆడిన కోపముమాటలు—గుండెలలో ముఖ్యముగా ఆఖరున అన్న చెప్పిన మాటలు—దుఖిరామ్ మరి సహించి ఊరుకోలేకపోయినాడు.

కోపముతో తిరగబడుతున్న పెద్దపులిలాగు, వెనుకకు తిరిగి, "ఏమంటున్నావు!" అంటూ, ముందూవెనుకా ఆలోచించకుండా చేతులోనున్న కొడవలితో భార్యనెత్తిమీద ఒక్క పెట్టు పెట్టాడు. రాధ అక్కడపడుకొనియున్న చిన్నతోటి కోడలి ఒడిలో కూలిపడ్డది—ఆ పడిపోవడమే పడిపోవడము, మరి లేవలేదు. చిందబట్ట రక్తముతో నిండిపోయింది—"ఏమ యింది ఏమయింది," అని ఆమె కేకలువేసింది. ఛిరామ్ పరి గెత్తుకొనివచ్చి ఆమె నోరు మూసేశాడు. దుఖిరామ్ కొడవలి అక్కడ పారేసి చేతిమీద తలమోపుకొని మతిపోయిన వాడిలాగు కూర్చుండబడిపోయినాడు. పిల్లవాడికి తెలివి వచ్చింది, భయపడుతూ బిగ్గరగా ఏడవడం ఆరంభించాడు.

బయట అతినిశ్శబ్దముగా ఉన్నది. గొల్లపిల్లవాళ్లు ఆవులను ఇళ్లకు తోలుకొని వస్తున్నారు. కోతలకు వెళ్లిన వాళ్లు అయిదారుగురేసిచొప్పున బల్లకట్టుమీద ఏరు దాటి, రోజంతా కష్టపడినందుకు బహుమానముగా దొరికిన ధాన్యము

మూటలుకట్టి, తలలమీదపెట్టుకొని వచ్చి, అప్పుడే ఇళ్లు చేరుకొన్నారు.

చక్రవర్తిబాబుగారి పినతండ్రి రామ్‌లోచన్, పోస్టాఫీసులో ఉత్తరము వేసి వచ్చి, అరుగుమీద కూర్చొని హాయిగా గుడుగుడు పీలుస్తున్నాడు. దుఖిరామ్ చక్రవర్తిబాబుల రయితు, వీడు చాలా సిస్తుబాకీ ఉన్నాడు. అందులో కొంత భాగము ఇవ్వాళ చెల్లిస్తానని ఇంతకుముందు చెప్పిఉన్నాడు. గుడుగుడు పీలుస్తున్న రామ్‌లోచన్‌కు హఠాత్తుగా ఆమాట జ్ఞాపకమువచ్చి మీద కండువావేసుకొని గొడుగు పట్టుకొని బయలుదేరాడు.

రామలోచణ్ దుఖిగారిఇంటికి వచ్చి లోపల ప్రవేశించాడు. అంతా నిశ్శబ్దముగా ఉన్నది, చిట్టచీకటి, ఇంట్లో దీపమైనా లేదు, రామలోచణ్‌కు భయమువేసినట్టయింది. అరుగుమీద ఎవరోకూర్చున్నట్టుగా, ఆ చీకట్లో, అంధకారవిగ్రహాలు మూడు నాలుగు అతనికి కనబడ్డవి; అరుగుమీద నొకమూల నుండి వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లుగా అస్ఫుటమైనశబ్దము వస్తున్నది. పిల్లవాడు, 'అమ్మా అమ్మా', అని ఏడవవలెనని ఎంతప్రయత్నము చేస్తున్నాడో ఛిదామ్ వాడినోరు అంతగట్టిగా నొక్కిపట్టుకొంటున్నాడు.

రామలోచన్‌కు కొంచెము భయమువేసి, "దుఃఖీ, ఉన్నావురా?" అని అడిగాడు.

ఇంతసేపూ రాతివిగ్రహములాగు, ఎటువంటి చల నమూ, లేకుండా కూర్చున్న దుఃఖి, తన నెవరో పేరుపెట్టి పిలవ గానే, అమాయకుడైన పిల్లవాడిలాగు, వెక్కి వెక్కి ఏడవడము మొదలుపెట్టాడు.

ఛిదామ్ తొందరతొందరగా అరుగుమీదనుంచి దిగి చక్రవర్తిదగ్గరికి వచ్చాడు. "తోటికోడళ్లిద్దరూ దెబ్బలాడుకుంటున్నట్టున్నారు—ఈవాళ రోజంతా కేకలు వినబడుతూనే ఉన్నవి," అని చక్రవర్తి అన్నాడు.

ఏమిచేయడమో ఛిదామ్‌కు ఇప్పటివరకు ఏమీ తోచ లేదు. అసంభవమైన ఊహలు అనేకం అతని తలలోకి వచ్చినవి. కొంచెము రాత్రి కానిచ్చి శవాన్ని ఎక్కడికో తీసుకొనిపోయి పారేదామని ఆఖరుకు నిశ్చయించాడు. ఇంతలో చక్రవర్తి అక్కడికి వచ్చిపడతాడని అత డూహించ నైనా ఊహించలేదు. ఏమి జబాబియ్యవలెనో తోచక, చటాలున, "ఔను ఈవాళ ఘోరముగా పోట్లాడుకున్నారు," అని అన్నాడు.

చక్రవర్తి అరుగువైపు వెళ్లబోతూ, "దానికని ఏడవడ మెందుకురా దుఃఖీ?" అని అన్నాడు.

ఇక తప్పించుకొనే మార్గములేదని తెలుసుకొని, "దెబ్బ లాడి దెబ్బలాడి చిన్నతోటికోడలు పెద్దదాని నెత్తిమీద కొడవలితో ఒక్కపెట్టుపెట్టింది," అని ఛిదామ్ అన్నాడు.

ఎదుటనుండే ఆపదతప్ప వేరే ఆపద ఏదైనా ఉండవచ్చు నని ఎవనికైనా సులభముగా తట్టదు. ఈభయంకరమైన సత్యము నోటినుంచి ఎట్లా తప్పించుకోగలను అని ఛిదామ్‌కు ఆక్షణానికి అనిపించింది. మిథ్య, సత్యానికంటె భయంకర మైనది, కావచ్చునని వాడికి తోచలేదు. రామలోచనచక్ర వర్తిగారి ప్రశ్నవినగానే వాడి తలలోకి ఒక జబాబు తక్షణమే వచ్చింది, దానిని తక్షణమే చెప్పేశాడు.

"ఏమిటేమిటి! పోనీ, చచ్చిపోలేదు కదా!" అని రామ లోచన్ అన్నాడు.

"చచ్చిపోయింది బాబూ," అని అంటూ ఛిదామ్, చక్రవర్తికాళ్లు పట్టుకొన్నాడు.

చక్రవర్తికి తప్పించుకొనే దారికానరాక, "రామ, రామ, సంధ్యవేళను ఎటువంటిచిక్కులో పడ్డాను!" అని తనలో తా ననుకొన్నాడు. కోర్టులో సాక్ష్యమిస్తూఇస్తూ ప్రాణాలు వదులు కోవలసి వస్తుందని అతనికి భయంవేసింది. ఛిదామ్, చక్రవర్తి కాళ్లుపట్టుకొని వదలకుండా, "నాపెళ్లాన్ని రక్షించేఉపాయము చెప్పండి బాబు," అని ప్రార్థించాడు.

దావాలు తగాదాలవిషయాలలో సలహా ఇయ్యడానికి తగినవాడు, ఆచక్రవర్తికి మించినవాడు, ఆ ఊళ్లో లేడు. అతడు కొంచెమునే పాలోచించి దుఃఖికి సలహాఇచ్చాడు—"చూడు, దుఃఖీ—నువ్వు తక్షణమే పోలీసుస్టేషనుకు వెళ్లి, 'మాఅన్నయ్య

ఇంటికిరాగానే అన్నముపెట్టమని వదిన నడిగాడు, వంటలేదని తెలియగానే పెళ్లమునెత్తిమీద కొడవలితో ఒక్కపెట్టు పెట్టాడు,' అని చెప్పు. ఆలాగున చెప్పావంటే నీపెళ్లము ప్రాణానికేమీ హానిరాదు, నే నెరుగుదును," అని అత డన్నాడు.'

ఛిదామ్ గొంతుక ఎండిపోయింది; లేచి వాడు, "పెళ్లము పోతే పెళ్లము వస్తుందిగాని అన్నను ఉరితీస్తే అన్న మరి దొర కడు బాబూ," అని అన్నాడు. కాని భార్యమీద దోషా రోపణము చేస్తున్నప్పుడు ఇది అంతా ఆలోచించి ఆలాగున చెప్పలేదు. చటాలున ఎవో అనేశాడు చేసినపనిని సమాధాన పరచవలెనని ఇప్పుడు ప్రయత్నిస్తున్నాడు.

ఛిదామ్అన్నదానిలో కొంత సబబున్నదని చక్రవర్తికి కూడా తోచి, అతడు, "అట్లాగునైతే జరిగినది జరిగినట్లుగా చెప్పేయి, ఎవరికీ అపాయము రాకుండాచేయడము సాధ్యము కాని పని," అని అన్నాడు.

ఈలాగు అని రామలోచన్ అక్కడ నుంచి వెళ్లిపోయి నాడు. కాపువాళ్లఇంటిలో ఇద్దరు తోటికోడల్లకూ ఘోర ముగా పోట్లాట జరిగిందని, చందరకు కోపమువచ్చి పెద్ద తోటికోడలి నెత్తిమీద కొడవలితో ఒక్కపెట్టుపెట్టిందని, ఇంతలో ఊరంతా అల్లుకుపోయింది.

గట్టు తెగిపోగానే నీరు హోరుమని శబ్దముచేసు

కొంటూ తోసుకొనివచ్చేస్తుంది. అలాగునే పోలీసువాళ్లు ఊళ్లోకివచ్చిపడ్డారు. ఇదిచూచి అపరాధముచేసినవాడికీ నిరపరాధులకూ—అందరికీ అమితభయము కలిగిపోయింది.

౨

ఏదారిని అడుగుపెట్టానో ఆదారి మరి వదలకూడదని ఛిదామ్ నిశ్చయించుకొన్నాడు. ఛిదామ్ తన నోటితో తానే రామలోచన్‌తో ఏదో చెప్పేశాడు—ఆమాట ఊరంతా అల్లుకొని పోయింది. ఇప్పుడు అదికాదని ఇంకొకటి చెప్పబోతే, ఒకటి కొకటౌతుందేమో అని ఛిదాముకు భయము కలిగింది. తాను మొదట అన్నమాట అబద్ధమనకుండా, దానితోపాటు మరినాలుగు కథలు కల్పించి భార్యను ఎట్లా గైనా రక్షించడముతప్ప తా నిప్పుడు చేయగలది మరేమీ లేదని ఛిదామ్‌కు తోచింది.

ఛిదామ్ చందరను అపరాధము నేనే చేశానని ఒప్పు కొమ్మని బ్రతిమాలాడు. నెత్తిమీద పిడుగుపడ్డదా అనిపించింది చందరకు. "నేను చక్రవర్తిబాబుతో అలాగు చెప్పానని నీవేమీ భయపడవద్దు, నిన్నెట్లైనా మేము కాపాడుతాము," అని ఛిదామ్ భార్యకు ధైర్యము చెప్పాడు—ధైర్యము చెప్పాడుగాని, చెప్పబోతున్నప్పుడు వాడిగొంతుక ఆర్చుకొనిపోయింది, ముఖాన రక్తములేదు.

చందరవయస్సు పదిహేడు పద్ధెనిమిదికి హెచ్చు

ఉండదు. చక్కని తీర్చినముఖము, గుండ్రముగా ఉంటుంది. ఆమె ఆక్తే పొడవైనదికాదు, గట్టిశరీర మామెది, ఆరోగ్యమైనది. ఆమె నడుస్తున్నప్పుడుగాని ఏపనిఅయినా చేస్తున్నప్పుడుగాని ఒకవిధమైన స్వేచ్ఛా, మాధుర్యము ఉండేవి—లోపునగాని పైనగాని ఎటువంటిఇబ్బందీ ఆమెకులేదని చూచేవారికి తోచేది. క్రొత్తగా తయారుచేసిన నావవంటిది ఆమె—నావ చిన్నది కాని, గట్టిది, ఏమూలా ఒక్కపగులైనా లేనిది, నీటిలో మహాసులభముగా నడవగలది. ఆమెకు నడదాలేనివిషయము ఈలోకములో లేదు, ప్రతిసంగతీ తెలుసుకోవాలని కుతూహలముగా ఉండేది. ఆ చుట్టు ప్రక్కలఇళ్లకువెళ్లి కబుర్లుచెప్పుకొని వస్తూఉంటడము ఆమెకు మహాఇష్టము. చంకను కుండపెట్టుకొని రేవుకు వెళ్లుతున్నప్పుడు, రేవునుండి వస్తున్నప్పుడు, రెండువేళ్లతో ముసుగును కొంచెము ఎత్తి, చంచలమైన నల్లనికళ్లతో చూడదగిన దృశ్యాలలో ఒకటైనా విడువకుండా చూస్తూఉండేది.

పెద్దకోడలికీ ఈమెకూ అన్నివిషయాలలో అన్యోన్య విరుద్ధము. పెద్దకోడలు అతి ఆజాగ్రత్తమనిషి, ఏపనిలోనైనా ముందుది వెనుకా, వెనుకది ముందూ చేసేరకము, దేనిలోనూ దూరితెన్నూ ఉండేది కాదు. ఏ పనీ సరిగా చేయలేకపోయేది. ఇంట్లో పని అంతగా ఉండేది కాదు, కాని ఆమెకు ఒక్క నిమిషమైనా తీరేదికాదు. చిన్నతోటికోడలు ఆమె నెప్పుడూ

విస్తారము ఏమీ అనేదికాదు; ఆమె మృదువైనమాటలతో వాడైనపోట్లు రెండు పొడిచేసరికి పెద్దామె, నువ్వీలాగు నువ్వాలాగు అని పెద్దకేకలతో ఇల్లెగరగొడుతూ పేటకుపేటా అల్లకల్లోలముచేసేసేది.

ఈ దంపతిద్వయములో భార్యలకు భర్తలకు మహావిచిత్రమైనపోలికఉండేది. చప్పిముక్కుగల దుఃఖిరామ్ చాలా భారీమనిషి. అతనికళ్లకు కనబడుతూఉండే దృశ్యాలు అనేకము, కాని చూస్తూఉండేవాటి అర్థమేదీ అతనికి బోధపడుతూండేటట్టు లేదు, బోధపడనిదానినిగురించి ప్రశ్నించడమైనా చేతఅయ్యేదికాదు. దుఃఖి చూడడానికి భయంకరముగా ఉండేవాడు, మహాబలశాలి, కాని అంత చేతకానివాడు మరి ఒకడు ప్రపంచములో ఉండడు.

శిల్పి ఎవడో జిగజిగ మెరుస్తూండే నల్లనిరాయిని అతిజాగ్రత్తగా చెక్కి తయారుచేసిన విగ్రహములాగున కనబడేవాడు ఛిదామ్. ఆ దేహములో ఎక్కడా ఎటువంటి లోపమూ లేదు. ఏమూలనూ అనవసరమనదగినది ఏవంత భాగమయినా కనబడేదికాదు. దార్ఢ్యము, నిపుణత—వీటివలన సంపూర్ణతపొందిన శరీర మతనిది. ఎత్తుగా ఉండే ఏటిబడ్డుమీదనుంచి నీటిలోనికి దుమికేవాడు, వెదురుపొదలోదూరి మీదికెక్కి కంపకొట్టి తీసుకొనివచ్చేవాడు, కర్రతో తోసి దూలలను దొర్లించుకొని పోయేవాడు—ఏపనిచేసినా చూచే

వాళ్లకు మహాఇంపుగా కనబడేది—అతిసుళువుగాను, చక్క-
గాను చేసేవాడు. అతనిజుట్టు నల్లగాను, పొడవుగాను ఉండేది. దానికి చమురురాసి జాగ్రత్తగా దువ్వి వీపుమీద వేలవేసుకొని ముస్తాబయి బయలుదేరేవాడు.

పరస్త్రీలసౌందర్యము భిడామీకంట పడేదికాదని గాని, వారికంటికి ఇంపుగా కనబడవలెననే ఇచ్ఛ భిడామీకు లేదని గాని చెప్పడము కష్టము. ఐనప్పటికీ యౌవనములో ఉండే తన భార్యయెడల భిడామీకు కావలసినంత అనురాగముండేది—సందేహములేదు. ప్రేమించడములో నైతేనేమి, పోట్లాటలో నైతేనేమి, ఇద్దరికిద్దరూ సమానులే, ఎవరూ వెనకబడేవారు కాదు. ఇద్దరినీ కలిపిఉంచేబంధము గట్టిగా ఉండడానికి మరి ఒక కారణము ఉండేది. చందర చంచలస్వభావముగల మాయలాడి. దానిని ఆట్టే నమ్మకూడదు అని భిడామీ అనుకొనేవాడు; మగడిదృష్టి సదా ఇటూఅటూ పోతూఉంటుంది, అతనిని గట్టిగా కట్టి ఉంచకపోయినయెడల ఏనాడో చేతిలోనుంచి జారిపోతాడని చందర భయపడుతూ ఉండేది.

కథాప్రారంభములో వర్ణించిన ఘటనకుపూర్వము కొద్ది రోజులనుంచీ భార్యాభర్తలకు కలహము జరుగుతున్నది. పని మిషపైని భర్త ఏదో దూరగ్రామాలకు తరుచుగా వెళ్లడమూ, వెళ్లి రెండుమూడు రోజులుండి వస్తూఉండడమూ, తిరిగివచ్చి నప్పుడు ఇంటికి డబ్బేమీ తీసుకొని రాకపోవడమూ, భార్య కని-

పెట్టింది. ధోరణి బాగులేదని పోల్చుకొని, తానుకూడా ఏదో చేయవలెనని భార్య నిశ్చయించుకొన్నది. వేళాపాళా లేకుండా ఏటికి వెళ్లుతూఉండడము మొదలుపెట్టింది. రేవునుంచి ఇంటికి వచ్చి కాశీమజుమ్‌దారుగారి రెండో అబ్బాయినిగురించి కబుర్లు చెపుతూ అతనిని సవిస్తరముగా వర్ణిస్తూ ఉండేది.

ఛిదామ్ మనస్సునఉండే ఆనందము మంట కలిసిపోయింది—రాత్రిగాని పగలుగాని అతనికి దుఃఖముతప్ప వేరేమీ లేదు; మనస్సును ఒకక్షణముపాటైనా ఏపనిలోనూ నిలిపిఉంచలేకపోయేవాడు. ఇట్లా ఉంటూఉండగా ఒకనాడింటికి వచ్చి వదినగారిని ఏదో అన్నాడు. అనేసరికి ఆమె చేతులు ఎగరవేసుకొంటూ వచ్చి, చనిపోయిన మామగారితో ఫిర్యాదు చేస్తూ ఉన్నట్టుగా పెద్దకేకలతో, "తుపానుతో సమానముగా ఉన్నది నీ చిన్నకోడలివ్యవహారము, దానిని కట్టిఉంచడము నా వంటిదానికి ఎక్కడ సాధ్యమౌతుంది బాబూ—ఏనాడో మన కొంప ముంచక మానదు!" అని ప్రారంభించింది.

చందర ప్రక్కగదిలోనుంచి వచ్చి, "ఏమి అక్కయ్యా, నీకెందుకేఅంతభయము ?" అని నెమ్మదిగా అడిగింది—అటుపైని ఆనాడు ఇద్దరుతోటికోడళ్లకు ఘోరమైన దెబ్బలాట జరిగింది.

ఛిదామ్ కళ్లెర్రచేసి, "ఇకనెన్నడైనా ఒక్కర్తెవే రేవుకు నీళ్లకోసము వెళ్లావని తెలిస్తే ఎముకలు విరిచేస్తాను, చూస్తూ ఉండు," అని అన్నాడు.

"విరిచేస్తే బ్రతుకుతాను," అని జబాబుచెపుతూ చందర బయటికి బయలుదేరబోయింది.

ఛిదామ్ ఆమెవైపు ఒక్కగంతువేసి, ఆమెను జుట్టుపట్టి లాగుకొనివచ్చి, గదిలోపెట్టి గొళ్లెముపేశాను.

ఛిదామ్ సాయంకాలము పనినుంచి ఇంటికి వచ్చి చూచేసరికి గది తలుపు తీసిఉన్నది, గదిలో ఎవ్వరూ లేరు. పక్క మూడుగ్రామాలూ దాటి వెళ్లి, చందర, మేనమామగారి ఇంట్లోకూర్చున్నది.

ఛిదామ్ అక్కడికివెళ్లి ఎంతో కష్టముపైనగాని ఆమెను ప్రసన్నురాలనుచేసి ఆమె తిరిగి ఇంటికివచ్చేటట్లు చేయలేకపోయినాడు. ఈ మారు వీగిపోయినానని ఛిదామ ఒప్పుకోవలసివచ్చింది. పాదరసాన్ని పిడికిలిలో పట్టిఉంచడము ఎంత సులభమో, ఈ ఆడదాన్ని కట్టిపెట్టి ఉంచడముకూడా అంత సులభమే అని ఛిదాముకు బోధపడ్డది.

ఛిదామ్ అప్పటినుండి బలము ప్రయోగించడము మానివేశాడు, కాని అతనిమనస్సుకు ఎటువంటిశాంతి లేదు. సదా సందేహముతోనిండిఉండే అతనిప్రేమ భయంకరమైన వేదనవలె అతనిమనస్సును రాత్రింబగళ్లు బాధిస్తూ ఉండేది. ఆమె చస్తేనే గాని నామనస్సుకు శాంతి కలుగదనికూడా అప్పుడప్పుడు ఛిదామ్ అనుకొనేవాడు. మనుష్యులకు మనుష్యులయెడలగల ఈర్ష్య యమునియెడలనైనా ఉండదుకదా!

ఛిదామ్ మనస్సు ఈ అవస్థలో ఉంటూఉండగా కథా ప్రారంభంలో వివరించిన ఆపద ఇంట్లో సంభవించింది. చందరను తానే ఖూనీచేశానని ఒప్పుకోమని భర్త అడగగానే, ఆమె నిశ్చేష్టురాలై నిలుచొని చూస్తూఉన్నది, ఆమె నల్లనికళ్లు రెండూ అగ్నిజ్వాలలయి భర్తను దగ్ధముచేయడ మారంభించినవి. తన దేహమును తన మనస్సును అత్యల్పమైన వస్తువులుగా చేసికొని రాక్షసిఅయిన తన భర్తచేతులలోనుంచి తప్పించుకొని పారిపోవలెనని చందరకు కోరికపుట్టింది. భర్త యెడల ఆమెకు పరమఅసహ్యము కలిగింది.

భయపడవద్దని భార్యకు ఛిదామ్ ధైర్యముచెప్పాడు, పోలీసువాళ్లదగ్గర ఏమిచెప్పవలెనో, మాజిస్ట్రేటువా రడిగితే ఏమిచెప్పవలెనో, భార్యకు బోధపరుస్తూ అనేకమార్లు చెప్పాడు. ఛిదామ్ ఘంటలకొలది చెప్పాడుగాని చందర చెవిని ఒక్క మాటఅయినా పడలేదు—ఆమె ఒక కర్రబొమ్మలాగు కూర్చొని ఉండెను.

ప్రతివిషయములోనూ దుఃఖి ఛిదామ్‌మీద భారమంతా వేసి కూర్చుండేవాడు. ఛిదామ్ తన భార్యమీద అపరాధము మోపమని అన్నతో చెప్పగానే, మరదలిపని ఏమిఅవుతుందని అన్న అడిగాడు. ఆమెకు హానిలేకుండాచూచే పూచీ నాది అని ఛిదామ్ అన్నాడు, విని బలిష్ఠుడైన దుఃఖిరామ్ నిశ్చింతగా కూర్చున్నాడు.

3

పెద్దతోటకోడలు కత్తిపీటచేతపుచ్చుకొని నిన్ను కొట్టబోతూఉండెననిన్నీ, నీవు నీచేతులోనున్న కొడవలితో ఆపబోతూఉంటే ఏలాగో ఆమెకు దెబ్బతగిలి ఆప్రమాదము జరిగిందనిన్నీ, చెప్పమని ఛిదామ్ భార్యను బోధపరిచాడు. ఇదంతా రామలోచనుని పన్నాగము. దానికి తగిన రుజువుసాక్ష్యము గురించీ, ఆ కథకు కావలసిన వన్నెలు చిన్నెలనుగురించీ, అతడే సవిస్తరముగా ఛిదామ్‌కు బోధపరిచాడు.

పోలీసువాళ్లు ఇక్కడ్కెర్రీకి వచ్చారు. పెద్దతోటకోడలిని చంపినది చందరే అన్న నమ్మకము గ్రామస్థులందరిమనస్సులలో బాగా నాటిపోయిఉన్నది. ఎవరు సాక్ష్యమిచ్చినా దానికి అనుగుణ్యముగానే చెప్పుతూవచ్చారు. పోలీసువాళ్లు చందరను అడిగేసరికి, "ఆహా ఖూనీచేసినది నేనే," అని అన్నది.

"ఎందుకు చేశావు ఖూనీ ?"

"ఆమెను నేను నా కళ్లతో చూడలేను."

"నువ్వూ నువ్వూ ఏమైనా మాటలనుకొన్నారా ?"

"ఏమీ లేదు."

"ముందుగా ఆమె నిన్ను కొట్టవచ్చిందా ?"

"కొట్టరాలేదు."

"ఏమైనా దౌర్జన్యము కనపరిచిందా ?"

"ఏమీ లేదు."

ఇటువంటి జబాబులు విని ఆశ్చర్యపడనివా డొక్కడు లేడు. ఛిదామ్ మనస్సున భయముపుట్టి, ఎవరూ అడగనిదే తనంతటతానే ఇట్లాగు చెప్పడము ప్రారంభించాడు—"ఆమె నిజము చెప్పడము లేదు—పెద్దతోటికోడలు మొదట—"

ఇన్స్పెక్టర్ ఒక్క కేసుపై గసిరి వాడినోరు మూసి చందరను అనేకరకాలుగా ప్రశ్నించి చూచాడు. ఎన్నిమారులు ప్రశ్నించినా ఒక్కటే జబాబు వచ్చింది చందరనోటినుంచి. తోటికోడలు తనను కొట్టవచ్చిందనిగాని తిట్టిందనిగాని ఒప్పుకోలేదు.

పట్టినపట్టు వదలకుండా అంతమూర్ఖముగా ఉండే ఆడది మరిఒకతె ఉండదేమో ప్రపంచములో, ప్రాణముపోయినా ఉరికొయ్యలునవదలనని దీక్షపట్టినట్లున్నది. అటువంటిఆమెను పట్టి ఉంచడము ఎవరితరము? ఇంత అహంభావముగల ఆడది ఎక్కడా ఉండదు. 'నేనూ నా నవయౌవనమూ నిన్ను విడిచిపెట్టేసి ఉరికొయ్యలను వరిస్తాము—ఈ ప్రపంచములో నా కడపటి ముడి ఉరికొయ్యలతోనే,' అని చందర తనలో తాను భర్తతో అన్నది.

సరదాగా కబుర్లుచెప్పుకొంటూఉండే చందర అతి అమాయకురాలు. ఆమె నేను ఖైదీఅయి తాను రోజూ నడుస్తూ ఉన్న రోడ్లవెంట, రథముప్రక్కనుండి, బజారులోనుంచి, స్కూలు పోస్టాఫీసుచారిని, మంచినీళ్ల రేవుప్రక్కనుండి, జమీ

పాయగారిఇంటి ఎదుటనుంచి, తనన్నే పిలుస్తూ తనతో పిలిచాళ్లు—అంతా ఆమె ఖూనిచేసిందని అనుకొంటూఉండగా, ఇల్లు వాకిలి, స్వగ్రామము, వదలి వెళ్లిపోయింది. పిల్లకాయలగుంపు ఆమె వెనుకపడ్డది. ఆమె నెరిగినస్త్రీలు ముసుగెత్తుకొని కొందరు, తలుపు సందులలోనుంచి కొందరు, చెట్ల వెనుకనుంచి కొందరు, చూస్తూ నిలుచున్నారు. పోలీసువాళ్లామెను తీసుకొనివెళ్తూఉంటే అసహ్యమువల్లా, సిగ్గువల్లా, భయమువల్లా ఆ స్త్రీలలో అనేక మందికి ఒంట్లో గగుర్పాటుపుట్టింది.

చందర కలక్టరుగారి ఎదుటకూడా ఖూనీ తానేచేసేశా నని అన్నది. పెద్దతోటికోడలి దేమీ అపరాధమున్నట్టు ఆమె చెప్పలేదు. కాని విచారణనాడు ఛిదామ్ బోనెక్కి, చేతులు జోడించి నాభార్య దేమీ తప్పు లేదని చెపుతూ, వెక్కివెక్కి ఏడవడము మొదలుపెట్టాడు. కలక్టరు వాడిని కసిరి, వాడిఏడుపు ఆపి, ప్రశ్నలువేయగా ఛిదామ్ జరిగినది జరిగినట్టుగా అంతా చెప్పాడు.

కాని కలక్టరు వాడిమాట నమ్మలేదు. నమ్మకపోవ డానికి ముఖ్యకారణము రామలోచన్‌చక్రవర్తి ఇచ్చిన సాక్ష్యము—రామలోచన్ పెద్దమనిషి. ఖూనిజరిగిన కొద్ది నిమిషాలలోనే అది జరిగినస్థలానికి అతడు వెళ్లడము తటస్థించిందట. ఛిదామ్ జరిగినదంతా అతనితో చెప్పి, నాభార్య నేలాగైనా కాపాడేమార్గము చూపించండిబాబూ అంటూ

అతని కాళ్లమీదపడ్డాడట. రామలోచన్ వానికేమీ సలహా ఇయ్యలేదట, ఛిదామ్ అప్పుడు, "మా అన్న ఇంటికివచ్చి భార్యను అన్నముపెట్టమని అడగగా ఆమె పెట్టకపోవడము వల్ల, అతనికి కోపమువచ్చి ఆమెమీద ఒక్కపెట్టు పెట్టాడు అని నేను చెప్పి, నా భార్యను కాపాడకూడదా," అని అడిగాడట. రామలోచనకు కోపమువచ్చి, "పగుల్బాజీ, జాగ్రత్త! కోర్టులో ఒక్క అబద్ధముమాటఅయినా రానిచ్చావంటే మహాపాతకము సుమా!" అని అన్నాడట—ఇదంతా రామలోచన్ చక్రవర్తి గారిచ్చిన సాక్ష్యము.

రామలోచన్ చందర ప్రాణము ఎట్లాగైనా కాపాడవలెనని అనుకొని, కథ ఒకటి అల్లిఉంచాడు, కాని చందరే అట్లాగా తిరిగింపని కనిపెట్టగానే, ఆమెను రక్షించవలెనని ప్రయత్నించడము వృథా అనిన్నీ, చివరకు అబద్ధము సాక్ష్యమిచ్చినందుకు తానే చిక్కులో పడవలసివస్తుందనిన్నీ పోల్చుకొని నిజమే చెప్పనిశ్చయించాడు. చివరకు నిజముతో ఆగక మరినాలుగు కల్పించి చెపితేనేగాని వదిలాడుకాడు.

కలక్టరుగారు కేసు సెషన్సుకు పంపించారు.

ఈలోగా ప్రపంచము, నియమానుసారము, తనపని తాను చేసుకొంటూపోతున్నది. ప్రతిసంవత్సరమువలె శ్రావణ మాసములో వర్షధారలు ధాన్యపుచేలను నీటితో నింపుతున్నవి. ఎవరిసందడిలో వారు మునిగిఉండి మానవకోటి యథావిధిని కాలము గడుపుతున్నది.

ముద్దాయిని, సాక్షులను, తీసుకొనివచ్చి పోలీసువాళ్లు సెషన్స్ కోర్టులో హాజరయినారు. ఎడపటనుండే మనుష్యులు కోర్టు వరండాలమీద తమ తమ కేసులకై వచ్చిఉన్నవాళ్లు కూర్చొనిఉన్నారు. వంటఇంటివెనుకనుండే చిన్న మురికినీళ్ల చెరువు వంతులవిషయమై ఎవరెవరికో వ్యాజ్యము జరుగుతున్నది— ఆ సందర్భములో కలకత్తానుంచి ఒక పెద్దవకీలు వచ్చి ఉన్నాడు, వాది పక్షము సాక్షులు ముప్పై ఫర్లాంగులనుంచివచ్చి హాజరయి ఉన్నారు. తమకు రావలసినవి ఫీజులు గవ్వలతో సహా వస్తే నేగాని వదలమని సూక్ష్మాతిసూక్ష్మముగా ఆఫీసులోకూడా వాదనచేస్తూ ఉన్నారు అనేకమంది—తాము మనుష్యులు విచారపడుతూఉండే విషయముకంటె గొప్పవిషయము ప్రపంచములో ఉండదన్నట్టు వాళ్లనుకొంటూ ఉన్నారు. మిక్కిలి ఆసక్తితో తమతమ పనులను చేసుకొంటూ సంపాదిస్తూ ఉన్న ఆ మానవకోటిని చిథామ్ కిటికీలోనుంచి తదేకదృష్టితో చూస్తూఉన్నాడు—అంతా అతనికి స్వప్నములాగు ఉన్నది. కోర్టు ఆవరణలోఉన్న పెద్ద మర్రిచెట్టుమీదనుంచి కోకిల ఒకటి కూస్తున్నది—దానికి కోర్టులతోను, కేసులతోను, ఎటువంటి సంబంధము లేదు.

చందర, "చెప్పినమాటే ఎన్నిసార్లు చెప్పమన్నారు దొరగారూ?" అని జడ్జిదొరగారిని అడిగింది.

"నీవు చేశానని ఒప్పుకొంటూఉన్న అపరాధానికి ఏమి

శిక్ష విధిస్తారో నీ వెరుగుదువా?" అని చందరకు బాగా నచ్చేటట్టు జడ్జీ దొరగారు అడిగారు.

"నాకు తెలియదు," అని చందర అన్నది.

"ఉరిశిక్ష విధిస్తారు," అని జడ్జీ గారు అన్నారు.

"ఆ శిక్షే విధించు తండ్రీ, నీకాళ్లు పట్టుకొంటాను, మరి ఆలస్యముచేయకు బాబూ, నేను సహించలేకుండా ఉన్నాను," అని చందర వేడుకొన్నది.

ఛిదామ్‌ను కోర్టులోపలికి తీసుకొనివచ్చి ఎదుట నిల బెట్టారు. చందర ముఖమటువైపు తిప్పుకొన్నది. జడ్జీ గారు "సాక్షివైపు చూచి, నీ కత డేమౌతాడో చెప్పు," అని చంద రను అడిగారు. చందర రెండుచేతులతో ముఖము మూసుకొని "అతను నా భర్త," అన్నది.

"నీవంటే అతనికి ప్రేమలేదా?" అని జడ్జీ అడిగాడు.

"ఆహా అపరిమితమైన ప్రేమ!"

"నీ కతనియెడల అనురాగములేదా?"

"కావలసినంత ఉన్నది."

అప్పుడు జడ్జీగారు ఛిదామ్‌ను ప్రశ్నించగా—ఛిదామ్, "ఖూనీచేసినది నేను," అని అన్నాడు.

"ఎందుకు చేశావు?"

అన్నముపెట్టమని అడిగాను, వదిన అన్నము పెట్టింది

కాదు.” దుఃఖిరామ్ బోనెక్కగానే మూర్ఛపోయినాడు. తెలివిరాగానే జడ్జీగారు ప్రశ్నించగా, “చంపినది నేను మహా ప్రభూ,” అని అతడన్నాడు.

“ఎందుకు చంపావు?”

“అన్నము పెట్టమని అడిగాను, అన్నము పెట్టింది కాదు.”

జడ్జీగారు అనేకప్రశ్నలువేసి, ఇతరసాక్షులను చాలా మందిని విచారణచేసి, చివరకు నిజము స్పష్టముగా తెల్సుకొన్నారు. ఉరికొయ్యలనుంచి తప్పించి ఇంటఇల్లాలికి అవమానము లేకుండా చేదామని, అన్నదమ్ములిద్దరూ సూసీ కామే చేశామని చెబుతూఉన్నారు. కాని చందరమాత్రము మొట్ట మొదట పోలీసువాళ్లు ప్రశ్నించినప్పటినుంచి చివర సెషన్సు వరకు ఒక్కఅక్షరమైనా వ్యత్యాసము లేకుండా ఒకేమాట చెపుతూఉన్నది. దయాబుద్ధిగలవకీళ్లు ఇద్దరు తమంతట తామే వచ్చి ఆమెను ఎట్లాగైనా ప్రాణదండనమునుంచి తప్పించవలెనని చాలా ప్రయత్నముచేశారు. కాని చివరకు చందర వాళ్లకు పరాభవ పరిచింది.

గుండ్రనిబుగ్గలుగల, చక్కని, నల్ల, పెళ్లికూతురు ఒక ఆమె, తా నాడుకొంటూఉండే బొమ్మను అమ్మగారిఇంట వదిలి పెట్టి, అత్తవారిఇంటికి వచ్చిన శుభలగ్నానన్న ఈనాటివృత్తాంతము ఎవరు ఊహించగలిగిఉందురు? ఆ పిల్లతండ్రి, మాపిల్ల అదృష్ట

వంతురాలు అనుకొంటూ నిశ్చింతగా చనిపోయినాడు. జైలు సివిల్‌సర్జన్ అతిదయగలవాడు; ఉరితీయడానికి ముందు "నీకు ఎవరినైనా చూడవలెనని కోరిక ఉన్నదా?" అని చంపరను అడిగాడు.

"మా అమ్మ నొకమారు చూడవలెనని ఉన్నది," అని చంపర చెప్పింది.

"నీభర్త నిన్నొకమారు చూస్తానంటున్నాడు, తీసుకొని రమ్మంటావా?" అని డాక్టరడిగాడు.

"అంతకంటె చావు మేలు!" అన్నది చంపర.

# బిరుదు వెర్రి

అరుణలేఖతో నవేందుశేఖరుని వివాహమవుతున్నప్పుడు ఆ హోమధూమాలసందులలోనుంచి వివాహదేవత కొంచెము నవ్వాడు. ఆహా! భగవంతునికి అటుగా ఉన్న నవ్వు మనకు ఉల్లాసకరముగా ఉండకపోవచ్చును కదా!

నవేందుశేఖరుని తండ్రి, పూర్ణేందుశేఖర్, సర్కారు ఉద్యోగములో ఉండి, దొరలతో కలిసిమెలిసి తిరుగుతూ, ఆ సంఘములో పేరు సంపాదించాడు. ఇతడు కేవలము సలాముల సహాయముతోనే ఈ భవసముద్రము దాటి, అతిత్వరలో రాయ్ బహాదూర్ అను ఉచ్చ మరు కూలము చేసుకొన్నాడు. ఇంతకు అనేకరెట్లు దుర్గమమైన సన్మానపథానికి కావలసిన పాథేయము కూడా సంగ్రహించాడు. కుహేలికాచ్ఛన్నమైన గిరిశిఖరాన్ని చూస్తున్నట్టువలె, అనతిదూరములో ఉన్న 'రాజా' బిరుదు పైని అతడు తన స్థిరదృష్టిని నిలిపాడు. అట్లాంటి సమయంలో రాజానుగ్రహపాత్రుడైన ఈ వ్యక్తి, హఠాత్తుగా యాభైయైదో ఏట, సలాములు చేసిచేసి అలసిఉన్న, తన శిరస్సును శ్మశాన శయ్యపై విశ్రాంతి నిచ్చాడు.

శక్తికి రూపాంతరం ఉంది, స్థానాంతరం ఉంది. కాని శక్తికి నాశనం అంటూ లేదు—ఇది విజ్ఞానశాస్త్రం చెప్పుతూ

ఉన్నది. కనుక చంచలస్వభావముగల లక్ష్మీదేవియొక్క అచంచలానుచారికయైన 'సలాం-శక్తి,' పితృభుజాలనుండి పుత్రభుజాలమీదికి అవతరించింది. మన నవేందుని నవశిరస్సు, తరంగ తాడిత కూష్మాండంవలె, దొరల గడపల ఎదుట లేస్తూ దిగుతూ కనపడేది.

సంతానం కలగకుండానే భార్య చనిపోతే అతడు రెండో పెళ్లి చేసుకొన్నాడు—ఈ రెండో అత్తవారిచరిత్ర వేరేమాదిరి.

ఇంటి పెద్దకుమారుడు, ప్రమథనాథుడు. ఎరిగినవాళ్లలో ఇతనిని గౌరవించనివాళ్లు లేరు, ఇంటివాళ్ళల్లో ప్రేమించని వాళ్లు లేరు. అన్నివిషయాలలోకూడా ఇత డొక ఆదర్శ పురుషుడని ఇంటివాళ్లూ ఊళ్లోవాళ్లూ కూడా నమ్మేవాళ్లు.

ప్రమథనాథ్ బి. ఏ., పాసయినాడు, మంచి తెలివీ విచక్షణా కలవాడు; కాని గొప్పఉద్యోగం లేదు, మంచి జీతం లేదు; కలము ప్రయోగించే శక్తికూడా లేదు. ఇతనికి పెద్ద ఉద్యోగస్థుల సహాయబలము ఏమీ లేదు, దానికి కారణ మేమిటి అంటే ఇతను దొరలకు దూరముగా ఉండేవాడు,దొరలుకూడా ఇతనిని దగ్గిరికి రానిచ్చేవాళ్లు కారు. కనుక ఇతని పేరుప్రతిష్ఠలు బంధువులలోనూ, స్నేహితులలోనూ మాత్రమే—బయటి వాళ్లదృష్టిని ఆకర్షించే శక్తి ఇతనిలో లేదు.

ఈ ప్రమథనాథుడు మూడుసంవత్సరాలు విదేశయాత్ర

చేసి వచ్చాడు. అక్కడ వాళ్లు కనపరిచిన మర్యాదవల్ల, కృతజ్ఞతా పరవశుడై పోయి, తన దేశస్థులకు విదేశీయులు చేస్తు ఉన్న అవమానాన్ని పూర్తిగా మరిచి విదేశవేషభూషితుడై ఇంటికి తిరిగివచ్చాడు.

ఇదిచూసి అమ్మలకీ చెల్లెళ్లకీ మొదట్లో కొంచెము బాధకలిగింది, కాని రెండు రోజులు కాకుండానే, "అన్నయ్యకు కుదిరినట్లుగా దొరలదుస్తులు ఇంకెవ్వరికీ కుదరలేదు," అని అందరూ అనడం ప్రారంభించారు.

ఏవిధంగానైనా సరిచూసుకుంటే దొరలతో సమానస్థానాన్ని నిలుపుకోగలమో, అటువంటి అపూర్వమైన సాధనదీక్షను ఆచరణ ద్వారా తన దేశస్థులకు తెలియచేయవలెనని ప్రమథనాథుడు, విదేశంలో ఉంటూ ఉండగానే, నిశ్చయించుకొనివచ్చాడు. అణకువగా ఉంటేనేగాని దొరలస్నేహము పొందలేము అనడం మనయొక్క దైన్యం కనపరచుకోవడమూ, దొరలనన్యాయంగా అపరాధులను చేయడమూ, తప్ప వేరేమీ కాదు అని అతని మతం.

ఇంగ్లాండులోని పెద్దపెద్దవాళ్లదగ్గిరనుంచి సన్మానపత్రాలు సంపాదించి వాటిద్వారా మనదేశములో ఉండే దొరలసంఘాలలో కొంత గౌరవం సంపాదించాడు. రానురాను దొరల టీ - పార్టీలలోను, విందులలోను, ఆటలలోను, ఇతర వినోదాలలోను, ప్రమథనాథుడు భార్యాసమేతంగా పాల్గొనడం

సంభవమయింది. ఈ సౌభాగ్యమునమ్మత్తత వల్ల ప్రమథనాథుని శిరోపరిశాలలోను రక్తముకూడా ఉడుకుతుండేది.

ఆ సమయాన ఆ ప్రాంతాలలో వేసిన కొత్తరైలురోడ్డు ప్రారంభోత్సవం సందర్భములో, లెఫ్టినెంట్ గవర్నర్‌తో పాటు, రాజప్రసాదగర్వితులయినటువంటి దేశములోని ప్రముఖులనుకూడా నైకట్యం వెలసినవారు ఆహ్వానించారు. వీరందరూ కూడా గవర్నర్‌గారితో ఆ కొత్తరైలు రోడ్డుపైని మొదటి రోజున ప్రయాణంచేశారు—ఆ చేసినవారిలో మన ప్రమథ నాథు డొకడు.

బండి తిరిగుప్రయాణ చేస్తున్నది; అప్పుడు సార్జంట్—దొర ఒకడు మనదేశస్థులు పెద్దపెద్దవాళ్లందరూ కూర్చొనిఉన్న ఒక బండిదగ్గిరికి వచ్చి కూర్చున్నవాళ్లకు అవమానము కలిగేటట్టుగా, "ఈ బండిలోనుంచి మీరు దిగండి," అన్నాడు. దొరలదుస్తులు ధరించిఉన్న ప్రమథ నాథునుకూడా, మర్యాద కాపాడుకొందామని, దిగబోతుండ గా చూచి సార్జంట్‌దొరగారు, "మీరెందుకు దిగుతారు, మీరు కూర్చోండి," అన్నారు.

ఎవరికీ లేనిసన్మానము తనకు లభించినందుకు ప్రమథనాథుడు మొదట కొంచము పొంగిపోయినాడు. కాని బండి విడిచి పెట్టింది; దున్నిఉన్న పచ్చికలేని పొలాలపైని మ్లానసూర్యుని కిరణాలు పశ్చిమాకాశమునుంచి వచ్చిపడడంవల్ల పృథ్వి సిగ్గు

చేత ముఖమెర్ర చేసుకొన్నది అనిపిస్తున్నది; ప్రమథనాథుడు రైలుబండి కిటికీదగ్గిరకూర్చుండి రెప్పపాటులేక చూస్తున్నాడు. సిగ్గుచే తలవాల్చుకొన్న మాతృభూమి చెట్లమధ్యనుంచి కన బడుతున్నది. అప్పుడతడు తనకూ తనదేశానికీ కలిగిన అవ మానం బోధపరచుకొని అమితదుఃఖం పొందాడు. అతని రెండు నేత్రాలనుండి అగ్నిజ్వాలలవలె అశ్రుధారలు స్రవించాయి.

అప్పుడతనికి కథ ఒకటి జ్ఞప్తికి వచ్చింది: రాజవీధివెంబడి గాడిద ఒకటి దేవుని రథము లాగుకొని వెళ్లుతున్నది. రథము ఎదుట అందరూ సాష్టాంగనమస్కారాలు చేస్తున్నారు. అదిచూచి గాడిద అందరూ తననే నమస్కరిస్తున్నారనుకొన్నది.

కాని ఆ గార్దభానికీ ప్రమథనాథునికీ భేదము ఉన్నది. జరుగుతున్న సన్మానము తనను కాదని, తాను మోస్తున్న వస్తువుల కని ప్రమథనాథుడు ఈవాళ తెలుసుకొన్నాడు.

ప్రమథనాథ్ ఇంటికి వచ్చి; పిల్లలనందరినీ, పిలిచి, హోమాగ్ని ఒకటి నిర్మించి, విదేశవేషానికి ఉపకరణమైన అన్నింటినీ ఆ అగ్నికి ఆహుతిగా ఇచ్చాడు. అగ్నిశిఖలు ఎంతమీదికి లేస్తూంటే అంత ఆనందముతో పిల్లకాయలందరూ నృత్యము చేస్తూ వచ్చారు. ఆనాటినుండి ప్రమథనాథ్ దొరలయిళ్లకు ఎన్న డూ టీతాగడానికి పోలేదు; పూర్వము మోస్తరుగా దుర్గమ మైన గృహకోణదుర్గములో తిరిగి బసచేసుకు కూర్చున్నాడు.

కాని ఆనాడు రైలులో అవమానింపబడ్డ బిపదువారులు మాత్రము మునుపటిమాదిరే పాగాతలలతో దొరలఇళ్లకు పోతూ వచ్చారు.

నవేందుశేఖరుడు, అదృష్టముచాలక, ఈ ఇంటి రెండో అమ్మాయిని వివాహంచేసుకొన్నాడు. అప్పచెల్లెళ్లు చదువుసంధ్యలలో ఏ విధముగా ప్రథమశ్రేణికి యోగ్యురాళ్లో, రూపురేఖల్లో కూడా అదేవిధము. జయము అంటే నాదే అనుకున్నాడు నవేందు.

కాని తాను దొరకడం అత్తవారికి కూడా జయమే అని, ఆట్టే రోజులుకాకుండానే, వాళ్లకు నచ్చచెప్పవలెనని నవేందు నిశ్చయించుకొన్నాడు. ఎన్నడో ఎవరో ఒకదొరగారు అతని తండ్రిగారికి వ్రాసినఉత్తరం, పొరపాటుపల్ల జేబులో దొరికినట్టుగా, హఠాత్తుగా బయటికితీసి వదినగారిచేతిలో పెట్టేవాడు. ముఖమల్ వరలోని బాకులాగు గుంత్రనిపెదివెలలో నుండి వదినామరదళ్లు అతిమధురముగా నవ్వేవారు, ఈ ఉత్తరాలు చూచినప్పుడల్లా. తనకు దేశకాలపాత్రజ్ఞానము లేదని నవేందుబాబు చివరకు పోల్చుకొన్నాడు—తాను చేసింది పొరపాటే అని అప్పుడు బోధపడ్డది.

అప్పచెల్లెళ్లలో పెద్దామె లావణ్యలేఖ, గుణాలలోను లావణ్యములోనూ కూడా ప్రథమస్థానమే ఈమెది. ఈమె ఒక మంచిరోజు చూచి సీమ బూట్సుజత ఒకటి తెప్పించి

నవేందు పడకగది కిటికీలో ఉంచింది. బూట్సుకి పసుపు కుంకుమ పెట్టింది, దగ్గిర పువ్వులూ, గంధమూ, రెండువీపాలూ, ధూపమూ, ఎదుటను ఉంచింది. నవేందు ఇంటికిరాగానే వదినా మరదలూ, ఇద్దరూ చెరి ఒక చెవిపట్టుకొని అతన్ని గదిలోకి తీసుకొనివెళ్లి, ఇష్టదేవతకు నీ పద వృద్ధికై ప్రణామము చెయ్యమని చెప్పారు.

రెండోమరదలు కిరణలేఖ ఎన్నోరోజులు శ్రమపడి ఒక ఉత్తరీయంనిండా ఎఱ్ఱపట్టుదారముతో జోన్స్ (Jones) స్మిథ్ (Smith) బ్రౌన్ (Brown) థామ్సన్ (Thomson) మొదలైన దొరలపేర్లు నూరింటిని కుట్టి ఆ నామావళిని గొప్ప ఆడంబరంతో బావగారికి కానుకగా ఇచ్చింది.

అంతరికంటే చిన్నమరదలు శశాంకలేఖ వయస్సును పట్టి చూస్తే లెక్కింపదగినది కాకపోయినా, ఒకనాడువచ్చి, "బావా, నాశక్తికి తగినట్టు నేనూ ఒక చిన్న జపతావళం ఉపహారముగా ఇస్తాను, దొరలపేర్లు జపము చేస్తూఉండువుగాని," అని అన్నది.

అక్కలందరూ శశిని కొట్టబోయారు—"పో, నీ కెందుకే ఆ ముసరపంకాయమాటలన్నీ?" అని అంటూ.

నవేందుకు లోలోపుల కోపమువచ్చేది, సిగ్గు వేసేది—కాని వదినామరదళ్లనుమాత్రము వదిలి వెళ్లిపోలేకపోయి నాడు—అందులో ముఖ్యముగా వదినగారిని, ఆమె అమిత రూపవతి—ఆమెలో తీపి ఎంత ఉన్నదో చేదుకూడా అంత

ఉన్నది—ఇవతల నిషావదల బుద్ధివేయదు, అవతల భరించలేని ఒళ్లుమంట. రెక్కలకి దెబ్బతగిలిన పతంగము బాధకోలది ఒకప్రక్కనుండి ఘోష పెడుతుంటుంది, కాని పిచ్చిదానిలాగు పువ్వుచుట్టూ తిరగడంమాత్రం మానదు. మన నవేందు శేఖరులు చేసేదికూడా అదేమాదిరి.

వదినామరదళ్ల ఆకర్షణనుండి తప్పించుకోలేకపోయి నవేందు చివరకు దొరల మెహర్బానీ నా కవసరములేదు అని అనడం ప్రారంభించాడు. పెద్దదొరగారికి సలాము లర్పించడానికి వెళ్లిననాడు సురేంద్రనాథ్ బ్యానర్జీగారి ఉపన్యాసము వినడానికి వెళ్ళుతున్నానని ఇంట్లో చెప్పి బయలుదేరేవాడు. చిన్నదొరగారు డార్జిలింగ్‌నుంచి వస్తున్నారని చూడడానికి వెళ్లి, చిన్నమామను చూచివస్తానని మరదళ్లతో చెప్పాడు.

ఒకప్రక్క దొరలు, మరిఒక ప్రక్క వదినామరదళ్లూ—రెండు పడవలలో రెండు కాళ్లు పెట్టుకొని ఆ అభాగ్యుడు, నవేందు, గొప్పచిక్కులో పడ్డాడు—"ఆ అవతలిపడవకు చిల్లి పెట్టనిదే మేము వదల" మని వదినామరదళ్లు తమలోతా మనుకొంటున్నారు.

మహారాణిగారి రాబోవుజన్మదినాన బిరుదులస్వర్గానికి ప్రథమసోపానమైన రాయ్‌బహదూర్ పదవిలో తాను పదార్పణము చేయబోతున్నాడని నవేందుకు గాలికబురుగా తెలిసింది, కాని ఈ ఆనందవార్తను, పాపం, మన పిరికి నవేందు వదినామరదళ్లకు సాహసించి తెలియపరచలేకపోయినాడు.

శుక్లపక్షములో ఒకనాటిరాత్రి, ఎట్లాంటివాడినైనా పిచ్చెత్తించేటట్లు వెన్నెలకాస్తున్నది. ఆవేశాన్ని ఆపుకోలేక నరేందు భార్యతో తనను రాబోవుబిరుదువార్త తెలియచేశాడు. అమర్నాడే పగటిపూట పత్రికచూసుకొని ఆపుకో లేక అక్కగారింటికి వెళ్లి కళ్లు సిగ్గుపెట్టుకొని గద్గదస్వరముతో ఆవార్త తెలియచేసింది.

"మంచిమాటే! రాయ్‌బహదూర్ కాగానే నీ మొగుడికి తోకవస్తుం దనుకొంటున్నావా ఏమిటి—అంత సిగ్గుపడడము ఎందుకు?" అని అన్నది లావణ్యలేఖ.

"లేదక్కా లేదు! ఇంకేమైనాయినా ఫరవాలేదు కాని, నేను రాయ్‌బహదూరిణిని మాత్రము కాలేనక్కా," అని పదిమార్లు అన్నది. దాని నిజమేమిటంటే, ఆమె మిత్రవర్గములో నున్న భూతనాథ్‌బాబు ఒక రాయ్‌బహదూర్—తన భర్తకికూడా ఆపదవే వస్తుందనేటప్పటికి బహుకష్టముగా ఉన్నది. లావణ్య ఈ సందర్భములో చెల్లెలిని చాలా ఓదార్చవలసివచ్చింది.

లావణ్యభర్త, నీల్‌రతన్‌కు బక్సార్‌లో ఉద్యోగము. దుర్గపూజ సెలవులకు నరేందును బక్సార్ రమ్మని వదినగారు కోరింది. నరేందు అత్యానందముతో బహుశీఘ్రమే ప్రయాణమయి రైలు ఎక్కాడు. రైలు ఎక్కుతున్నప్పుడు నరేందుని

ఎడమభుజము అదరలేదు. విపత్తు రాబోయేముందు ఎడమ భుజము వణుకుతుంది అనుకోవడము ఒక చాదస్తపునమ్మకము అని దీనివల్ల మనము తెలుసుకోవలసిఉంటుంది.

పశ్చిమప్రాంతాలలో శీతకాలప్రారంభంలో పొందే స్వాస్థ్యముతో నిండిఉన్న లావణ్యసౌందర్యం మరింత పరిస్ఫుట మయింది; ఆమెబుగ్గలు అనురాగముతో నిండినవి. నిర్జన నదీతీరాన శరత్కాలములో కనబడే కాశవనశ్రీవలె లావణ్య మందహాసముతోనూ, ఆనందహిల్లోలములతోనూ, నిగనిగ లాడుతుండెను. నవేందుని ముగ్ధనేత్రాలకు లావణ్యలేఖ పుష్ప భరితమై, ప్రభాతసూర్యకిరణాలతో తళతళ్లాడు మంచుబిందు వులను రాల్చుతున్న, మాలతీలతవలె కనబడుతుండెను.

పశ్చిమదేశపుగాలీ, మనస్సులోపుట్టుచున్న ఆనందమూ, నవేందునకు నూతనారోగ్యాన్ని ఇచ్చినవి. అతనికి ఉండే అజీర్తి రోగము మరి కనబడలేదు. స్వాస్థ్యమువలనకలుగు ప్రఫుల్లతా, సౌందర్యమువల్లకలుగు ఆకర్షణా, వదినగారి శుశ్రూషా—ఇవి అన్నీ కలిసి అతనిలో ఒక విచిత్రభావము కల్పించినవి. భూత లాన్ని విడిచిపెట్టి తాను అంతరిక్షాన నడుస్తున్నాడని నవేందు శేఖరునకు తోస్తుండేది. తమ తోటప్రక్కనే గట్టుతీసి పారు తున్న గంగానది, తన మనస్సులోపలనుండే ఉన్మత్తతే రూపం ధరించి, సందడి చేసుకొంటూ, నిరుద్దేశ్యముగా పరుగెత్తుతు న్నదా అనిపిస్తుండెను.

శీతకాలము వేకువను లేచి షికారుతిరిగి ఇంటికివచ్చు సమయాన, ప్రభాతసూర్యరశ్మి సోకి, నవీందునిశరీరము చరితార్థత పొందుతుండెను. ఇంటికి తిరిగివచ్చి వంటచేస్తున్న వదినగారికి సాయముచేయబోయి తన అజ్ఞానాన్ని అడుగడుగునా వెల్లడి చేస్తూ ఉండేవాడు. మన స్సిచ్చి నేర్చుకోందామనే ఉత్సాహముకూడా ఆ మూఢునిలో కనబడలేదు. తప్పులుచేస్తూ చీవాట్లు తినడంవలన కలిగినతృప్తి, కడుపునిండినంత, ఇంకా లభించకపోవడమే ఆనేర్చుకోకపోవడానికి కారణం. సరిఅయినపాళ్లు కలిపి మసాలా నూరడమూ, గిన్నెలు పొయ్యిమీద పెట్టడమూ దించడమూ, మంటపెద్దదయి తపేళా అడుగంటుతుండగా చూస్తుండడమూ—ఇట్లాంటిపనులలో పసిబిడ్డకు ఎంత తెలుసునో తనకూ అంతే తెలుసునని సప్రమాణముగా రుజువుచేయవలెనని అతడు ప్రతిరోజూ గొప్పప్రయత్నము చేస్తుండేవాడు. దీనికి ఫలితముగా కరుణతోకూడుకున్న నవ్వు, నవ్వుతోకూడుకున్న చీవాట్లు, వదినగారి వద్దనుండి దొరికేవి, ఇవి అందుకొని నవీందు బహు ఆనందిస్తుండేవాడు.

మధ్యాహ్నము ఒకవైపున క్షుద్బాధ మరి ఒకవైపున వదినగారి బలవంతం, అవతల తనవాంఛా ఇవతల ఆమెప్రోత్సాహం, ఒకప్రక్క వండినవంటయొక్క రుచీ మరిఒకపక్క వంటచేసినవారి సేవామాధుర్యం—వీటినడుమను అల్లాడిపోతూ భోజనం మోతాదు మించకుండా ఉంచలేకపోయేవాడు.

భోజనానంతరం అందరూ పేకాటఆడుతూ కాన్సేపు కూర్చుండేవాళ్లు, ఆ ఆటలోనైనా నవేందుని ప్రతిభ ఆట్టే కాన వచ్చేదికాదు—అతడు ప్రక్కవాళ్ల ముక్కలు తీసుకొనేవాడు, దొంగతనముగా చూచేవాడు, పోట్లాడేవాడు, అయినా గెలవ లేకపోయేవాడు, తాసు ఓడలేవని దబాయించేవాడు, అబద్ధా లాడుతున్నందుకు తిట్లు తినేవాడు—ఎన్ని తిట్లుతిన్నా ఆ మూర్ఖుడికి బుద్ధిమార్చుకొందామని తోచేది కాదు.

ఒక విషయములోమాత్రము నవేందునిలో సంపూర్ణ మైన మార్పు కనబడ్డది. దొరలదయ సంపాదించడమే జీవితం యొక్క లక్ష్యము అనే నమ్మకము వదలుకొన్నాడు—వదులు కోకపోయినా ప్రస్తుతంమాత్రం మరిచిపోయినాడు. బంధుమి త్రుల శ్రద్ధవల్లను, అనురాగములవల్లను, తనకు ఎటువంటి సుఖమూ ఎంత గౌరవమూ కలగగలవో స్వానుభవమువల్ల నవేందు తెలుసుకోగలిగాడు.

అదికాక వదినగారిఇంటిగాలి వేరు, అక్కడి ధోరణివేరు. లావణ్యభర్త, నీల్‌రతన్‌బాబు, పట్టణములోని పెద్దవకీలు, అయి నా ఇత నెన్నడూ దొరలదర్శనానికి పోయేవాడు కాడు. ఈ విషయమై స్నేహితులు అతన్ని చీవాట్లుకూడా పెడుతూఉండే వారు; కాని సరిఅయిన జబాబు అతడు తత్‌క్షణమే ఇచ్చే వాడు—"వాళ్లతో నాకేమిపని నేను వాళ్లకు మర్యాద చేస్తా ననుకోండి, వాళ్లు తిరిగి చెయ్యకపోతే నేను చేసినదంతా

వృథా కాదూ? తెల్లగా నిగనిగలాడుతుందని ఎడారిభూమిలో విత్తనాలు జల్లడమువల్ల మనకు ఏమి సుఖము ? పంట పండే నల్లని భూమిలో జల్లడము అంతకంటే బుద్ధిఅయినపని కదా!"

నవేందు ఈ జట్టులో పడి హీన్డమొాస్తరే ప్రారంభించాడు — దీనిపరిణామము ఏమిటిఅనే చింతే అతని తలలోకి దూరలేదు. ఇంతకుపూర్వమే నవేందూ, అతని తండ్రిగారూ, దున్ని సిద్ధముచేసిన భూమిమీద రాయ్‌బహదూర్ బిరుదు లభించే సంభావన, జానిఅంతటఅదే, పెరుగుతూ వచ్చింది. ఇప్పుడు నీరుచల్లవలసిన అవసరంలేదు. కొద్దిరోజులక్రిందట నే, ముఖ్యముగా దొరల ఆమోదార్థం వినియోగపడే, గుర్రపుపందేలమైదానము ఒకటి నవేందు చాలా డబ్బు ఖర్చుపెట్టి తయారుచేయించాడు.

కాంగ్రెస్ సమావేశముయేరోజులు దగ్గిరపడుతున్నవి. చందాకొరకు నీల్‌రతన్‌బాబు దగ్గిరికి అపీలువచ్చింది.

నవేందు, వదినగారిదగ్గిరకూర్చొని, బహు ఆనందముతో పేకాట ఆడుతున్నాడు నిశ్చింతగా; నీల్‌రతన్ మధ్యను వచ్చి, "నీవుకూడా సంతకము పెట్టాలి నవేందూ," అన్నాడు. పూర్వాభ్యాసానుసారము నవేందునిముఖము వాడిపోయింది. లావణ్య లేచి కంగారుకంగారుగా, "జాగ్రత సుమా, అట్లాంటి పని చేసేయగలవు! నీ గుర్రపుపందేల బయలుఅంతా మంటకలిసిపోతుంది!" అని అన్నది.

"ఆ భయంవల్లనే నాకు రాత్రింబగళ్లు నిద్రపట్టకుండా ఉంది!" అని చేతులు విసురుకొంటూ నవేందు అన్నాడు.

"వార్తాపత్రికలలో నీపేరు వెయ్యరులే!" అని నీల్ రతన్ అన్నాడు అభయ మిస్తూ.

దీర్ఘాలోచనచేస్తున్న బుద్ధిమంతురాలిలాగు లావణ్య అన్నది—"అయినా ఎందుకు? ఈలాంటిమాటలు ఒకనోటినుండి మరి ఒకనోటికి—"

"పేపర్లో వేస్తే నాపేరుకు ఏమీ నష్టం కలగదు," అని నవేందు తీవ్రస్వరముతో జబాబుచెప్పాడు. ఇట్లాగు అంటూ నీల్‌రతన్‌చేతిలోనుంచి చందాకాగితము లాక్కొని, వేయిరూపాయి చందావేసేశాడు—లోలోపలమాత్రం ఆశిం చాడు పేపర్లో పేరువెయ్యరు అని.

"ఎంతపని చేశావు? ఎంతపని చేశావు?" అంటూ తల బాదుకొన్నది లావణ్య.

"నేను చేసిన అన్యాయ మేమిటి?" అని గర్వపడుతూ నవేందు అడిగాడు.

లావణ్య జబాబుచెప్పింది— "సీయల్‌డా స్టేషన్‌లో రైల్వేగార్డూ, హైవ్వాటెవే అసిస్టంటు సూపరింటెండెంటూ, హార్ట్ బ్రదర్స్ కంపెనీలోని సైసూ—వీళ్లందరూ కోపగించి నీ దుర్గపూజ విందులో షాంపేన్ తాగడానికి రాము అని

నవేందు నవ్వుకొంటూ నవ్వుకొంటూ వదినగారికి ఆ పేపర్ను చూపించాడు. ఎవరు వ్రాశారో తెలియనట్టుగా లావణ్యలేఖ అప్పుడే అంతరిక్షాన్నించి దిగినట్టుగా అతి అమాయకంగా ఇట్లా అన్నది—"అమ్మా, అమ్మా! ఏమి అన్యాయం! కొంప ముంచే శాం! ఎవడు నీకు అంతవిరోధి? వాడి కలానికి పురుగు పట్టా! వాడి సిరాలో ఇసక పొయ్య!"

నవేందు నవ్వుతూ జబాబుచెప్పాడు—"శపించకు శపించకు వదినా, నాశత్రువుని క్షమించాను నేను—పైగా వాణ్ణి ఆశీర్వదిస్తున్నాను కూడాను—వాడి కలమూ సిరాబుడ్డీ బంగారము కాగాక," అని.

మరి రెండురోజు లయినతరువాత కాంగ్రెస్‌విపక్షమైన దొరలపేపరు ఒకటి పోస్టుద్వారా నవేందుపేరను వచ్చింది. విప్పి చూచేసరికి "One who knows" (ఎరిగిన ఒకరు) అనే సంతకముతో పైచెప్పిన వార్తకు ప్రతివాదంగా ఎవరో వ్రాసిన ఉత్తరం కనబడ్డది. అందులో ఈవిధముగా ఉన్నది—"నవేందునిపేరు చెడపడానికి అతనికి విరుద్ధముగా చేస్తున్న ప్రచారము అది; అతనిని ఎరిగినవాళ్లెవ్వరూ ఎన్నటికీ దానిని నమ్మరు. చిరుతపులికి నల్లమచ్చలు పోగొట్టుకోవడము ఎంతసులభమో నవేందుకు కాంగ్రెస్‌లో చేరడముకూడా అంతసులభము. నవేందుశేఖర్ బాబు ఉద్యోగసంపాదించుకోలేని దరఖాస్తు

దారుడు కాడు, పార్టీలులేని స్నేహితుడు కాడు. వ్యక్తిత్వముగల మనిషి అతడు.

రెండురోజులు విదేశములో తిరిగి వచ్చి వేషంమార్చు కొని ఆచారవ్యవహారాలలో వారలను అనుకరణంచేసి, వారల సంఘములో దూరవలెనని విశ్వప్రయత్నముచేసి, చివరకు విఫలమనోరథుడై, దుఃఖిస్తూ, ఇనుకకు వచ్చిన పెద్దమనిషి కాడు. కనుక నవేందుబాబు ఇక్కడుంటే..."

ఆహా, పరలోకమున కేగిన పూర్ణేందుశేఖరా! వారల దగ్గిర ఇంతపేరూ, ఇంత గౌరవమూ, సంపాదించి మరీ చని పోయినావే!

ఈ ఉత్తరంకూడా వదినగారి ఎదుట పెంచము విప్పి చూపించినట్టుగా చూపించవగినదే. అతడు ఊరూ పేరూ లేని వాడు కాడు, అతడు సారముగలవాడు, అని అందులో వ్రాసి ఉన్నది.

లావణ్య మళ్లా అంతరిక్షంనుంచి భూతలంలో పడ్డది— "ఇది ఎవరు ఈ స్నేహితుడు మళ్లాను! ఎవడో టికెట్ కలె క్టరా? చర్మాలకంపెనీదొరగారా? ఫోర్టు (కోటలోని) బ్యాండ్ మాస్టరా?" అని లావణ్య అన్నది.

"ఈ ఉత్తరానికి జబాబు వ్రాయడం అవసరము," అని నీల్‌రతన్‌బాబు అన్నాడు.

"ఏమిటి ఆ అవసరము? ఎవడో ఏదో అంటూఉంటే వాటిని ఖండిస్తూ వ్రాస్తుంటామా?" అని అతి పెద్దతరహాగా అన్నాడు నవేందు.

లావణ్య కడుపుబ్బా నవ్వింది,నాలుగువైపులా మొఖము తిప్పుతూ; నవేందు కంగారుపడుతూ, "అంత నవ్వు ఎందుకు?" అన్నాడు. దానికి జబాబురూపముగా పుష్పితయౌవనముగల తన దేహాలతను ఇటూ అటూ అతిమనోహరముగా ఊపుతూ లావణ్య ఆపుకోలేక ఆపుకోలేక నవ్వింది.

ఈ పరిహాసాల-పిచ్‌కారి దెబ్బ గట్టిగా తగిలి, నవేందు బాగా కలవరపడి, కొంచము దీనముగా, "దానిని ఖండిస్తూ వ్రాయడానికి నేను జడుస్తున్నానని అనుకొంటున్నావా?" అని అడిగాడు.

లావణ్య జబాబు చెప్పింది—"ఆలా అనుకొంటూ నెందుకు?. ఎంతో ఆశపెట్టుకొని తయారుచేయించిన గుర్రపు పందెముల మైదానాన్ని ఎట్లాగైనా రక్షించాలనే ప్రయత్నం ఇంకా మానేవుకావు అని అనుకొంటున్నాను. ప్రాణం ఉన్నంత సేపు ఆశ ఉంటుంది కదా!"

"అందుకని వ్రాయడానికి నాకు ఇష్టంలేదని అనుకొంటు న్నావా?" అని అమిత కోపగించి నవేందు కలము సిరాబుడ్డి పుచ్చుకొని కూర్చున్నాడు. కాని వ్రాసినవ్రాతలో కోప చిహ్నమయిన రక్తిమజాడలేమీా పైకి కానరాలేదు. కనుక

దానిని సరిచేసేభారము లావణ్యగీల్‌రత్నులమీదనే పడ్డది. నవేందు అధికం నెయ్యా సీట్లూ వేసి సాధ్యమైనంతవరకు మెత్త మెత్తగా పలచగా చప్పిడిగా ఒప్పినవాటిని, ఆ ఒప్పినసహకారులూ కలిసి తత్‌క్షణమే ఘాటుచేసి గట్టిగా ఉండేటట్లు వేయించారు. వ్రాసినదాని ధోరణి ఇది—బంధువులు శత్రువులుగా మారినప్పుడు అసలు శత్రువులకంటె భయంకరమైనవాళ్లవుతారు. భారతదేశపు గవర్నమెంటువారికి, భాగస్వాములైన ఆంగ్లో ఇండియన్లే, రషియా దేశస్థులు పఠాన్లకంటె గొప్పశత్రువులు. భారతపరిపాలకులకీ ప్రజలకూ మైత్రి కుదరకపోవడానికి ముఖ్యమైన ప్రతిబంధకము ఈ ఆంగ్లోఇండియను సంఘమే! పరిపాలకవర్గానికీ ప్రజలకూ శాశ్వతమైత్రి కలగడానికి కాంగ్రెస్ ఏర్పరచిన రాజమార్గంలో అడ్డంగా ముళ్లు పాతినవాళ్లు ఈ ఆంగ్లో ఇండియన్ సమాజమే—

ఆ వ్రాతచూస్తే నవేందుకు కొంచము భయము వేసింది. కాని వ్రాత సజీవముగా ఉండడమువల్ల ఉండిఉండి కొంచెము ఆనందంకూడా కలుగుతుండేది—అంత చక్కని వ్రాత అతనికి సాధ్యాతీతము కదా!

కొన్నాళ్లవరకు నవేందు కాంగ్రెసులో చేరడముగురించీ, చందా ఇయ్యడముగురించీ, ప్రశ్నోత్తరాలూ, వ్యాఖ్యానాలు, తిట్లూ, వాదప్రతివాదాలూ, అనేకపేపర్లలో పడుతూవచ్చి డంకావాయిద్యంలాగు ఎటువెళ్లినా ఇదే చెవినిపడేది.

నవేందు గత్యంతరములేక దేశభక్తుడై అత్తవారి బృందములో అతినిర్భయంగా మాట్లాడుతుండేవాడు. లావణ్య తనలో తాను నవ్వుకొంటూ, "తొందరపడకు తొందరపడకు, నీ అగ్నిపరీక్ష దగ్గిరపడుతున్నదిలే," అని అనుకొన్నది.

ఒకనాడు నవేందు స్నానానికిముందు ఒంటికి నూనె రాసుకొంటున్నాడు. గుండెభాగానికి రాశాడు వీపుకు రాసుకొంటున్నాడు, చేతికి అందనిచోట రాసుకొందామని ప్రయత్నిస్తున్నాడు, సరిగా అట్లాంటప్పుడు నౌకరు విసిటింగ్ కార్డు ఒకటి చూపిస్తూ, ఎవరో దొరగారు వచ్చారని చెప్పాడు. దానిలో కలక్టరుగారిపేరు ఉన్నది. లావణ్య ఆ దగ్గరనే దాగొని తమాషా చూస్తున్నది.

ఒంటినిండా చమురుతో కలెక్టరుగారిదర్శనానికి వెళ్లలేడు—మసాలా పులిమి, వేయించడానికి సిద్ధముగాఉన్న చేపలాగు, కొట్టుకొంటున్నాడు నవేందు; ఎట్లాగో స్నానము తొందరతొందరగా ముగించి గాబరాగాబరాగా ఎవో బట్టలు వేసుకొని బయిటగదిలోకి పరుగెత్తుకువచ్చాడు. "దొరగారు చాలాసేపు కూర్చొని కూర్చొని వెళ్లిపోయినారు," అని నౌకరు చెప్పాడు. మొదటినుండి చివరవరకు అబద్ధమైన ఈ వ్యవహారంలో నౌకరుది ఎంతపాపమో, లావణ్యది ఎంత పాపమో నిర్ణయించడం నైతిక-గణితశాస్త్రంలోని సూక్ష్మ సమస్యలలో ఒకటి—అందుకేమీ సందేహము లేదు.

తెగిపోయిన బల్లితోక గుడ్డిగా, నిరర్థకముగా, ఏలాగైతే కొట్టుకొంటూ ఉంటుందో అదేమాదిరి నవేందుని గుండెకాయి లోపల కొట్టుకొంటుండెను. కూర్చొన్నా, పడుకొన్నా, భోజనముచేస్తున్నా—ఏమిచేయాలనుకొన్నా—అతనిమనస్సులో ఆవాళ గొప్ప అశాంతికలిగింది.

లావణ్య నవ్వును పైకిరానీయకుండా అణచివుంచి అతి ఆత్రతతో, "ఏమిటయింది నీకు ఈవాళ—ఒంట్లో జబ్బుగా లేదు కదా!" అని అడిగింది.

నవేందు దేశకాలపాత్రోచితమైన జవాబు ఒకటివ్వవలెనని నిశ్చయించుకొని బహుప్రయత్నముచేసి నవ్వి, "మీ ఇలాకాలో ఉన్నంతసేపూ జబ్బుకూడానా? నీవు నా ధన్వంత్రిణివే!" అని అన్నాడు.

కాని ఆనవ్వు ఒక్కక్షణములో అదృశ్యమైపోయి, నవేందు తనలోతాను ఇట్లాగు అనుకుంటాడు—"మొట్టమొదటి సంగతి ఏమిటంటే, నేను కాంగ్రెసుకు చందా ఇచ్చాను; తరువాత, ఘాటైన ఉత్తరం పేపర్లలో వ్రాశాను; దానిమీద కలెక్టరుగారు తానే స్వయంగా నన్ను చూడామని వస్తే చాలా సేపు కూర్చొపెట్టి దర్శనము ఇయ్యకుండా పంపేశాను—అతను ఏమిటనుకొంటున్నాడో కదా!"

ఆహా తండ్రీ పూర్ణేందుశేఖరా! నా దురదృష్టమువల్ల

నేను చేయనిపనులు, చేయజాలనిపనులు చేసినట్టు కనబడు తున్నాను కదా!

మర్నాడు నవేందు ముస్తాబయి గడియారంగొలుసు వేలవేసుకొని పెద్ద పగిడీచుట్టుకొని బయలుదేరాడు. ఎక్కడికి వెళ్లుతున్నావని లావణ్య అడిగితే, "ముఖ్యమైనపని ఒకటి ఉన్నది," అని జవాబిచ్చాడు. లావణ్య ఏమీ అనలేదు.

కలెక్టరుగారి బంగళాదగ్గిరికి వచ్చి విజిటింగ్ కార్డు బయిటికి తీస్తుండగానే, "ఇప్పుడు సమయం కాదు," అని ఆర్డర్లీ అన్నాడు.

నవేందు రెండురూపాయిలు తీశాడు జేబులోనుంచి, ఆర్డర్లీ సలాముచేస్తూ, "మేము ఐదుగుర మున్నాము," అన్నాడు; వెంటనే పదిరూపాయిలనోటు ఒకటితీసి నవేందు వాడికి ఇచ్చాడు.

రమ్మని కలెక్టరుగారిసెలవు అయింది. దొరగారు *మోర్నింగ్ గౌన్‌లో ఉన్నారు, జోళ్లు లేవు సగం స్లిపర్లు తొడుక్కొనిఉన్నారు, ఆఫీస్ కాగితాలేవో చూస్తున్నారు. దొర గారికి సలాముచేశాడు నవేందు, దొరగారు నవేందుని కూర్చో మని వేలితో సంజ్ఞచేస్తూ కాగితాలమీదినుండి మొఖమైనా ఎత్తకుండా, "దేనికి వచ్చారు బాబూ?" అని అడిగారు.

---

* Morning gown-బయటి పెద్దమనుష్యులను ఈ దుస్తులతో దొరలు చూడరు.

నవేందు భయపడుతూ భయపడుతూ, వాచీగొలుసు చేతితో ఇటూఅటూ కంగారుగా కదుపుతూ, "తమరు నన్ను దయచేసి నన్ను చూదామని వచ్చారు కాని—"అని ప్రారంభించాడు.

దొరగారు కనుబొమ్మలు విరుచుకొంటూ కాగితాలమీద నుండి మొఖం కొంచం ఎత్తి, "చూదామని వచ్చాను! * "Babu what nonsense are you talking !" అని అన్నారు.

నవేందు—"Beg your pardon, † పొరపాటు జరిగింది. గందరగోళం అయిపోయింది," అంటూ అంటూ ఎట్లాగో మెల్లిగావచ్చి బయటపడ్డాడు—ఒంటినిండా చమట పట్టి పోయింది.

ఇక ఆ నాటిరాత్రో! నిద్రలో, రాత్రిపొడుగునా, ఉండి ఉండి కలలో, మంత్రంలాగు వినబడుతున్నది—Babu you are a howling idiot. ‡

కోపగించి, దొరగారు నన్ను చూడడానికి వచ్చినట్లు ఒప్పుకోడానికి ఇష్టపడకుండా ఉన్నారని, ఇంటికి తిరిగి వస్తూవస్తూ

---

* బాబూ మీరు అర్థంలేని మాటలాడుతున్నారు! = బాబూ హ్వాట్ నాన్‌సెన్స్ ఆర్ యుం టాకింగ్!

† బెగ్ యుంవర్ పార్డన్ = క్షమించండి.

‡ బాబూ, యుం ఆర్ ఎ హౌలింగ్ ఈడియట్ = బాబూ మీ రొక తెలివిలేని పరమమూర్ఖులు!

నవేందు అనుకొంటాడు; భూమి రెండుచక్కలైపోతే ఎంత బాగుండును, అని తనలో తా ననుకొంటాడు—కాని భూదేవి ఇతని ప్రార్థన అంగీకరించలేకపోబట్టి నిర్విఘ్నంగా ఇంటికి వచ్చి చేరాడు.

వచ్చి వదినగారితో, "ఇంటికి పంపడానికిని పన్నీరు కొందామని వెళ్లాను," అని నవేందు అన్నాడు.

నవేందు ఈమాటలు అనీఅనకముందే కలెక్టర్ ఆఫీసు డవాలీలతో ఆరుగురు బంట్రోతులు వచ్చి హాజరైనారు; సలాముచేసి మాటాడక నవ్వుతూ నిల్చున్నారు.

"నీవు కాంగ్రెస్‌కు చందా ఇచ్చావని అరెస్టుచేయడానికి రాలేదు కదా ?" అని లావణ్య నవ్వుతూ అన్నది.

పళ్లు ఇగిలించుకొంటూ ఆరుగురూ, "బక్‌షీస్ * బాబూ సాబ్," అన్నారు.

నీల్‌రతన్ ప్రక్కగదిలోనుంచి చీకాకుపడుతూ బయటికి వచ్చి, "ఎందుకు బక్‌షిస్ ?" అని అడిగాడు.

"కలెక్టరుగారిదర్శనం బాబుగారికి దొరికింది బక్‌షీస్ అడగడానికి వచ్చాము," అని బంట్రోతు లన్నారు.

లావణ్య నవ్వుతూ అంటుంది—"కలెక్టరువారగారు ఇప్పుడు పన్నీరువర్తకం ప్రారంభించారా ఏమిటి ? పూర్వము

* బక్‌షీస్ = ఇనాము = Tip

ఎన్నడూ ఇట్లాంటి శీతలపదార్థలతో ఆయనకి జోక్యం ఉండేది కాదే!"

ఆ అభాగ్యుడు నవేందు పస్నిరుకొనడంతో కలక్టరుగారి దర్శనాన్ని ఎట్లాగో సమన్వయించబోయినాడు కాని, "టెంకాయ పిచ్చికొండ," లాగు అతనిమాటలు ఎవరికీ అర్థముకాలేదు.

నీల్‌రతన్‌బాబు, "బక్‌షీస్ ఇయ్యవలసిన పని ఏదీ కాలేదు, బక్‌షీస్ దొరకదు పొండి," అని బంట్రోతులతో అన్నాడు.

నవేందు సంకోచిస్తూ సంకోచిస్తూ జేబులోనుంచి పది రూపాయిలనోటు ఒకటి తీసి, "బీదవాళ్లు పాపం కాస్త సాయంచేస్తే తప్పేమిటి," అని అన్నాడు.

నీల్‌రతన్ నవేందుచెయ్యి పట్టుకొని, "వీళ్లకంటె నిరుపేదలు అనేకమంది ఉన్నారు, వాళ్లకు ఇస్తాను," అని అన్నాడు.

కోపముతో మండిపడుతున్న మహేశ్వరుని భూతప్రేత గణానికైనా కొంత చల్లార్చడానికి అవకాశము చిక్కక నవేందుడు చాలా దుఃఖించాడు. బంట్రోతులు వెళ్లిపోతూ వెళ్లిపోతూ అతనిమీద అగ్నిహోత్రుల్లై చూశారు, నవేందు మహాదీనంగా వాళ్లవంకచూశాడు. ఆ చూపుద్వారా నవేందు వాళ్లతో, "నాయనలారా, నాదేమీ తప్పులేదు, ఆ సంగతి మీరెరుగుదురు," అని విన్నవించాడు.

కాంగ్రెస్‌సమావేశము కలకత్తాలో జరగబోతున్నది. ఆ సంబంధంలో నీల్‌కతన్ భార్యాసమేతముగా కలకత్తా వచ్చాడు, నవేందుకూడా వాళ్లతో కలిసి వచ్చారు.

కలకత్తాలో కాలు పెట్టాడో లేదో కాంగ్రెస్‌దళం నవేందుని నాలుగువైపులా ముట్టడించి గొప్పతాండవం ప్రారంభించేశారు. వాళ్లుచేసిన సన్మానానికి స్తోత్రానికి మితి లేదు. "మీ వంటివాళ్ళు దేశసేవలోకి దిగకపోతే దేశానికి ఉపాయం ఏమిటుంటుంది?" అని అంటూ అన్నారు. ఆ మాట నిజమే—నవేందు లేదన లేదు—ఆ గందరగోళములో ఏలాగో హఠాత్తుగా దేశనాయకులలో తానూ ఒకనాయకుడై పోయినాడు. కాంగ్రెస్ సభాగృహంలో ఇతడు అడుగుపెట్టిపెట్టడంతోనే అందరూ లేచి నిలుచొని, "హిప్ హిప్ హిప్ హుర్రే" అంటూ దొరల గొంతుకులతో భయంకరమైన కేకలువేస్తూ అతనిని అభినందించారు. మన మాతృభూమి సిగ్గుచేత ముఖమెర్ర చేసుకొన్నది.

కొద్దిరోజులలోనే రాణీగారిజన్మదినము వచ్చింది—నవేందు ఆశించిన బిరుదు, దగ్గిరపడిన మరీచికములాగు అంతర్థాన మయింది.

# ముక్తి

ఫకీర్‌చంద్ చిన్నప్పటినుండి గంభీరస్వభావము గలవాడు. ముసలివారిమధ్య కూర్చొనిఉన్నప్పుడు తానూ ఒక ముసలివానిలాగు ఉండేవాడు—ముసలివారిమధ్యను వీడేమిటి అని చూచేవారి కెన్నడూ అనిపించేదికాదు. చలి, చల్లని నీళ్లు, హాస్యపరిహాసాలు మొదలైన వేవీ—అతనికి పడేవికావు. అసలే గంభీరస్వభావము, పైగా సంవత్సరములో ముప్పాతిక మూడువంతులు రోజులు తలచుట్టూ నల్లని పూలు కంఫర్టరొకటి చుట్టుకొని ఉండేవాడు. దీనివల్ల ఏదో పెద్దకుటుంబానికి చెందిన మనిషిలాగు కనబడేవాడు. ఇంతేకాక చిన్నప్పుడే మీసాలు గడ్డాలు అల్లుకుపోవడముచేత, హాస్యవికాసానికి ఏమాత్రమూ స్థలము లేకపోయింది.

అతనిభార్య హైమంతివయస్సు అల్పము; ఆమె మనస్సు పూర్తిగా ఇహలోకసంబంధమైన విషయాలలో మునిగి ఉండేది. ఆమెకు బంకిమ్‌బాబునవలలు చదవడమంటే చాలా ఇష్టము, పతిని సంపూర్ణముగా దేవుని పూజించేటట్టుగా పూజించవలసిన మనిషికాదామె. ఆమెకు హాస్యాలు, నవ్వులాట సరదా. క్షణానికో క్షణానికో విచ్చుతుంది అనేటప్పుడు పువ్వులో ఒకవిధమైన ఆందోళన ఆరంభం అవుతుంది, ప్రాతః

కాలపు సూర్యరశ్మి వచ్చి ఎప్పుడు తనమీద పడునా అని చూస్తుంటుంది, ఏమాత్రము గాలి వీచినా అల్లాడుతుంటుంది. నవయౌవనములో నున్న హైమంతికూడా ఆ స్థితిలోనే ఉన్నది. పెనిమిటివలన ఆదరముపొందవలెనని, అతనితో కలిసి హాస్యమాడుతుండవలెనని ఆమె కోరిక. కాని పెనిమిటి ధోరణి వేరు—ఏమాత్రము వ్యవధి దొరికినా ఆమెచేత భాగవతము చదివించేవాడు, సాయంకాలము కాగానే భగవద్గీత చదివి వినిపించేవాడు. ఆమె ఆధ్యాత్మికఉన్నతికోసమని అప్పుడప్పుడు ఆమె శరీరముపై శిక్షవిధిస్తూ ఉండేవాడు. ఒక నాడు హైమంతి దాచుకొంచ బంకిమ్‌చంద్రుని "కృష్ణ కాంతునివీలు," భర్తకు కనబడ్డది. చంచలస్వభావముగల ఆ యువతి కళ్లవెంట ఆరాత్రిఅంతా అశ్రుధారలు కారడం చూచిన తరువాతగాని ఫకీర్ మనస్సుకు శాంతికలగలేదు. నవలలు చదవడమనేతప్పు ఉండనేఉన్నది, పైగా, పతి దైవాన్ని మోసపుచ్చవలెనని ప్రయత్నము! ఉపదేశమువలన నైతేనేమి, ఆదేశమువలననైతేనేమి, ధర్మనీతిద్వారా నైతేనేమి, దండనీతిద్వారా నైతేనేమి, చిట్టచివరకు పతిదేవుని ప్రయత్నమే సఫలమయింది. హైమంతి ముఖాన నవ్వన్నది మరి కనబడలేదు. అప్పటినుండి, మనస్సులో సుఖానికి తావులేదు, లోపల నుండే యౌవనావేగము ఉక్కిరిబిక్కిరై లోపునే చచ్చింది.

కాని ప్రపంచములో విరాగులకుకలిగే విఘ్నాలే.

విస్తారము. త్వరలో ఫకీర్‌చందుకు సంతానప్రాప్తి కలిగినది, ఒక కొమారుడు ఒకకొమార్తె పుట్టి వీరిద్వారా సంసారబంధము మరెంత దృఢపడ్డది. ఇంత గంభీరస్వభావముగల ఫకీర్‌చందు కూడా తండ్రిపోటులు భరించలేక అఖరుకు ఉద్యోగ మియ్య మని ప్రార్థిస్తూ ప్రపంచములో ఉండే ఆఫీసులన్నిటికీ వెళ్ళవలసి వచ్చింది. కాని ఎంత ప్రయత్నించినా ఉద్యోగమువాసికే ట్టు కనబడలేదు.

బుద్ధునివలె సంసారము విడిచిపెట్టిపోవలెనని ఫకీరు చివరకు నిశ్చయించుకొని, ఒకనాడు అర్ధరాత్రివేళ ఇల్లువిడిచి వెళ్ళాడు.

౨

ఇది ఇట్లా ఉంటూఉండగా ఇక్కడ మరిఒక కథ చెప్ప వలసిఉన్నది.

నవగ్రామవాసిఅయిన షష్ఠీచరణ్‌కు ఒక్కడే కొడుకు. అతనిపేరు మాఖన్‌లాల్. పెళ్ళికాగానే సంతానము కలగకపోవ డముచేతనూ, నూతనవధువు అనగానే పుట్టిన ఆశవల్లనూ, తండ్రి కోరికప్రకారం అతడు రెండోపెళ్ళి చేసుకొన్నాడు. రెండో పెళ్ళికాగానే ఇద్దరు భార్యలవల్లా సంతానము కల గడం ప్రారంభం అయింది. మొత్తం ఏడుగురు ఆడపిల్లలూ ఒక మొగపిల్లవాడు అయినారు.

మాఖన్‌లాలు మహా సుకుమారి, చపలచిత్తుడు, ఏపని

నైనా పట్టుపట్టి చేయడానికి ఒప్పుకోవలసినవాడు కాడు. అసలే పిల్లలభారము భరించలేక బాధపడుతున్నాడు, పైగా రెండు వైపులా ఇద్దరు కర్ణధారులు కూర్చొని రెండుచెవులూ రాత్రిం బగళ్లు లాగుతూ ఉండడముచేత ఒకనాడు అర్ధరాత్రివేళ హఠాత్తుగా మాయమైనాడు.

చాలాకాల మయింది, అతడు మరి తిరిగిరాలేదు. వీరూ వారూఅనుకోగా ఒకసంగతిమాత్రము ఇంటివాళ్లు విన్నారు— ఒకటేపెళ్లిచేసుకొని ఉండడమువల్ల ఎటువంటి సుఖం అనుభ వించవచ్చునో చూడామని రహస్యముగా కాశీవెళ్లి కొత్తగా మరిఒక పెళ్లిచేసుకొన్నాడట. మూడోపెళ్లివల్ల కొంత సుఖము కూడా పొందుతున్నాడట. స్వదేశంవైపు రావలెనని అతని ప్రాణాలు కొట్టుకుపోతున్నవి, కాని ఇంటివాళ్లకు దొరికిపోతా డేమో అనేభయమువల్ల రాలేకుండా ఉన్నాడని కూడా వదంతి.

3

కొంతకాలము తిరిగి తిరిగి ఫకీర్‌చంద్ నవగ్రామము చేరి దారిప్రక్క నొక వటవృక్షముక్రింద బసచేసి, స్వేచ్ఛగా ఊపిరి విడుస్తూ, ఆహా, "వైరాగ్యమే వాభయం!" అన్నాడు. భార్యా పిల్లలూ, ఇల్లూ ధనమూ, ఏవీ ఎవరికీ శాశ్వతముకావు! "కా తే కాంతా కస్తే పుత్రః?" ఇట్లా అంటూ పాటొకటి మొదలుపెట్టాడు.

పాట హఠాత్తుగా మధ్యను నిలిచిపోయింది—"ఎవరది? నాన్నలాగున్నాడే? మళ్లా నన్ను సంసారాంధకూపములోకి తీసుకొని వెళ్లిపోతాడు కాబోలు—ఇక్కడ ఉండకూడదు, పారి పోవాలి."

౪

ఫకీర్ త్వరత్వరగా లేచి ఎదుటనున్న సందుగుండా ఎవరిదో ఇంటిలో దూరాడు. ఇంటియజమాని ముసలివాడు, ఒక మూల కూర్చొని గుడుగుడు పీలుస్తున్నాడు, ఫకీర్ని చూచి, "ఎవరు నీవు?" అన్నాడు.

ఫకీర్—"నాయనా, నేను, బైరాగిని."

ముసలివాడు "బైరాగా! ఏదీ ముఖము నాయనా, చూడనీ; కొంచెము వెలుతురులోకి రా చూస్తాను."

ఈలా అంటూ ముసలివాడు ఫకీరును చేయిపట్టుకొని వెలుతురులోకి లాగుకొనివచ్చి అతనిముఖమునకు తనముఖం పెట్టి, దృష్టిమందమైనవాడు పుస్తకం ఏవిధముగా అతికష్ట పడుతూ చదువుతారో, ఆవిధముగా ఫకీరుముఖం పరీక్షచేసి, చివ రకు తనలోతా ననుకొన్నాడు—"ఇదిగో వీడు మా మాధవు లాగే! అదే ముక్కు, అదే కళ్లు, బట్టమాత్రం మార్చుకొన్నాడు. అది కాక, ఆ చంద్రముఖానికి నాలుగువైపులా గడ్డాలూ మీసాలూ బలిసిపోయినవి."

ఈలా అనుకొంటూ ముసలివాడు గడ్డముబలిసిన ఫకీర్ ముఖం బహు ఆదరంతో తడుముతూ, "నాయనా ముఖన్!" అన్నాడు.

ఆ ముసలివాడు షష్ఠీచరణ్ అని వేరే చెప్పనక్కరలేదు.

ఆశ్చర్యపడుతూ ఫకీర్ అన్నాడు—"మాఖనా! నా పేరు మాఖన్ కాదు. నా పేరు పూర్వాంసమైయున్నా ఇప్పుడు మాత్రము అది కాదు, ఇప్పటి పేరు చిదానందస్వామి—కావలె నంటే పరమానందస్వామి యనికూడా పిలవవచ్చును."

షష్ఠీచరణ్—"నాయనా నీవు చేసిన పేరుపెట్టుకో పరమహంసమని పేరుపెట్టుకో నాకుమాత్రము నీవు నా మాఖన్‌వే, నే నా పేరు ఎన్నటికీ మరవను. ఎటువంటిదుఃఖము కలిగి ఇల్లు వదిలి వెళ్ళిపోయినావురా నాయనా? నీకు ఏమిలోటయిందిరా బాబూ? ఇద్దరు భార్యలు—పెద్దామె నీకిష్టము లేకుంటే చిన్నామె ఉన్నది—బిడ్డా పాప లేరనే దుఃఖముకూడా లేదు—అందరినీ నోరుమూయించేటట్టుగా ఏడుగురు కొమార్తెలు, ఒక కొడుకు ఉన్నారు; తండ్రిని నేను, ముసలివాణ్ణైపోయినాను, మహా బ్రతికితే ఏనాలుగేండ్లో బ్రతుకుతాను—తరువాత అంత నీదే కదా—ఏమిరా నాయనా నీకు ఎందుకు దుఃఖం కలిగింది?"

"ఓయ్ బాబు! కొంప మునిగిందే! విన్నంతమాత్రాన భయమువేస్తున్నది!" అని ఉలికిపడి ఫకీర్ తనలో తాననుకొన్నాడు.

పాట హఠాత్తుగా మధ్యను నిలిచిపోయింది—"ఎవరిది? నాన్నలాగున్నాడే? మళ్లా నన్ను సంసారంధకూపములోకి తీసుకొని వెళ్లిపోతాడు కాబోలు—ఇక్కడ ఉండకూడదు, పారి పోవాలి."

౪

ఫకీర్ త్వరత్వరగా లేచి ఎదురుగా కనబడుతూవున్న ఎవరిదో ఇంటిలో దూరాడు. ఇంటియజమాని ముసలివాడు, ఒక మూల కూర్చొని గుడుగుడు పీలుస్తున్నాడు, ఫకీర్‌ని చూచి, "ఎవరు నీవు?" అన్నాడు.

ఫకీర్—"నాయనా, నేను, బైరాగిని."

ముసలివాడు "బైరాగా! ఏది చూడని నాయనా, చూడనీ; కొంచెము వెలుతురులోకి రా చూస్తాను."

ఈలా అంటూ ముసలివాడు ఫకీరును చేయిపట్టుకొని వెలుతురులోకి లాగుకొనివచ్చి అతనిముఖంమీద తనముఖం పెట్టి, దృష్టిమందమైనవారు పుస్తకం ఏవిధముగా అతికష్టపడుతూ చదువుతారో, ఆవిధముగా ఫకీరుముఖం పరీక్షచేసి, చివరకు తనలోతా ననుకొన్నాడు—"ఇదిగో వీడు మా మాఖన్‌లాలే! అదే ముక్కు, అదే కళ్లు, బట్టమాత్రం మార్చేశాడు. అది కాక, ఆ చంద్రముఖానికి నాలుగువైపులా గడ్డాలూ మీసాలూ బలిసిపోయినవి."

ఈలా అనుకొంటూ ముసలివాడు గడ్డముబలిసిన ఫకీర్ ముఖం బహు ఆదరంతో తడుముతూ, "నాయనా మాఖన్!" అన్నాడు.

ఆ ముసలివాడు షష్ఠీచరణ్ అని వేరే చెప్పనక్కరలేదు.

ఆశ్చర్యపడుతూ ఫకీర్ అన్నాడు—"మాఖనా! నా పేరు మాఖన్ కాదు. నా పేరు పూర్వం వేరేయున్నా ఇప్పుడు మాత్రము అది కాదు, ఇప్పుడు నేను చిదానందస్వామి—కావలె నంటే పరమానందస్వామి అనికూడా పిలువవచ్చును."

షష్ఠీచరణ్—"నాయనా నీవు నీవని పేరు పెట్టుకో పరమానందమను పేరుపెట్టుకో నాకుమాత్రము నీవు నా మాఖనే, నే నా పేరు ఎన్నటికీ మరవను. ఏటువంటిదుఃఖము కలిగి ఇల్లు వదిలి వెళ్లిపోయినావురా నాయనా? నీకు ఏమిలోటయిందిరా బాబూ? ఇద్దరు భార్యలు—పెద్దామె నీకిష్టము లేకుంటే చిన్నామె ఉన్నది—బిడ్డా పాప లేరనే దుఃఖముకూడా లేదు—అంతవలసి నోరుమూయించేటట్టుగా ఏడుగురు కొమార్తెలు, ఒక కొడుకు ఉన్నారు; తండ్రిని నేను, ముసలివాడనైపోయినాను, మహా బ్రతికితే ఏనాలుగేండ్లో బ్రతుకుతాను—తరువాత అంతా నీదే కదా—ఏమిరా నాయనా నీకు ఎందుకు దుఃఖం కలిగింది?"

"ఓయీ బాబు! కొంప మునిగించే! విన్నంతమాత్రాన భయమువేస్తున్నది!" అని ఉలికిపడి ఫకీర్ తనలో తాననుకొన్నాడు.

ఫకీర్ అప్పటికి నిజస్థితి పోల్చుకొని, "ఇదే బాగుంది. రెండురోజులపాటు ముసలివానికొడుకులాగునే ఇంట్లో ఉందాము, అంతలో నాన్న నా కోసము వెదికి వెదికి, ప్రయత్నము వృథాఅయి, ఇంటికి తిరిగి వెళ్లిపోగానే నే నిక్కడనుంచి పారిపోవచ్చును," అని తనలో తా ననుకొన్నాడు.

ఫకీర్ ఏమీ అనకపోవడము చూచి ముసలివాడు వీడు తప్పక మాఖనే అని నిశ్చయపరచి, నౌకరి కిష్టుని పిలిచి, "ఒరే కిష్టా, మాఖన్‌బాబు తిరిగి ఇంటికివచ్చేశాడని అందరితో చెప్పరా," అని అన్నాడు.

౫

చూస్తూఉండగానే ఇల్లు ప్రజతో నిండిపోయింది. "ఆహా మాఖనే సందేహ మెందుకు?" అని అన్నారు చాలామంది, కాని మధ్యమధ్య ఎవడో ఒకడుమాత్రము సందేహిస్తూవచ్చాడు. కాని సాధారణముగా మనుష్యులు నమ్ముదామని సిద్ధముగా/ కూర్చొనిఉంటారు, కనుక వారంతా కలిసి ఆ నమ్మనివాళ్లమీద మండిపడ్డారు—"నమ్మకూడదని నిశ్చయించుకొని రసభంగము చేదామని వీళ్లు వచ్చారు. నలుగురూ ఏదిఅంటే అదికాదు అనాలి—ఆలాంటివాళ్లు ఊరిలోనుండి పోతేనేగాని ఎవరికీ సుఖంలేదు. వారికి దయ్యంఅన్నా నమ్మకములేదు, చిల్లంగిఅన్నా నమ్మకంలేదు. అద్భుతమైన సంగతేదైనా విని అంతా ఆశ్చర్యపడుతూఉంటే—అది ఏలాగు?

ఇది ఏలాగు? అని వీరు ప్రశ్నలు వేస్తూఉంటారు," అని అక్కడకూడిన బుద్ధిమంతులు నలుగురూ వీళ్లను దూషించారు. దయ్యమూ భూతమూ నమ్మకపోతే అంత నష్టమేమీ లేదుకాని, పాపం ఆ ముసలివాడి కుమారుడు, పారిపోయిన వాడు, తిరిగి ఇంటికివస్తే వాడౌనో కాదో అనడంకంటె నీచమైన పని వేరొకటి ఉండదు కదా? ఎట్లాగైతేనేమి నలుగురి చేతా చీవాట్లుతినడంవల్ల సందేహించేవాళ్లనోళ్లు కట్టిపోయినవి.

ఫకీర్ భయంకరమైన గాంభీర్యము వహించి నోరు తెరవకుండా కూర్చున్నాడు—కాని గ్రామస్థులు అతనిచుటూ కూర్చొని, అతనివైపు చూడనైనా చూడకుండా ఆశ్చర్య పడుతూ అతనినిగురించి అనుకొంటున్నారు—"చూచారా మన మాఖనే ఋషిఅయి వచ్చాడు, అత డిప్పు డొక గొప్పతపస్వి, ఎప్పుడు చూచినా పనిపాట్లులేక తిరుగుతుండే వాడు, వాడు నేడు మహాముని జమదగ్నిఅయి కూర్చున్నాడు!"

ఈ మాటలన్నీ వింటూఉంటే ఫకీర్‌కు చాలా కష్టముగా ఉన్నదిగాని వేరుఉపాయ మేదీలేక సహించి ఊరుకో వలసివచ్చింది. చుట్టూఉండే వారిలో ఒకడువచ్చి ఫకీర్ మీదపడి, "ఏమిరో అబ్బాయ్, నీ వంతనల్లగా ఉండేవాడవు కదా, ఇంత తెల్లగా ఏలాగైనావురా?" అని అడిగాడు.

"యోగాభ్యాసము చేసి చేసీ," అన్నాడు ఫకీర్.

"యోగప్రభావము ఎంత అద్భుతమైనది!" అని అంతా అన్నారు.

"అందులో ఆశ్చర్యం ఏమిఉన్నది! భీముడు హనుమంతుని తోకఎత్త ప్రయత్నించాడుగాని, ఎంతప్రయత్నించినా కదపనైనా కదపలేకపోయినాడు—ఈలాగని శాస్త్రంలో ఉన్నది—ఇది దేనివల్ల సాధ్యమయింది?—యోగబలమువల్ల!" అని అందులో ఒకడన్నాడు.

అతను ఈలాగు అనేసరికి అంతా ఒప్పుకోవలసివచ్చింది. ఆసమయంలో షష్ఠీచరణ్ వచ్చి, "నాయనా నీ వొకమారు ఇంట్లోకి రావాలి," అన్నాడు.

ఫకీర్ నెత్తిమీద పిడుగుపడ్డది—ఇటువంటి విన్నపము ఇంట్లోనుంచి రావచ్చునని అతనికి ఇప్పటివరకు తట్టలేదు. ఫకీర్ చాలాసేపటివరకు ఏమీ అనకుండా కూర్చున్నాడు, చుట్టూచేరినవాళ్లు చేస్తూఉండే వేళాకోళము జీర్ణముచేసికొని చివరకు జవాబుచెప్పాడు—"నాయనా నేనిప్పుడు సన్న్యాసిని, కనుక అంతఃపురములోకి రావడము నిషేధం."

షష్ఠీచరణ్ అక్కడుండేవారితో, "ఆలాగైతే మీరు దయచేసి కొంచెము లేవవలసిఉంటుంది. కోడళ్లను ఇక్కడికే తీసుకొనివస్తాను, వాళ్లు నిలవలేకుండా ఉన్నారు," అన్నాడు.

అంతా లేచారు, వాళ్లతో తానూ లేచి ఒక్కపరుగు వేదామా అని ఫకీర్‌కి బుద్ధిపుట్టింది. కాని రోడ్డుమీద కాలు పెట్టేసరికి జనము కుక్కలలాగు వెనుకపడతారు—ఆసంగతి ఊహించి లేవడం మంచిది కాదనుకొని అక్కడే కూర్చున్నాడు.

మాఖన్‌లాలు భార్యలిద్దరూ గదిలో ప్రవేశించగానే ఫకీర్ తలవాల్చి వారికి నమస్కారము చేస్తూ, "అమ్మలారా, నమస్కారము—నేను మీబిడ్డణ్ణి," అని అన్నాడు.

మాట ఇంకా పూర్తికాలేదు, గాజులుపెట్టుకొని ఉన్న చెయ్యొకటి ఫకీర్ ముక్కును గట్టిగా పట్టుకొన్నది. ఘంటానాదమువంటి స్వరముతో ఈ మాటలు ఆ ముక్కు పట్టుకొన్న ఆమె కంఠములోనుంచే వచ్చినవి—"ఏమండీ బాబూ, ఎవరినండీ 'అమ్మ' అన్నారు?"

దాని పైస్థాయిని మరి ఒక స్వరము వినబడ్డది—"కళ్లకు ఏమయింది—ఎందుకు బ్రతికే? సిగ్గు లేదేమో?"

ఇటువంటి వ్యావహారికభాష ఫకీ రెన్నడూ తనభార్య నోటవెంట విని ఉండలేదు, కనుక అతడు చేతులుజోడించు కొని, "మీరు పొరపాటుపడుతున్నారమ్మా, ఇదిగో నే నీవెలు తురులోకి వచ్చి నిలుచుంటాను, ముఖం బాగా చూడండి," అని అన్నాడు.

ఇద్దరు భార్యలూ కలిసి జబాబిచ్చారు—"చూచాము చూచాము, కావలసినంతచూచాము—చూచి చూచి కళ్లు కాయలు కాసిపోయినవి. చంటిపిల్లవాడు పాపము, ఇప్పుడే పుట్టాడు గాబోలు! అడ్డూ ఆపూ లేకుండా ఏళ్లు పెరిగిపోతు న్నవి, యమధర్మరాజు మరిచిపోయినాడుకదా అని మేముకూడా మరిచిపోయినా మనుకొంటున్నాడు కాబోలు!"

ఫకీర్, మాటాడేశక్తిపోయినవాడు నిలబడేటట్లు, తల వాల్చుకొని నిలబడిఉన్నాడు. ఒకపక్షమువారి మాటలే విన బడుతూఉంటే ఈ దాంపత్య సంభాషణ ఆలాగు ఎంతసేపు జరిగి ఉండునో చెప్పడం కష్టము. కాని, గదిలో గందరగోళము జరుగుతున్నది, ఊరిప్రజంతా ఇంటిఎదుట జమకూడింది—ఇదిచూచి షష్ఠీచరణ్ గదిలోకి వచ్చి, "ఇన్నాళ్లూ ఇంట్లో 'ఊఁ' 'ఆఁ' అనైనా వినబడేవి కాదు, ఈవాళ నిజముగా మాఖన్ ఇంటికి వచ్చాడనిపిస్తూఉంది," అని అన్నాడు.

ఫకీర్ చేతులుజోడించి, "అయ్యా నన్ను మీ కోడళ్ల చేతులలోనుంచి తప్పించి రక్షించండి," అని అన్నాడు.

షష్ఠీచరణ్—"చాలాకాలానికి వచ్చావు,కనుక మొదట కొంచెము భరించడానికి కష్టముగానే ఉండవచ్చును నాయనా, కాని మీరిక లోనికిపొండి అమ్మా, ఏమైనాసరే, మాఖన్‌ని మరి ఎంతమాత్రము పోనీయను."

ఆ ఇద్దరుస్త్రీలు లోపలికి వెళ్లిపోగానే ఫకీర్ షష్ఠీచర ణుతో, "అయ్యా మీ కుమారుడు ఎందుచేత గృహత్యాగము చేసి వెళ్లిపోయినాడో నేను స్వానుభవమువల్ల పోల్చుకోగలు గుతున్నాను. ఇక నా ప్రణామం అందుకొని నాకు సెలవీయండి," అని అన్నాడు.

ఆమాటలు వినగానే వృద్ధుడు పెద్దకేకలువేసి ఏడవడ

మారంభించాడు—— మాఖన్ తండ్రిని కొడుతున్నా డనుకొని ఏమి! ఏమి! అంటూ అంతా లోపలికి పరుగెత్తుకొని వచ్చారు. ఇటువంటి దొంగవైరాగ్యం ఇక్కడ పనికిరావబ్బాయి అంటూ నలుగురూ తిట్టారు ఫకీర్ ని; "ఇక్కడ పెద్దమనిషి తరహాగా ఉండవలెను," అని ఉపదేశ మిచ్చారు, కొందరు. "వీడు పరమ హంసకాడండీ పరమబకుడండీ," అని అన్నాడు, అందులో ఒకడు.

ఫకీర్ ఇటువంటి మాటలు నేటివరకు ఎన్నడూ వినలేదు. అతను మళ్లా పారిపోతాడేమో అని పేటలోనివారంతా అతి జాగ్రత్తగా కాస్తూఉన్నారు. ఆ ఊళ్లో ఉండే జమీందారు గారుకూడా షష్టీచరణ్ పక్షమైనారు.

౬

పహారా అతికఠినముగా ఉన్నది, చస్తేనేగాని ఇంటిలో నుండి బయటికి వచ్చేమార్గ మున్నట్టు ఫకీర్ కి కానరాలేదు. పాట పాడుకొంటూ గదిలో ఒంటరిగా కూర్చున్నాడు.

పాటలోనుండే ఆధ్యాత్మికభావము చాలాభాగము ఇప్ప టికి తగ్గిపోయిందని వేరేచెప్పక్కరలేకుండా అందరూ గ్రహించి ఉంటారు. ఈవిధముగా కాలం ఏలాగునో గడిపి ఉండును, కాని మాఖన్ ఇంటికి తిరిగివచ్చాడని తెలియగానే మరది మర దళ్లదళాలు రెండు——ఈ అత్తవారింటి దగ్గరనుంచి ఒకటి, ఆ అత్తవారింటినుంచి ఒకటి——వచ్చి సిద్ధమైనవి. వీళ్లు, వస్తూనే,

ఫకీర్ గడ్డము మీసాలమీదపడ్డారు—వాటిని లాగుతూ, "ఇవి నిజమైన మీసాలనుకొంటున్నారా ఏమిటి? ఎవరూ పోల్చుకోకుండా ఉండాలని జిగురుపెట్టి అంటించినవి," అని కేకలువేస్తూ ఆనందించడము ప్రారంభించారు.

మీసాలుపట్టుకొని లాగుతూఉంటే, ఫకీర్ కంటె గొప్ప మహాత్ములకైనా, మాహాత్మ్యము నిలుపుకోవడము బహుకష్టం అవుతుంది. ఇదికాక చెవులబాధ ఉండనే ఉన్నది. బావమరుదులు ఒకేవరుసను చెవులు నులుపుతున్నారు—కాని వాళ్లు ఆడుతూఉండే మాటలవల్ల నులపకపోయినా ఫకీర్ చెవులు ఎఱ్ఱనౌతూ ఉన్నవి.

బావమరుదులు ఫకీర్‌కి, మైపళ్లు అందిచ్చి, ఈపాటా ఆపాటా పాడమని పురమాయించారు. వాటి ఆధ్యాత్మికార్థము బోధపరచడం ఫకీరుకు కాదుకదా, అతనిని మించిన పండితులకుకూడా సాధ్యంకాదు. ఫకీర్ భోజనానికి కూర్చుంటే కొబ్బరికాయనీళ్లు అని చెప్పి గుడుగుడు నీళ్లు, పాలని చెప్పి ముగ్గుపిండి కలిపిననీళ్లు ఇచ్చారు; పీటకోళ్లకింద గొంటుచెక్కలు పెట్టి ఫకీర్ చేత మొగ్గవేయించారు, కూర్చొనిఉంటే ఫకీర్‌కి తోకకట్టారు — ఈవిధంగా నానారకాల ప్రయత్నాలవల్ల ఫకీర్ గాంభీర్యం ఎగరగొట్టారు. అతను నిద్రపోతూఉంటే ముఖానికి మసిబొట్లు పెట్టారు.

ఫకీర్ కోపముతో మండిపడ్డాడు, వణుకుతూ కేకలు

వేశాడు —— ఏమిచేసినా ఆ అల్లరిపిల్లవాళ్లు భయపడలేదు. ఇంటికివచ్చిన వాళ్లకు ఇదిచూచి మరీ నవ్వుగా ఉన్నది. ఉండి ఉండి స్త్రీకంఠం ఒకటి, లోపలనుంచి వస్తూఉన్ననవ్వు, ఇంటిలో నుంచి వచ్చి ఫకీర్ చెవిని పడుతూఉన్నది. అది ఇంతకుముందు అత నెరిగినకంఠం, అతిమధురంగా ఉన్నది—ఆకంఠం విన్నప్పటి నుండీ ఓర్చిఉండడము ఫకీరుకు మరీ కష్టంగా ఉన్నది.

ఫకీర్ కి వినబడుతున్నది నిజంగా ఎరిగినకంఠమే. షష్ఠీ చరణ్ కి వరసకు మేనగోడలవుతుంది, హైమవతి అని ఒక ఆమె. హైమవతి అత్తగారిబాధ పడలేక పారిపోవచ్చి ఈ బంధువులఇంట్లో నాలుగురోజులూ, ఆబంధువులఇంట్లో నాలుగురోజులూ, ఉంటూ కాలక్షేపముచేస్తూ ఉన్నది. ఇప్పుడు ఈ మేనమామగారింటిని ఆశ్రయించిఉన్న హైమ వతి తెరచాటునుండి ఈ తమాషాఅంతా చూస్తూఉన్నది. ఈదృశ్యము చూడడంవల్ల నలుగురికి పుట్టినట్టు హైమవతికి కూడా సరదాపుట్టిందో లేక పగతీర్చుకొందామనే సరదా కూడా అందులో కలిసిందో మనము చెప్పలేము, మనోతత్వ జ్ఞులు చెప్పవలెను.

హాస్యపుసంబంధముగలవాళ్లు కొంతసేపటికి కాకపోతే మరికొంతసేపటికైనా ఫకీర్ ని వదిలిపెట్టేవాళ్లుగాని, అంత కంటె దగ్గరవాళ్లు ఒక్కక్షణమైనా అతనిని ఖాళీగాఉండ నీయడంలేదు. అతని ఏడుగురు కొమార్తెలు, ఒకకొడుకు,

ఆతన్ని ఒక్క నిమిషం వదలలేదు. తండ్రిఅనురాగాన్ని ఏలాగు నైనా తామే పొందవలెనని, తల్లులప్రోత్సాహమువల్ల, పిల్లలు తండ్రివద్దనే కూర్చుంటున్నారు. తనపిల్లలమీదనే తండ్రికి విస్తారము ముద్దు కలగవలెనని, ఒకభార్యకు మరిఒకభార్యకు పోటీగా ఉన్నది. ఇద్దరుభార్యలూ తమతమపిల్లలను పురికొల్పుతున్నారు—రెండు దళాలవాళ్లూ ఒకరిని వీగగొట్టవలెనని ఒకరు మరిఉత్సాహముతో పనిచేస్తున్నారు—మెడపట్టుకొని కౌగలించుకోవడం ఒకరైతే, ముఖముమీద పడి ముద్దుపెట్టుకోవడము మరిఒకరు, ఒళ్లో దూరడం ఒకరైతే వీపుమీద పడడం మరిఒకరు.

ఫకీర్ ఉదాసీనస్వభావముగలవాడు, దేనియందూ అనురాగములేనివాడు—అలాగుకాకుంటే తనభార్యను పిల్లలను విడిచిపెట్టి పారిపోడు. పిల్లలు, భక్తికనపరచడం ఎరిగినవాళ్లు కారు, సాధువులను వైరాగులను చూడగానే పరవశులవడం నేర్చుకొన్నవాళ్లు కారు, కనుక శిశుజాతిఅంటే ఎటువంటి ప్రేమా లేదు ఫకీర్‌కి—పురుగులను తోసేసినట్టుగా దూరముగా తోసేయాలని కోరుతూఉండేవాడు. అటువంటి ఫకీర్‌కి నేడెటువంటి దశ పట్టింది? హిస్టరీపుస్తకం విప్పేసరికి పేజీలోమధ్య పెద్ద అక్షరాలుంటవి, మార్జిన్‌లో ఇటూ అటూ చిన్నచిన్న అక్షరాలతో నోట్సు ఉంటవి. శిశు-పతంగాలచే చుట్టపెట్టబడిఉన్న ఫకీర్‌కి ఆ హిస్టరీపేజీదశ పట్టింది నేడు. పిల్లలలో కొందరు బాగాపెద్ద వాళ్లు, కొందరు బాగా చిన్నవాళ్లు, కాని పెద్దవాళ్లైనా

ఈడుకుతగిన బుద్ధి కనపడుస్తూ ఫకీర్ తో బాగా మాట్లాడువా మనే కోరిక కనపడచలేదు. దీనంతటివల్లా ఫకీర్, ఉండిఉండీ, కంట నీళ్లుపెట్టుకొంటున్నాడు—ఆ కన్నీరు ఆనందబాష్పాలు కావు.

పై వాళ్లపిల్లలు ఈవిధముగా, 'నాన్నా నాన్నా,' అంటూ నాలుగువైపులా అతనిని ముట్టడించి అతనిమీద అనురాగం కురిపిస్తూ ఉంటే, అందరిహృదయాలలోవలె తనహృదయము లోకూడాఉండే ప్రేమను పైకి వ్యక్తంచేదామని ఫకీర్ కి ఉండి ఉండి కోరికపుట్టేది. కాని భయపడి, ముఖము, కళ్లు, నోరు బిగించుకొని మాటాడక కూర్చుండేవాడు.

చివరకు మనస్సును మరి అణిచిపెట్టి ఉంచుకోలేక, "నేను వెళ్లి తీరుతాను, ఎవరు నన్నాపుతారో చూడనూ?" అని పిచ్చి వాడిలాగు కేకలువేసేవాడు.

ఊళ్లోని పెద్దమనుష్యులు ఒక ప్లీడరును తీసుకొనివచ్చి అతనిఎదుట నిలబెట్టారు. ప్లీడరు, "అయ్యా మీకిద్దరుభార్యలు-ఆమాట ఎరుగుదురా ?" అని అడిగాడు.

"చిత్తమండీ, ఇక్కడికి వచ్చినతరువాతనే ఆమాట నాకు తెలిసింది," అన్నాడు ఫకీర్.

"మీకు ఏడుగురు కొమార్తెలు, ఒక కుమారుడు. కొమార్తెలలో ఇద్దరికి పెళ్లిఈడువచ్చింది—"

"అయ్యా చిత్తము—నాకంటే మీరే బాగా ఎరిగి నట్టున్నారు చూడగా!"

"ఈ పెద్దకుటుంబాన్ని పోషించేభారం మీరు వహించని పక్షమందు మీమీద మీభార్య లిద్దరూ కోర్టుద్వారా చర్య నడిపించవలసిఉంటుంది—ఈమాట మొదటనే చెప్పిఉంచడము మంచిది."

ఫకీర్ కోర్టంటే జడిసేటట్టుగా మరిదేనికీ జడిసేవాడు కాడు. ప్లీడర్లు క్రాసుచేసేటప్పుడు మహాత్ముల మానమర్యాద లను మన్నించవలసినవారుకారని అతడెరుగును. ప్లీడర్లు ఎదురు పార్టీవారిని నలుగురిముందరా అవమానపరిచి ఆ సంగతి వార్తా పత్రికలలో ప్రచురింపిస్తారు. ఫకీర్ కంటనీరుపెట్టుకొని నిజ ముగా తానెవరో ప్లీడరుగారికి తెలియజేయవలెనని చాలా ప్రయత్నముచేశాడు. ప్లీడరుగారు సమ్మలేదు. ఫకీర్ కన పరుస్తూఉండే చతురతకూ, అతని తెలివితేటలకూ, దొంగకథలు కల్పించే అసాధారణశక్తికీ, అతనిని చాలా మెచ్చుకొన్నారు. ప్లీడరుగారి మాటలు వినగానే ఫకీరుకు తనకాళ్లూ చేతులూ కరుచుకుందామని బుద్ధిపుట్టింది.

ఫకీర్ పారిపోవలెనని ప్రయత్నిస్తున్నాడని తెలియ గానే షష్ఠీచరణ్ ఏడవడము ప్రారంభించాడు. ఊళ్లోవాళ్లు నలుగురూ చేరి నోటికివచ్చినమాటలన్నీ అన్నారు, ప్లీడరు కూడా బాగా తగలనిచ్చాడు—ఫకీరు మరి నోరుతెరవలేదు.

ఇదికాక ఆ ఎనమండుగురు పిల్లలూ అతనిచుట్టూ కూర్చొని ఊపిరితిరగకుండా అతనిని నాలుగువైపులా కౌగలించుకొన్నారు. ఇదిఅంతా చూచి లోపలనుండే హైమవతికి నవ్వడమో ఏడవడమో తోచిందికాదు.

మరిఏమీ ఉపాయము తోచక ఫకీర్ తన అవస్థను పూర్తిగా తెలియజేస్తూ తండ్రికి ఒక ఉత్తరం వ్రాసి పంపాడు. అతనితండ్రి హరిచరణ్ వెంటనే బయలుదేరి వచ్చాడు. ఊళ్లోవాళ్లు, జమీందారుగారు, ప్లీడరు—అంతా ఏకమైనారు, ఫకీర్‌ని ఎంతమాత్రము వదలమన్నారు.

అతడు ఫకీర్ కాడు మాఖనే అని స్థిరపరుస్తూ ఎవరూ ఖండించలేని ప్రమాణాలు అనేకము చూపించారు.

చంటివాడుగా ఉన్నప్పుడు మాఖన్‌కి పాలుపెడుతూ ఉండే మనిషిని తీసికొనివచ్చి ఎదుట నిలబెట్టారు. ఆ ముసలిది వచ్చి వణుకుతూ ఫకీర్ ఎదుట నిలబడి, గడ్డం కిందచేయివేసి, అతని ముఖమెత్తి, కన్నీటిధారలతో ఆ గడ్డాన్ని తడిపేసింది.

అప్పటికీ ఆ బైరాగి లొంగకుండా ఉండడము చూచి భార్యలిద్దరూ ముసుగులు తీసేసి గదిలో ప్రవేశించారు. పైవారంతా చీకాకుపడుతూ బయటికి వెళ్లిపోయినారు. గదిలో ఇప్పుడు మిగిలిఉన్నవాళ్లు, ఇద్దరు తండ్రులు, ఫకీరు, పిల్లలు, భార్యలు.

"ఏ పొయ్యిలో దూరాలి ఇప్పుడు, ఏద్వారముగుండా

యమలోకములోకి వెళ్ళాలి ఇప్పుడు?" అని చేతులాడించు కొంటూ ఇద్దరుభార్యలూ అడిగారు.

అది స్పష్టముగా కనపరచలేకపోవడమువల్ల ఫకీర్ నోరు మూసుకొని కూర్చోవలసివచ్చింది. యమలోకానికి ఉండే ద్వారాలలో ఏద్వారముయెడల అతనికి పక్షపాతమో అతని ధోరణివల్ల స్పష్టముకాలేదు, కాని ప్రస్తుతం ఏలాగునో అక్కడనుండి విముక్తుడు కాగలిగితే బ్రతుకులా దన్నట్టుగా అతని వ్యవహారంవల్ల బోధపడ్డది.

ఆసమయంలో మరిఒక రమణి ఆ గదిలో ప్రవేశించి ఫకీర్ కి నమస్కారముచేసింది.

ఆమెను చూడగానే మొదట నిశ్చేష్టుడైనాడు ఫకీర్, తరవాత ఆనందపరవశుడై, "ఇదిగో హైమవతి!" అన్నాడు.

తనభార్యగాని మరి ఏస్త్రీగాని అతనిహృదయములో ఇంత ప్రఫుల్లత ఇంతకు పూర్వ మెన్నడూ పుట్టించలేదు. ముక్తి మూర్తీభవించివచ్చి కళ్ళఎదుట నిలబడ్డదా అన్నట్లు అప్పు డతనికి తోచింది.

ఇంకొకడు శాలు వొకటి ముసుగువేసికొని తలుపు సందులోనుండి చూస్తూఉండెను—అతనిపేరు మాఖన్ లాల్. మాఖన్, తనస్థానంలో తానెరగనివాని నెవడినో కూర్చో బెట్టి తమాషాచూస్తూ ఇప్పటివరకు ఆనందిస్తుండెను.

కాని హైమవతి గదిలో ప్రవేశించగానే తా నెరగనివాడు తనచెల్లెలి పెనిమిటే అని పోల్చుకొన్నాడు. అతనిమనస్సు కరిగింది; అప్పు డతడుకూడా గదిలోకివెళ్ళి, తమవాళ్ళనే ఇంత కష్టపెట్టడముకంటె ఘోరమైన పాపములేదని అంటూ, తన భార్యలవైపు చూపిస్తూ "ఇదిగో వీళ్లు నా ఉరితాళ్లు," అని అన్నాడు.

మాఖన్‌కనపరచిన ఈ అసాధారణ మహాత్మ్యమూ, వీర్యమూ, చూచి ఊరువారందరు చాలా ఆశ్చర్యపడ్డారు.

# మహామాయ

రాజీవలోచనుడూ, మహామాయా — వీరిద్దరు ఏటి ఒడ్డున, పాడుపడిన దేవాలయములో కలుసుకొన్నారు. మహామాయ తన స్వాభావిక గంభీరదృష్టిని రాజీవునిమీద నిలిపి ఒక్కమాటఅయినా నోటితో అనక అతనిని చూస్తూ నిలుచున్నది. 'ఇట్టి వేళకానివేళను నన్నిచోటికి పిలవడం నీ కెంతటి సాహసం? నేటివరకు నీమాట ఎన్నడూ మీరకుండా ఉండడమే కదా నీ సాహసానికి కారణం?' అని రాజీవుని చీవాట్లుపెడుతూ ఉన్నట్టుండెను ఆచూపు.

మహామాయను చూస్తే మొదటనే భయం రాజీవునికి, ఇప్పుడామె ఈవిధముగా చూచేసరికి అతడు మరీ కంగారుపడ్డాడు. ఏవో రెండుమాటలు చెప్పవలెనని వచ్చాడు, ఈ కంగారులో ఆమాట లెగిరిపోయినవి. అయినా తానెందు కక్కడికి వచ్చినాడో దానికేదో కారణము చెప్పవలెను కదా—కనుక చప్పున, "మన మిక్కడనుంచి వెళ్ళిపోయి పెళ్ళిచేసేసుకొందాము," అని అనివేశాడు. తాను అనవలెననుకొన్న మాట లేమో అనడంఅయింది నిజమే, కాని ఆమాటలకుముందు భూమికగా అనవలసినమాటలుమాత్ర మననము కాలేదు. మాటలు ఎట్టి అలంకారమూ లేక మిక్కిలి నీరసముగా కనబడ్డవి, తనకే ఆశ్చర్యమువేసి, రాజీవు తడబడపడ్డాడు. అన్నమాట

లకు మరినాలుగుమాటలు కలిపి, వాటిని కొంచెముమృదువుగా చేసేసామర్థ్యము రాజీవునికి లేకపోయింది. నదీతీరానఉన్న పాడుదేవాలయములోనికి మట్టమధ్యాహ్నము తీసికొనివచ్చి ఈ బుద్ధిహీనుడు, "మనము పెళ్లిచేసుకుందాము పద," అని ఈ రెండుమాటలుమాత్రం అన్నాడు.

మహామాయ కులీనబ్రాహ్మణయువతి, వయస్సు ఇరవై నాలుగు సంవత్సరాలు, వయస్సుతోపాటు పరిపూర్ణతపొందిన సౌందర్యముకలిగి, పసిడి బంగారుబొమ్మలాగున ఉన్నది. శరత్కాలపు ఎండలోవలె దీప్తీ, నీరవమూ, కలిసిఉన్నవి ఆమెలో. ఆమె చూపులో నిర్భయమూ, ఉన్ముక్తత ఉన్నవి.

ఆమెకు తండ్రిలేదు; అన్న, భవానీచరణ్ మాత్రం ఉన్నాడు. అన్నదీ చెల్లెలిదీ ఇంచుమించుగా ఒకటే స్వభావము - నోటివెంబడి మాటఉండదు గాని, లోపల ఒక విధమైన శక్తి ఉన్నది—మధ్యాహ్నపు ఎండవలె సందడిచేయకుండా మాడ్చగలశక్తి అది. ఎట్టి కారణమూ లేకుండా భవానీచరణుని చూచి అంతా భయపడుతూండేవారు.

రాజీవునిది ఆ దేశము కాదు. అక్కడిపట్టుబట్టలఫ్యాక్టరీలోని పెద్దదొరగారు, తా నక్కడికి వచ్చినప్పుడు, తనతోకూడా, రాజీవుని తీసుకొనివచ్చాడు. రాజీవునితండ్రి ఈ దొరగారిక్రింద పనిచేస్తూండేవాడు. తండ్రిమరణానంతరము ఈ కుర్రవానిని పోషించే భారము దొరగారు తానే వహించి, బాల్యావస్థలో

ఉన్న ఆ కుర్రవానిని బామన్ హోటి పట్టుసాక్సరికి తనతోకూడా తీసుకొని వచ్చాడు. ఆకాలపువారలలో ఇటువంటిదయార్ద్ర హృదయంగలవాళ్లు అనేకు లుండేవారు. కుర్రవానిని ప్రేమతో పెంచుతుండిన పినతల్లికూడా పిల్లవానితో వచ్చింది. పీళ్లూ భవానీచరణూ ఇరుగుపొరుగు. రాజీవునకు మహామాయతో బాల్యకాలమునుండీ స్నేహం. రాజీవుని పినతల్లికి మహామాయ యెడల మిక్కిలి అనురాగము.

రాజీవునివయస్సు మెల్లిమెల్లిగా పదహారు, పదిహేడు, పద్ధెనిమిది దాటింది; పందొమిది కూడా కావచ్చింది. పినతల్లి ఎంతబ్రతిమాలుతూఉన్నా రాజీవుడు పెళ్లిచేసుకోనంటూ ఉన్నాడు. కుర్రవాడు హిందువుడైనా ఇటువంటిబుద్ధి కలిగి ఉండడము చూచి దొరగారు చాలా సంతోషించారు; రాజీవుడు అతనిని అనుసరణము చేసుకొన్నాడని దొరగారు తనలో తా ననుకొన్నారు — దొరగారు పెళ్లిచేసుకోలేదు. ఇంతలో రాజీవుని పిన్ని కాలం చేసింది.

ఇవతల తమకు సాధ్యముకాని ధనవ్యయముచేస్తేనే గాని మహామాయకు తగినవాడూ, కులసంపన్నుడూ అయిన వరుడు దొరకకుండా ఉన్నాడు. మహామాయకు వయస్సేమో పెరిగి పోతున్నది గాని, వివాహము కాకుండా ఉన్నది. పరిణయ బంధాలు ఏదేవతచేతిలో ఉన్నవో ఆత డేమో ఈ నర నారీయుగళంవిషయమై ఇప్పటివరకు ఉదాసీనత కనపరుస్తూ

నచ్చాడు, కాని ప్రణయ మెవరిచేతిలో ఉన్నదో అతడు మాత్రము సమయము వృథా వ్యయముచేయలేదు. వృద్ధ వివాహదేవత ఒకప్రక్కను కునుకుతూ ఉండెను, కాని కందర్పుడు మాత్రము మెలుకువగానే ఉండెను.

కందర్పభగవానుని ప్రభావము వేరువేరువ్యక్తులలో వేరువేరువిధాల పరిణమిస్తుంటుంది. అతనిప్రేరేపణవల్లనే రెండుమాటలు చెప్పడానికి అవకాశము దొరుకుతుందేమో అని రాజీవుడు చూస్తూ ఉండెను. అటువంటి అవకాశము దొరకనీయకుండా చేస్తూ ఉండెను మహామాయ. నోటమాటలేని మహామాయయొక్క గంభీరదృష్టి రాజీవుని మనస్సులో కలత పుట్టించి అతనికి భీతి కలిగించుతూ ఉండెను.

నేడెంతో కష్టంమీద రాజీవుడు మహామాయను ఆ పాడుదేవాలయములోకి రప్పించగలిగాడు. కనుక తాను చెప్పవలసిన నాలుగుమాటలూ నేడు చెప్పివేయవలెనని నిశ్చయించుకొన్నాడు—లభిస్తే దానివల్ల మృత్యుకాలమువరకూ సుఖము, లేదా బ్రతికిఉన్ననాళ్లూ మృత్యువు అనుకొన్నాడు. అటువంటి మహాక్షణములో రాజీవుడు, "మన పెళ్లిచేసుకొందాము," అనే ఈ రెండు చప్పిడిమాటలుమాత్రము అన్నాడు. అని పాఠాలు మరచినఅబ్బాయిలాగు తడబడపడుతూ నిలుచొన్నాడు.

రాజీవుడీప్రస్తావము చేస్తాడని మహామాయ ఊహించి

ఉండలేదు, ఆశించలేదు, కనుకనే చాలాసేపు నోరు తెరవక నిలుచున్నది.

మధ్యాహ్నమప్పుడు సదా వినబడుతుండే అర్థహీన శబ్దాలు అప్పటిని స్తబ్ధతను మరింత స్పష్టపరుస్తున్నవి. ఆలయద్వారానికి సగముఅంటే వేలబడుతున్న తలుపు, గాలికి తెరచి మూసుకొంటూ ఉండడమువల్ల, ఒకవిధమైన మృదుమంద ఆర్తనాదము పుట్టుతున్నది. కిటికీలో కూర్చొని పావురమొకటి కూస్తున్నది. బయట బూరుగుచూడిచెట్టుకొమ్మమీద కూర్చొని కంసాలి పిట్టఒకటి విరామము లేకుండా టక్కుటక్కుమని శబ్దము చేస్తున్నది. నేలపడియున్న ఎండుటాకులలోనుంచి తొండ ఒకటి జరజర శబ్దముచేసుకొంటూ పరుగెత్తుతున్నది. ఆ ప్రక్కనుండే బయలుపైనుంచి హఠాత్తుగా వచ్చిన వేడిగాలివల్ల చెల్లిసున్న ఆకులు శబ్దముచేసుకొంటూ ఆడుతున్నవి, హఠాత్తుగా మెలకువ తెచ్చుకున్న నదీజలము విరిగినపావంచాలను కొట్టడమారంభించింది. దూరాన, బయలుకు అవతలప్రక్కను చెట్టుకిందను కూర్చొని గొల్లపిల్లవాడొకడు పిల్లంగ్రోవి వాయిస్తున్నాడు— ఈవేణుగానము ఆ అస్పష్టముగా వినబడుతుండే ఇతర శబ్దాలతో కలిసి నెమ్మదిగా వస్తున్నది. తలఎత్తి మహామాయ ముఖమును చూచే సాహసములేక, రాజీవుడు కలగంటున్న వాడివలె దగ్గిరనున్న గోడకు చేరబడి నదీప్రవాహమువైపు చూస్తున్నాడు.

కొంతసేపయినతరువాత రాజీవుడు ముఖమెత్తి బిచ్చగానివలె మిక్కిలి దీనముగా మహామాయవంక చూచాడు. "అది ఏలాగు?" అని మహామాయ తల ఆడిస్తూ అన్నది.

ఆ తలఊపుతో రాజీవుని ఆశ మంటకలిసిపోయింది—మహామాయ స్వతంత్రురాలుఅనిన్నీ, ఇంకొకరి ఇచ్ఛానుసారము నడుచుకోవనిన్నీ, రాజీవు డెరుగును. తమ వంశములో ఎన్నితరాలనుంచి ప్రవహించుకొని వస్తూఉన్న కులాభిమానము మహామాయలో ప్రబలముగా ఉన్నది. అట్లాంటప్పుడు కులీనుడు కాని రాజీవుని పెళ్లాడడానికి మహామాయ ఏలాగు ఒప్పుకోగలదు? ప్రేమ వేరు, పెళ్లాడడము వేరు. రాజీవుని సాహసానికి తన బుద్ధిహీనతే కారణమని మహామాయ పోల్చుకొని తత్‌క్షణమే అక్కడినుంచి వెళ్లిపోబోయింది.

సంగతి బోధపరుచుకొని రాజీవుడు, "నేను రేపే ఈఊరినుంచి వెళ్లిపోతూ ఉన్నాను," అని చప్పున అన్నాడు. అది నాతో చెప్పడం ఎందుకన్నట్టు నటించవలెనని మహామాయ అనుకొన్నది, కాని చేతకాలేదు—అడుగువేయబోతే కాలు కదలలేదు—చివరకు నెమ్మదిగా, "ఏమి?" అని అడిగింది.

"మాదొరగారికి సోనాపూర్ ఫ్యాక్టరీకి బదిలీఅయిపోయింది, నన్ను తనతో కూడా తీసుకొనిపోతారట," అని రాజీవు డన్నాడు.

చాలాసేపటివరకు మహామాయ ఏమీ అనలేదు. ఇద్దరిది చెరి ఒకదారి అని తనలో తా ననుకొన్నది, శాశ్వతముగా ఎవరినీ నజర్‌బందీచేసి మన కళ్లఎదుట ఉండేటట్లు చేయలేము కదా అని తనలో తా ననుకొని నొక్కిపెట్టుకొనిఉన్న పెదవులు కొంచెము తెరిచి, "సరే," అని అన్నది. మాట అన్నదేగాని, ఆమాట మాటలాగు లేదు, అది పెద్దనిట్టూర్పులాగు ఉండెను.

ఆ ఒక్కమాట అని మహామాయ వెళ్లిపోబోతుండెను, రాజీవుడు ఉలికిపడి చూచి, "మీ అన్నయ్య అదుగో," అని అన్నాడు.

మహామాయ వెనుకకు తిరిగిచూచింది, అన్న దేవాలయము వైపు వస్తున్నాడు, వాళ్లిద్దరూ అక్కడ ఉన్నసంగతి పోల్చుకొన్నాడని బోధపడ్డది. మహామాయ ఆపదలో పడ్డదని తెలుసుకొని, రాజీవుడు మందిరము మొండిగోడ దుమికి పారి పోబోతూఉంటే, అతనిని వెళ్లనీయకుండా చెయ్యి గట్టిగా పట్టుకొన్నది. భవానీచరణ్ ఆలయములో ప్రవేశించి ఇద్దరినీ చూచాడు, ఒక్కమాట అనలేదు, నోరు తెరవలేదు.

మహామాయ రాజీవుని చూస్తూ, "రాజీవా నేను మీ ఇంటికి వస్తాను, నాకొరకు కనిపెట్టుకొనిఉండు," అని తడబడకుండా అన్నది.

భవానీచరణ్ ఆలయములోనుంచి బయటికి వచ్చాడు, అతని వెంటనే మహామాయ వచ్చింది. రాజీవుడు నిర్ఘాంతపోయి

అక్కడనే నిలబడిపోయినాడు. అతనిమీద ఉరిశిక్ష విధించారా అని చూచేవాళ్లకు అనిపిస్తుంది.

౨

ఆనాటిరాత్రే భవానీచరణ్ ఒక *ఎఱ్ఱచీర తీసుకొని వచ్చి మహామాయచేత పెట్టి, "ఈ చీరకట్టుకొని రా," అని అన్నాడు; మహామాయ చీర కట్టుకొన్న తరువాత, "నా వెంటరా," అని ఆమెతో అంటూ బయటికి వచ్చాడు. భవానీచరణుని ఆజ్ఞ—ఆజ్ఞ అన్నమాటే ఏమిటి, సౌంజ్ఞచాలును—ఎవరూ ఎన్నడూ మీర లేదు—మహామాయా మీర లేదు.

అప్పుడే ఇద్దరూ శ్మశానాభిముఖముగా నదీతీరానికి వెళ్లారు. ఇంటికీ శ్మశానికీ దూర మట్టేలేదు. నదియొడ్డున గంగాయాత్రికుల† బసలో మృత్యువుకొరకు కెదురుచూస్తూఉన్న ముసలిబ్రాహ్మ డొకడున్నాడు. వీరిద్దరూ వెళ్లి అతనిప్రక్కను నిలుచున్నారు. ఆ గదిలోనే మరి ఒకమూలను పురోహితు డొకడున్నాడు, భవానీచరణ్ సంజ్ఞచేయగానే ఆపురోహి

---

* బంగాళాదేశములో పెళ్లికూతురికి చేసే ముస్తాబు.

† గంగానదీతీరాన ప్రాణాలువిడిస్తే గొప్పపుణ్యమని నమ్మి, చావు దగ్గరపడుతున్నదని తోచగానే గంగాతీరానికివెళ్లి చనిపోయేవరకు అక్కడనే ఉండే అలవాటు బంగాళీలలో ఇప్పటికీ కద్దు; పూర్వము మరీ ఉండేది. గంగాయాత్ర చేయడమనగా గంగఒడ్డుకువెళ్లి చావుకొరకై కనిపెట్టుకొని ఉండడము. అట్లా చేసేవాళ్లు గంగాయాత్రికులు.

తుడు శుభకార్యము జరిగించడానికి కావలసినఏర్పాట్లు త్వర త్వరగాచేసి సిద్ధముగా నిలుచున్నాడు. ఆ స్మారకముతప్పిఉన్న ముసలివానితో తనకు పెళ్లికాబోతున్నదని మహామాయ గ్రహించింది, కాని లేశమాత్రమైనా అభ్యంతరపెట్టలేదు. గదిలో చీకటి, ఎదుట దగ్గరగానే రెండు శవాలు కాలుతున్నవి, ఆ చితాగ్నివల్ల గదిలో కొంచెము వెలుతురు పడుతున్నది, చావ సిద్ధముగాఉన్న ముసిలిపెళ్లికొడుకు ఉండిఉండి బాధవల్ల మూలుగుతున్నాడు. ఆ ఆర్తనాదంతో కలిసి గోణ గోణమని మంత్రోచ్చారణ జరిగింది, మహామాయ వివాహము పూర్తిఅయింది.

వివాహమైన మరుచటినాడే మహామాయ విధవ అయింది. ఈ దుర్ఘటనవల్ల ఆమెకు ఆట్టే బాధకలిగినట్టు కానరాదు. అకస్మాత్తుగా పెళ్లిమాట వినగానే రాజీవునికి తలమీద పిడుగుపడినట్లయింది, కాని మహామాయ వైధవ్యమునుగురించి విన్నప్పుడు అట్లా అనిపించలేదు. అంతేకాదు విని కొంచెము ఆనందించినట్టుకూడా ఉన్నాడు, కాని ఆ ఆనందము ఆట్టే సేపుండలేదు. నేడు శ్మశానములో గొప్పసందడి జరుగుతున్నదని రాజీవునికెవరో చెప్పారు—మహామాయ సహగమనము చేయబోతున్నదట. రాజీవునికి ఒంటిమీద తెలివిలేదు.

తన యజమానుడైన దొరగారిసహాయముతో బలం ప్రయోగించి సహగమనము ఆపుచేయించాలని రాజీవునికి

మొట్టమొదట బుద్ధిపుట్టింది. కాని దొరగారు బదిలీఅయి నేడే సోనాపూర్ వెళ్లిపోయినారు, రాజీవుని తనతో రమ్మనగా రాజీవుడు ఒకమాసము సెలవుకోరి ఉండిపోయినాడు—ఈ సంగతి సహగమనముమాట విన్నగడబిడలో జ్ఞప్తికిరాలేదు.

"నాకోసం కనిపెట్టుకొనిఉండు," అని మహామాయ రాజీవునితో అన్నది. ఈమాటను అతడెంతమాత్రము నిరాకరించజాలడు. ప్రస్తుతము మాసమురోజులు సెలవున్నది, అది రెండుమాసాలు చేయగలడు, అవసరముంటే మూడు మాసాలుకూడా చేయవచ్చు, చివరకు ఉద్యోగము విడిచిపెట్టి ఇంటింటా భిక్షమెత్తి పొట్టపోషించుకొనిఅయినా యావజ్జీవమూ కనిపెట్టుకొని ఉండగలడు.

రాజీవుడు, ఏదో ఉపాయము కనిపెట్టవలెను, లేకపోతే ఆత్మహత్యచేసుకొని చావవలెను—అనుకొంటూ పిచ్చివాడివలె ఇటూఅటూ పచారుచేస్తున్నాడు. సాయంకాలమయింది, అట్లాంటప్పుడు భయంకరమైన గాలివాన మొదలు పెట్టింది—ఇల్లువిరిగి తలమీద పడుతుందేమో అని భయము వేసింది రాజీవునికి—అంత గొప్పగాలి. పైగా ధారావర్షము. రాజీవునిమనస్సులోని ఘోరమైన ఆందోళన కనుకరణంగా బయటనుండిన ఈ మహావిప్లవము రాజీవుని మనస్సుకు కొంచెము శాంతికలుగజేసింది. సృష్టియావత్తు అతనికి తోడయి ఏదో ప్రతివిధానము చేయబలచుకొన్నదన్నట్లు రాజీవునికి తట్టినది.

రాజీవుడు తన యావచ్ఛక్తిని ప్రయోగించి గొప్పప్రయత్నము చేయవలెనని అనుకొంటున్నాడు, కాని చేయలేకున్నాడు. ఇంతలో స్వర్గమర్త్యపాతాళలోకాలను చుట్టడించి సృష్టి తన యావచ్ఛక్తినీ వినియోగించి పనిచేయడము మొదలుపెట్టింది.

అట్టిసమయాన బయటనుంచి ఎవరో తలుపు తోశారు. రాజీవుడు తలుపుతీసాడు. తలుపుతీయగానే స్త్రీ ఒకతె ఇంట్లోనికి వచ్చింది, బట్టలు తడిసిపోయిఉన్నవి, ముఖాన్ని పూర్తిగా కప్పుతూ ముసుగు ఉన్నది. ఆమె మహామాయ అని రాజీవుడు చూస్తూనే పోల్చుకొని, మహా ఆతురతతో, "మహామాయా, నీవు చితమీదనుంచి లేచి వచ్చేశావు కదూ?" అని అడిగాడు.

"అవును," అన్నది మహామాయ; "నేను వస్తానని నీతో ఒప్పుకొన్నాను. నామాటప్రకారము వచ్చాను. కాని రాజీవా, నేను మునుపటి-నేను కాను; అంతా పూర్తిగా మారిపోయింది. మారనిదంతా నా మనస్సే—లోనమాత్రము నేను మునుపటి మహామాయనే. ఇప్పుడైనా నీవు చెపితే తిరిగి చితమీదికి వెళ్లిపోతాను. నన్ను నీతో ఉంచిపోమంటేమాత్రము నాముసుగెన్నడూ తీయననీ, నాముఖ మెన్నడూ చూడననీ, నీ వొప్పుకోవాలి."

మృత్యువునోటినుంచి తప్పించుకు రావడమే చాలు, అట్టి పరిస్థితులలో, ఆ వచ్చినవాళ్లు మనను ఏమిచేయమన్నా చేయ

గల పునిపిస్తుంది. రాజీవ్రుడు తత్ క్షణమే జవాబు చెప్పాడు, "నీ ఇష్టమువచ్చినట్లు ఉండు, నేను ఏదైనా ఒప్పుకొంటాను, కాని నన్ను వదలి తిరిగి వెళ్లిపోతేమాత్రము నేను మరి బ్రతికి ఉండలేను."

"అట్లాగైతే ఇప్పుడే పద, మీవారుగాలికి బదిలీఅయిన చోటికి వెళ్లిపోయి అక్కడనే ఉందాము," అని అన్నది మహామాయ.

ఇంట్లోని సామానంతా ఇంట్లోనే వదలిపెట్టి, మహామాయను తోడబెట్టుకొని, ఆగాలివానలోనే, రాజీవ్రుడు బయలుదేరాడు. గాలిజోరు చెప్పతరముకాదు. నిలబడిఉండడమే కష్టముగా ఉన్నది. చిన్నచిన్నరాళ్లూ, ఇసకా, కాళ్లకు తగులుతున్నవి. చెట్లకొమ్మలు విరిగి తలమీద పడతవనే అనే భయమువల్ల వాళ్లిద్దరూ దారివిడిచి ప్రక్కను బయలువెంబడి పోతూఉన్నారు. వెనకనుండి గాలి తోస్తుఉన్నది. గాలివాన వీరిద్దరినీ మనుష్యసంఘమునుంచి విచ్ఛేదముచేసి మహాప్రళయమువైపుకు గెంటుకొనిపోతున్నదా అనిపిస్తున్నది.

౩

చదువరులు ఇది కేవలము అసంభవమని అనుకోకూడదు, ఎన్నడూ ఇట్లాంటివి జరగలేదు అని అనుకోకూడదు. సహగమనము ఉత్తమాచారమని మనదేశస్థులు నమ్మిఉన్నరోజులలో

అప్పుడప్పుడు ఇట్లాంటివి జరుగుతుండేవని విన్నదానివల్ల తెలుసుకోగలము.

కాలుచేతులు కట్టి మహామాయను చితమీదకి ఎక్కించి అగ్ని దేవతకు సమర్పించారు. నిప్పంటుకొని మంట ప్రారంభం అయింది. సరిగా ఆ సమయానికి పెద్దగాలీ, ధారావృష్టీ, ఆరంభ మయినవి. దహనముచేయడానికి వచ్చినవాళ్లందరూ తొందర తొందరగా గంగాయాత్రికునిగుడిసెలోకి పరుగెత్తి లోపలి నుండి తలుపు గడియవేశారు. వానకు చితానలము నిలపలేక పోయింది. మహామాయ చేతికట్లు కాలి తెగిపోయినవి. ఆమెకు దాహమువల్ల గొంతు కార్చుకుపోయి నోట మాటరాలేదు. తత్ క్షణమే లేచి కాళ్లకట్లు విప్పుకొన్నది, అక్కడక్కడ కాలి పోయినబట్ట ఏదోవిధముగా సవరించుకొని చితమీదనుంచి దిగి ఇంటివైపు పరుగెత్తింది. తిన్నగా ఇంటికి వెళ్లింది, ఇంటి తలుపులు వేసిఉన్నవి, ఇంట్లో ఎవ్వరూ లేరు—శ్మశానము నుంచి ఎవరూ ఇంకా తిరిగిరాలేదు. దీపము ముట్టించి శుభ్ర మైన బట్ట కట్టుకొని అద్దములో ముఖము చూచుకొన్నది. అద్దము నేలమీద విసిరికొట్టి, కొంచెముసేపేమో ఆలోచించి, తలమీద ముసుగువేసుకొని, ఆ ముసుగును బాగా క్రిందికి లాగి, రాజీవుని ఇంటివైపు బయలుదేరింది. అతని ఇల్లు అక్కడికి ఆట్టే దూరములేదు.

అప్పటినుంచి మహామాయ రాజీవుని ఇంటిలోనే ఉన్నది, కాని రాజీవునికి సుఖము లేదు. వారిద్దరికి మధ్యనున్న అడ్డు ఆ ముసుగుమాత్రమే. ఆ ముసుగు మృత్యువువలె శాశ్వతముగా ఉండవలసినదే. కాని ఈ అడ్డు మృత్యువుకంటె అధిక బాధను కలుగజేసేటటువంటిది—ఎందుచేతనంటే, మృత్యువు విచ్ఛేదవేదనను కలిగించినా, నిరాశవల్ల దుఃఖము క్రమముగా తగ్గిపోతుంది; ముసుగువల్లకలిగే విచ్ఛేదము నిరంతరమూ ఆశను కల్పించి పీడిస్తూ ఉంటుంది.

అసలే నోరుతెరవని స్వభావము మహామాయది, పైగా ఇప్పు డీముసుగు ఆ నిస్తబ్ధతను రెండింతలుచేసింది. నాలుగువైపులా మృత్యువూ, మధ్య తానూ అన్నట్టుగా ఆమెకు అనిపిస్తూ ఉన్నది. ఆమెచుట్టూ ఉన్న ఈ నిస్తబ్ధమృత్యువు రాజీవుని రాత్రింబగళ్లు విడువకుండా ఉన్నది. అది అతని హృదయాన్ని చీల్చివేస్తున్నది. రాజీవుడు తానెరిగిన మహామాయను పోగొట్టుకొన్నాడు. ముసుగువేసుకొని సదా ప్రక్కను తిరుగుతున్న ఈమె అడ్డుగా ఉండడమువల్ల, రాజీవుడు, బాల్యకాలమునుండి తనమనస్సులో నాటిఉన్న మనోహరమూర్తిని తీసికొనివచ్చి తన ఇంట స్థాపించుకోలేక పోయినాడు. రాజీవు డప్పు డనుకుంటాడు—మనిషికీ మనిషికీ మధ్య స్వభావసిద్ధముగానే కావలసినంత అడ్డుఉంటూ ఉన్నది. ముఖ్యముగా మహామాయ, పురాణములోవర్ణించిన కర్ణునివలె, కవచధారిణి. జన్మ

గ్రహణ చేసినప్పటికీ ఆమెస్వరూపాన్ని మర్చిపోని ఒక [illegible] ఉండెను. పైగా కృష్ణుడు మరి ఒకకొత్త ఆవరణతో మరి ఒకమారు జన్మగ్రహణచేసింది. రాజీవుని ప్రక్కనే సదా ఉన్నా, ఎంతోదూర మయిపోయింది. రాజీవు డామూయ మబ్బుల వెలపల నిలబడి తనహృదయములో ఉండే పిపాసను తీర్చుకో లేకుండా ఉన్నాడు. అతి సూక్ష్మమైనటువంటిదిన్నీ, తెలుసు కోడానికి కొంచమైనా తావియ్యనటువంటిదిన్నీ అయిన ఆ రహ స్యము తెలుసుకొందామని ప్రయత్నము చేస్తున్నాడు. కాని అంధకారనిశీథినిని ఛేదించడానికి, నిద్ర లేక, రెప్పవేయక, ప్రతి రాత్రి నక్షత్రాలుచేస్తూఉన్న ప్రయత్నము ఏవిధముగా నిష్ప్ర యోజన మవుతున్నదో, రాజీవుని ప్రయత్నముకూడా ఆవిధ ముగా ఫలములేని దవుతున్నది.

ఈ దేరీతిని ఈ ఇద్దరూ కొంతకాలము ఒకేఇంట కాపు రముచేశారు, ఆమె ఒంటరి, ఇతనూ ఒంటరి.

వర్షాకాల ప్రారంభములో ఒకనాటిరాత్రి, మేఘాలు చెదిరి, చంద్రుడు ప్రకాశించడము మొదలుపెట్టాడు. శుక్ల పక్షము, ఆ నాడు దశమి. నిద్రిస్తూఉన్న పృథ్వీశిరస్సుదగ్గిర జ్యోత్స్నరాత్రి నిద్ర మాని, కూర్చొని ఉన్నట్టున్నది. రాజీ వుడుకూడా నేడు నిద్రమాని తన కిటికీలో కూర్చొనిఉన్నాడు. దగ్గరనే వనమునుంచి అలసటచెందిన ఝిల్లీరవము వస్తూఉన్నది, ఘనముమధ్యనుండేఉష్ణతనుంచి లేస్తూఉన్న గంధము రాజీవుని

గదిలో ప్రవేసిస్తున్నది. చీకటితో నిండిఉన్న చెట్లవరసప్రక్కను, నిద్రిస్తూఉన్న కొలను మెరుగుపెట్టిన వెండిఆకువలె ఆవెన్నెలలో తళక్కు తళక్కు మనుచున్నది. అటువంటి సమయములో మానవు డేమైనా ఆలోచిస్తూ ఉంటాడో లేదో చెప్పడము కష్టము, కాని లోపలనుండే సమస్తమూ ఏదో ఒకవైపుకు ప్రవహిస్తూమాత్రము ఉంటుంది—ఆ వనములోనుంచి ఏదో ఒక విధమైన గంధమో ఝుల్లీకసమో వస్తూ ఉన్నట్టుగా, మనలోనుంచి కూడా వస్తూఉంటుంది గాబోలు. రాజీవు డేమి అనుకొంటున్నాడో చెప్పడము సులభముకాదు కాని పూర్వపు నియమాలన్నీ నేడు విరిగి ముక్కలైనవని అతనికి తోచింది. వర్షాకాలపురాత్రి నేడు తన మేఘావరణను పారవేసింది. నిశీథిని నేడు ఆనాటి మహామాయవలె నిస్తబ్ధసౌందర్యములో నిండి ఉన్నది. రాజీవుని సర్వస్వమూ మహా మాయవైపు పరుగెత్తడము మొదలుపెట్టింది.

రాజీవుడు, నిద్రలో నడుస్తున్నవానివలె, లేచి మహామాయపడకగదిలో ప్రవేశించాడు—మహామాయ హాయిగా నిద్రపోతున్నది.

రాజీవుడు మంచముదగ్గరకు వచ్చి తలదించి చూచాడు—మహామాయ ముఖముమీద వెన్నెల పడుతున్నది. కాని ఏమది! చిన్ననాటినుంచి తా నెరిగిఉన్న ముఖ మేది! చితానలశిఖ తన నాలికతో మహామాయముఖము యొక్క ఎడమప్రక్కను బహునిర్దయతో నాకి తన క్షుధా

చిహ్నాన్ని ఆమె ముఖముమీదనుఉంచి, ఆమెను కురూపిగా చేసి మరీ పోయిందే.

రాజీవుడు ఉలికిపడి ఉండవచ్చును, అవ్యక్తమైనశబ్దము కూడా అతని నోటిలోనుంచి వెడలి ఉండవచ్చును. మహామాయ ఉలికిపడి లేచి చూచింది, ఎదుట రాజీవుడు నిలుచొని ఉన్నాడు. మహామాయ చప్పున ముఖముమీదికి ముసుగును లాగుకొని లేచి నిలుచున్నది. మీద పిడుగుపడబోతున్నదని రాజీవుడు తెలుసుకొన్నాడు, తెలుసుకొని మహామాయ కాళ్ల మీద పడి, "నన్ను క్షమించు," అని అన్నాడు.

మహామాయ ఒక్కమాటఅయినా అనలేదు, గదిలో నుంచి బయటికి వెళ్లిపోయింది. వెనకకుతిరిగి చూడనైనా చూడలేదు. అటుపైన ఎన్నడూ మహామాయ రాజీవుని ఇంటికి మరి రాలేదు. ఆమె ఎక్కడ నున్నదీ ఎవ్వరూ ఎరుగరు. యావజ్జీవమూ ఉండవలసిన క్షమాహీనమైన ఆ ఎడబాటు రాజీవుని ఇహజీవనముపైని ఒక దగ్ధచిహ్నాన్ని ఉంచింది.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1949